




# ఎమెస్కో వచన రామాయణం

శతావధాని కోట వీరాంజనేయ శర్మ

# ఎమెస్కో వచన రామాయణం

## (ఎనిమిదవ సంపుటం)

రచన :

శతావధాని కోట వీరాంజనేయ శర్మ



196


యం. శేషాచలం అండ్ కంపెనీ

మచిలీపట్నం - సికింద్రాబాదు

EMESCO VACHANA RAMAYANAM - Vol. 8

*as retold by* :

SATAVADHANI KOTA VEERANJANEYA SARMA



*first edition* :

APRIL 1981

*publishers* :

M. SESHACHALAM & CO.,
Machilipatnam - Secunderabad.

*cover design* :

B A P U

*printers* :

LEELA PRINTERS,
Secunderabad.



Price : Rs. 5_00

*distributors* :

M/s. ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
3237, Rashtrapathi Road, Secunderabad - 500 003.



196

# ద్వాదశాదిత్య మండలంవలె ప్రకాశించే

# 12 సంపుటాల ఎమెస్కో వచన రామాయణ ప్రాశస్త్యం

ఏనాడు వాల్మీకి మహర్షి అపార తపశ్శక్తితో వేదాన్ని రామాయణాత్మకంగా ఆవిష్కరించాడో ఆ నాటినుండి అవిచ్ఛిన్నంగా శోభోపశాఖలతో బహు నామాలతో ఆ కల్పవృక్షం భారతాన్ని పుణ్యభూమిగా, కర్మభూమిగా చేసి దిగ్దిగంతాలకు ప్రాకింది. ఇంకా ప్రాకుతుంది. అందుకే ఒక కవి "రాఘవేశ్వర చారిత్రము నెందరెన్ని గతులన్ వర్ణించినన్ గ్రాఁదే" అని అన్నాడు. మేం కూడా ఆ పవిత్ర భావంతోనే ఈ మహాకార్యానికి పూనుకున్నాం. ఈ నూత్న ప్రయత్నంలో ఒక విలక్షణమైన మార్గం త్రొక్కటం జరిగింది. వేదానికి వేదం ప్రమాణంలాగా వాల్మీకి రామాయణానికి వాల్మీకియే ప్రమాణంగా అనువాదంలోనే అపవాదులు పరాస్తం చేయబడినై. యథాతథంగా అనువదించినా స్వతంత్ర కావ్యంవలే చదువరులకు ఆనందం కలిగిస్తుంది. ఎన్నో గ్రంథ గ్రంథులున్నై. ఎన్నో పూర్వాపర విరుద్ధాలున్నట్లు పైకి కనుపిస్తాయి. వచ్చిన కథలేవన్నై. ఒకచోట శంకకు ఎక్కడో పరిహారం వుంటుంది. ఈ చిక్కులన్నీ ఇందులో విడదీయబడినై. తైలధారవలె అవ్యాహతంగా రచనా స్రోతస్సు ప్రవహిస్తుంటే చవిటినేలలు, కేదారఖండాలు, నల్లని, ఎర్రని, రేగడ భూములు, నిస్సార నిరుపయోగ ప్రదేశాలు సస్యశ్యామలంగా మారి ఫలానుభవంతో ఇహపర సుఖాలు తమంతతామే కోరి వరించి వన్నై. ఈ రచనా విన్యాసం సరికొత్తది. పండిత పామరభేదం లేకుండా స్త్రీ శిశు విచక్షణ లేకుండా అందరికీ రామాయణ కల్పవృక్ష ఫలాలను అందిస్తుంది. ఏ అనుమానం వచ్చినా ఈ రామాయణం ఆ ఘట్టంలో చూసుకుంటే తెలుస్తుంది. ఇంతకు పూర్వం తెలియని ఎన్నో రహస్యాలు వెలికి తీయబడినై. ఉదాహరణకు దశరథుడు ముగ్గురు భార్యలకు పాయసం నాల్గుభాగాలెందుకు చేశాడు? వాలి వధ ఎందుకు ధర్మబద్ధమైంది? తార పతివ్రతగా ఎందుకు ఆరాధ్య అయింది? సీతా పరిత్యాగంలో రాముడు అన్యాయం చేశాడా? ఇంకా ఎన్నో ఎన్నో - ఈ బృహత్కార్యం ఎందుకు సంకల్పించామో చదివి చదువరులు సాక్షులు గండి.

—:o:—

స్వామి! భవత్కృపాప్రబలసంగతి వేదపసంపుటంబునున్
భూమి భవాత్మదేవు పదముల్ స్పృశియింప ఘటించినాను గో
ధామయసూనపట్టులుగఁ, బావని! అష్టమ సంపుటంబునుం
బాపుర పంచితాళి భవబంధహరంబుగ వ్రాయఁబూనుమా.

సూర్యునికి ఛాయ ఎట్లో, నేను శ్రీరామునికట్లు. నన్ను అశాశ్వతమైన, క్షుద్రమైన బాహ్యసుఖాలు చూపి కొనతలచుకున్నావా? అవివేకీ! నను వంచనచేయటం నీ దశశీర్షాలకే కాదు సహస్ర శీర్షాలుకల అనంతుడికే సాధ్యంకాదు. నిక్కమైన స్నేహితుడవనీ, బంధువు అనీ, భర్తవనీ, ఏలికవనీ నమ్మి చేరిన వారంతా వంచనాత్మకుడవైన నీచే నిష్కారణంగా నశిస్తారు. నా కోసం కాక వారికోసం ఏడువు. ఫలితం దక్కుతుంది. నా భర్త జగదేకవీరుడు. జగన్నాథుడు. ఆ పూజ్యుని హస్తం దిందుగా శయనించే అర్హత కోల్పోయి, త్వరలో నాశం కాబోతున్న నీ సంపదను కాపుకుంటానని నీవెలా అనుకున్నావు? నీ పదితలల్లో ఏ ఒక్క తల కూడా ఈ ఆలోచన చేయలేదా? నీ అజ్ఞానానికి నాకే సిగ్గు కలుగుతూంది. సాంగంగా వేదంచదివి, సత్యం శీలం కల్గి సాధు సంగతిలో సభ్యతా సంస్కారాలు పొంది, జ్ఞాని అయిన రామచంద్రునకు నే తగిన భార్యను కాని, నీ బోటి నీచునకుకాదు. నీవనవచ్చు. ఆ లక్షణాలన్నీ నాకూ వున్నవి. ఆ మాట చాలవరకు సత్యదూరం కాదు. ఆయన స్వజాతి రక్షణ కోసం, సర్వలోక కల్యాణం కోసం అవతరించినవాడు. నీవు వరబలంతో, దౌష్ట్యంతో, క్రూర కార్యాచరణుడవై, భావిని గుర్తించలేక స్వజాతి నాశనానికై జగత్కంటకుడవై జన్మించావు. నీ అర్హతకూ, అధికారానికీ తగిన భార్యలు లభించారు. వాళ్ళు కూడా నిషధయోగ్యలు. భర్తృప్రణయైక జీవలు. వాళ్ళతో సుఖించు. ఇంకా కొన్నాళ్ళు జీవించాలంటే, లంకేశ్వరుడుగా రాణించాలంటే, నీ సతుల మంగళసూత్రం మంగళప్రదంగా వుండాలంటే, దండధరుని కాలపాశం బిగువుతనం తెలియవలెననే కోరిక కల్గకుండా వుంటే, నా భర్త, నా మరిది కోదండధరులై నీపై తరలిరాకముందే, నా పతికి నన్ను అప్పగించి "వేసింది తప్పు"ని చెంపలు వేసికొని క్షమాభిక్ష అర్థించు. ఆయన పురుషోత్తముడు, నరసింహుడుకూడ. నీ దుడుకుపాటు క్షమిస్తాడు. రాఘవులకు శరణాగత రక్షణం వెన్నతో

పెట్టిన విలువకందని గుణం. ఈ దురాగతవాంఛమాను. నా పతి ఎంత శూరుడో అంత దయాహృదయుడు. ఆయన కోరేది నన్నుగాని నీ తప్పుకు శిక్షించటంకాదు. నన్ను ఆయనకు సమర్పిస్తే, నీకు సర్వశుభాలు జరుగుతై. నేను నీ క్షేమంకోరి, నీ దోషాన్ని, నీ దురుక్తులనూ, మరచి చెపుతున్నాను. నీవు కాలుని ప్రేరణచే నా హితవు పాటించకపోతే నీకు త్వరలో మృత్యువుతప్పదు. నీకాయన శక్తి తెలియదు. తెలిసినా అహంకారంతో గణించకున్నావు. ఇంద్రుని శతారపాతం తప్పవచ్చు. యముని దృష్టిలోపడకుండాకొంతకాలం జీవించవచ్చు. విష్ణుసుదర్శనం, ఈశ్వర త్రిశూలం, నా పతి బాణం ఒకటే. తిరుగులేదు. వర్షసమయంలో వరుణుడు వదలే పిడుగులవలె కోదండటంకార నిర్గతాలై శరాలు గుండెలో నాటుతుంటే ఆ ధ్వని అప్పుడు వినగలవు కాని, మనలేవు సుమా. విషానలార్చులు క్రక్కుతూ సోదర ధనుర్నిర్గత మార్గణాలు కోడెత్రాచుల్లాగా పైకవిసి నిన్నూ, నీ లంకనూ, నీ వారినీ బూడిద చేసేటప్పుడు నా పలుకులు నీకు నెమరుకు వస్తై.

కాలసర్పాలను గరుత్మంతుడు కాళ్ళతో చిమ్మినట్లు, నా పతి సుపర్ణుడై, రాక్షస సర్పాల ప్రాణవాయువులను అశుగత్రోటితో ఆహరించేటప్పుడు "కుడిచి కూర్చుండక రామపత్నిని ఎందుకు తెచ్చా"నని ఏడుస్తావు. బలిచక్రవర్తి కైవసమైన స్వర్గపదం, త్రివిక్రమాకృతితో వామనుడు తిరిగి గైకొన్న చందంగా, నీదర్పం, నీలావు, నీఅహంకారం తూలించి నన్ను నాపతి గ్రహిస్తాడని కొలది కాలంలోనే తెలుసుకుంటావు. ప్రస్థానార్భటి దిశలు మ్రోగగా, జనస్థానంలోని రాక్షసులంతా ఎత్తివచ్చి ఒక్క నా పతిచే కొలది ఘడియల్లో నాకస్థానంచేరి స్వస్థానాన్ని హతస్థానంగా చేశారన్న సంగతి నీకు తెలుసు. నీవు ఏపాటి వీరుడవని నన్నర్థించవచ్చావు? పర్ణశాలలో ఒంటరినై వుండగా దొంగవలె వచ్చి నన్ను అపహరించుకుని తెచ్చావు. అంతేకాని, నా భర్తను జయించి నన్ను కొనిరాలేదుగదా. రాక్షసరాజా! ఈ కొరమాలిన బుద్ధి మానుకో. నీవు హితవైన నా బోధను వినక యుద్ధానికి సిద్ధపడితే, క్రూర విషానలాన్ని వెదల గ్రక్కుతూ, భయంకరమైన కోరలు పదును పెట్టేందుకు పైకి దూకే ఫణి సంతానంవలె నా పతీ, నా మరదీ విడిచే శర

పరంపర నీ ఎద నాటి నీ వేడి రక్తాన్ని పీల్చుతూ వుంటే, లంకంతా ఖాండవంగా దగ్ధమైపోతుంటే ఆదరించేవారుకాని, ఆదుకునేవారుకాని లేక అల్లాడి అసువుల విడుస్తావు. నీ అతిమానపాత్రలైన అంగనల మంగళ సూత్రాలు అగ్నిలో ఆహుతియైపోతుంటే, హతశేషుల హాహాకారాల్తో దిశలు ప్రతిధ్వనిస్తే. తగరు పొగరుతో నగాన్ని ఢీకొన్నట్టు నా భర్తతో తగవు పెంచుకున్నావు. దండధరుని నగరానికి పోబోతున్నావు. నా మాటలు నీ చెవికెక్కవు. నీ బలం వైరిబలం అతి ముగ్ధుడవై అంచనా తప్పుగా వేశావు. దశరథులు కేవలం మానవులుగానే భావించావు. అవని భారం హరించటానికి ఆవిర్భవించిన దైవ స్వరూపులని తెలుసుకోలేక పోయావు. ఇంద్ర వజ్రాహతికి వృత్రాసురుడు నశించినట్లు నా పతిచే నీవు చచ్చిపోతావు. ఆయన వార్ధి తరించి వస్తాడు. గ్రీష్మ కాలంలో దివాకరుడు అల్ప తోయాన్ని ఆహరించినట్లు ఈ విశాల విశ్వంలో ఎక్కడ దాగినా నీ ప్రాణవాయువులు హరిస్తాడు" అంటూ నిష్కర్షగా, నిర్భయంగా, నిర్మమకారంగా, నిశ్చయమైన పలుకులు సీత పలికింది.

## రావణుడు సీతాదేవిని బెదిరించుట

ఆ మాటలకు అసురనేత క్రుద్ధుడైనాడు. ఆగ్రహంతో, అనరాని, వినరాని కఠోరవాక్యాలు ఊహుంకరించి అనసాగాడు. "ఓ సీతా! మానవ కాంతా! ఎంతెంత మాటలన్నావు? నా సంగతి నీ వెరుగవు. నేను చెప్పటం అంత మంచిదికాదు. పురుషతత్వం నీకు పూర్తిగా అవగాహన కాలేదు. వాడెంతంతగా ప్రార్థిస్తాడో అంతకంతగా ఆడదానికి అతి సన్నిహితంగా వచ్చి పలుచవుతాడు. అది తెలియని ఆడవాళ్ళు అతని ప్రియ వాక్యాలు తమ సౌందర్య చతురోక్తులతో సంపాదించుకున్నామని భావించి తిరస్కారం చూపిస్తారు. ఆ వెంటనే అతనికి దూరమై అనర్థాలకు పాల్పడతారు. గతితప్పి నడిచే గుర్రాలను చోదకుడు సరిగా నడిపించినట్లు నీపై నాకున్న కామభావం నీ వాక్యాలకు పొంగివచ్చే కోపాగ్నిని చల్లారుస్తుంది. అందుచేతనే దండ్యవైన నిన్ను క్షమించాను. లేకపోతే ఈ పాటికి నాకృపాణానికి నీ ప్రాణాలు గ్రహించబడి వుండేవి. సీతా! నా పరిపూర్ణ కామ వాంఛను నీవు నిరాకరించి శిక్షార్హవైనావు. అయినా నేను కాముకుడనే

కాక ప్రభువును కూడ. నా ప్రేమభావం నీకు రక్షణ కల్పించింది. నేను సహనం చూపినకొద్దీ నీ పరుష భాషణాలు హద్దులు అతిక్రమించినై. ఇంకా నీపై నా భావం యథాతథంగానే వుంది. ఏనాటికైనా నీవు నా దాసివే. నీపట్ల విసరత చూపించదల్చుకోలేదు. నీకు ఇంకా రెండునెలలు వ్యవధానం ఇస్తున్నాను. ఇదే చివరి గడువు. ఈ లోపల పూర్వాపరాలు పరిశీలించుకుని నా శయ్యను గ్రహించు. అప్పటికీ నీ మూర్ఖత విడువకుంటే నీ శరీరం నాబోనగత్తెలు ముక్కలుగా కోసి ఉదయం భోజనార్థం పచనం చేసి వడ్డిస్తారు. నేనెంత సాత్త్వికుణ్నో అంత క్రూరుణ్ణి. మాటంటే మాటే. ఆరునూరైనా నూరు ఆరైనా జరిగితీరుతుంది. నీవు పేరాశతో చూసే నీ భర్త ఎలా రక్షిస్తాడో నేనూ చూస్తాను. ఎంతో ఆశించితెచ్చి ఇంతవరకు ఓర్చుకున్న నా సాధువర్తనాన్ని చవుక చేస్తే ఫలితం అనుభవించి తీరుతావు. ఒకనాడు కాదు, రెండునెలల కాలం అవకాశం ఇచ్చాను. ఇది నా బలహీనతగా భావించకు సుమా!" అంటూ ప్రళయ నిర్ఘాతపాతం వంటి పలుకులతో జానకిని బెదరించాడు. హెచ్చరించాడు. అహంకారం ప్రదర్శించాడు. ఆక్రోశించాడు. ఆ రాక్షసేంద్రుని కఠోర శాసనం విన్న నిర్జర గంధర్వాంగనలు వెలవెల పోతూన్న వదనాలతో, స్వేదసిక్తమైన కాయములతో వికారాన్ని పొందిన వీక్షణాలతో మర్త్యకాంతకు జరిగిన అవమానానికీ, అనుశాసనానికీ మర్త్యభావంతో మరిగిపోయారు. ఆ దానవ ప్రభువు ఆగ్రహోదగ్రుడై, కన్నులు నిప్పులు రాల్చగా చూస్తూ అన్న మాటలకు అవనిజ వాతాహతలతవలె వణికిపోయింది. బ్రతుకుపైన ఆశ సన్నగిల్లింది. భోరుమని ఏడ్వసాగింది. ఆ సమయంలో, రావణుని వెంట వచ్చిన వేల్పు కాంతల్లో కొందరు పెదవులు కదలించి, కొందరు కన్నులతో సైగలు చేసి, కొందరు మొగాలను అటునిటు ఆడించి ఆమెకు కొంతధైర్యం కలిగించారు. ఆ సంకేతాలను సీత అర్థం చేసుకుని ధైర్యం పొందింది.

## సీత రావణుని పరుషంగా నిందించుట

దేవకాంతల హెచ్చరికవల్ల ధైర్యంతోపాటు తెలివి తెచ్చుకుని, తన పతి అసాధారణ పరాక్రమాన్నీ, అచంచల ప్రేమానురాగాలనూ

స్మరించి, అప్పటికి తన క్షేమం ఆశించి మండుతున్న అగ్నివలె వున్న నిశాచరపతిని లక్షించి, దిగులుడించి, ధృతివహించి, దీర్ఘంగా నిశ్వసించి "ఓరీ! దుష్టబుద్ధీ! నాకంతా అర్థమైంది. నా శుభం కోరుతున్నానని ప్రగల్భాలు పలుకుతున్నావు. నీ శుభం కోరేవాళ్ళు నీకు లేరని తెలుకోలేకపోయావు. ఇది సత్యం. ఎందువల్లనంటే: ఇంత దౌష్ట్యానికి పాల్పడ్డ నిన్ను అటువంటివాళ్ళుంటే ఎందుకు మందలించరు? అగ్నికి ఆహుతి కాబోయే శలభాన్ని పోలిన నిన్ను వారెందుకు అడ్డగించి సన్మార్గంలో ప్రవేశపెట్టరు? వాళ్ళు నీ భయానికి జంకారేకాని ఈ ఉపేక్ష నీ ఒక్కనితోనేపోక వాళ్ళకుకూడా కీడు కల్గిస్తుందని ఆలోచించలేరు. ఇంద్రునికి శచి వలె నేను శ్రీరామచంద్రునకు భార్యను. బాలిశుడవైన నీవు నన్ను కోరేవుకాని, లోకంలో ఇంకెవరైనా కోరుతారా? ఏవేవో వికార భావ పరంపరతో దురుక్తులాడావు. ఆ పాపం నీవెక్కడికిపోయినా నిన్ను వదలి వెళ్ళదు. మత్త మాతంగాన్ని మశకం ఎదిరించినట్లు లోకైక ధనుర్ధారిని, నా పతిని నీవు ఎదుర్కొనటం. నీ బిత్తుల మాటలకు సీత లొంగదని తెలుసుకో. వంచనతో నా నాథుని దూరంచేసి, నా మరది లేకుండా చూచి, కపట వేషంతో భిక్షుకుడవై నా పర్ణశాలకు వచ్చి ఆతిథ్యం గ్రహించి, అపస్మారక స్థితిలో నన్ను కొని వచ్చిన నీచుడవు నీవెక్కడ? యజ్ఞంలో ప్రాజాపత్య పురుషుని అనుగ్రహంతో ప్రభవించి, అసాధ్యమైన హరునిచాపం ఖండించి, ముని యాగరక్షణంచేసి, క్రూరదానవి గుండెచీల్చి, బలిపశువులవలె పదునాల్గువేల రక్కసులస్రుక్కించిహరించిన నా పతి ఎక్కడ? నీవు పౌరుషశక్తులు కలవాడవై నామోసగాడవు. నా పతి పౌరుషశక్తులతోపాటు ప్రాజ్ఞత కలవాడు. ఇంతచేసి సిగ్గుమాలి నన్ను దుర్భాషలు పలకటానికి నీకు నోరెలా వచ్చింది? ఆ సమయంలో నా పతి గాని, నా మరదిగాని వుంటే నీచరిత్ర గతస్మృతి అయ్యేది. కామాంధత కనుల ఆవరింపగా వికారంగా చూచే నీ వీక్షణాలు రెండూ ఇంకా నేలబడలేదేమి? ధర్మజ్ఞాననిష్ఠుడైన జనకుని పుత్రినై, దశరథుని కోడలినై, రాముని ఆత్మేశ్వరినై, సకల దేవసన్నుతచరితనైన నన్ను కారుకూతలు కూసిన నీనాలుక చీకితెగి నేలపడదెందుకు? ఓరినీచకాముకుడా! నీవావుకు నా పతికావలెనా? నాపాతివ్రత్యతపోబలంచేత ఒక్కమాటలో నిన్ను నిలిచినట్లే

బూడిద చేయనా? నా భర్త అనుజ్ఞలేదు. ఆయన చేయదగిన పని నేను చేయటం ధర్మంకాదని వూరుకున్నాను. నీకు చావు నాపతి శరంచేత వుండేట్లు విధి లిఖించాడు. అందుకే అవమానాన్ని సహించి, ఆగ్రహాన్ని కుదించుకుని ఆగాను. పతి పాదసేవలో నేను గుప్తంగా ఆర్జించుకున్న శక్తి నీపై ప్రయోగించి అపవిత్రం చేసుకోదలచలేదు. శూరుడవై, విఖ్యాతబలోదరుడవై, కుబేరుని సోదరుడవై పేరుప్రతిష్ఠలు సంపాదించుకునికూడ, అసమర్థునివలె దొంగతనంగా నన్ను తోడ్కొనివచ్చిన నీకు మానం ఎక్కడుంది?" అని గ్రహమండలంనుంచి ఉల్కాపాతంవలె జానకి నోటినుంచి పరుషవాక్కులు వెడలినె.

## రావణుడు సీతపై ఆగ్రహించుట

ఆ తీవ్ర వాక్కులు విన్న రావణుని దశశిరస్సులు గిరగిర తిరిగినై. ఇరవై నేత్రాలు విస్ఫులింగాలు వెదజల్లినై. వింశతిభుజాలు అస్త్రశస్త్రాలుధరించినై. కాలజీమూతసంకాశుడు, ఉన్నత భుజశిరస్కుడు, పంచానన గతిసత్త్వుడు, దీప్తజిహ్వాకాననయనుడు, గంధానులేపనుడు, కంపితశిరోగ్రముకుటుడు, హేమభూషణధరుడు, అరుణవర్ణమాల్యాంబర శరీరుడు, అమృతోత్పాదనకై మందరాచలానికి చుట్టినవాసుకివలె నల్లని మొలత్రాడుగలవాడు, శృంగాలుకల్గిన మందర ధరాధరంవలె వింశతిభుజాలతో ఉన్నతుడైనవాడు, రక్తపల్లవపుష్పరాజిచేతా, అశోకవృక్షాలచేతా ప్రకాశించే పర్వతంవలె, ఉదయభాస్కరునివలె ఒప్పుతున్న కర్ణకుండలాలు కలవాడు, చందనలిప్తకాయుడు, సౌందర్యవిదిత వసంతుడు, మునిజనమనఃకంటకుడు అయిన అసురపతి శ్మశానంలో మందిరంలాగా భయంకరుడై, వృద్ధిపొందుతున్న దురాగ్రహహుతాశనుడై, కాలభుజంగంలాగా, రోజుతూ, మైథిలివంక తీవ్రంగా చూస్తూ, "ఓసీ గుణహీనా! నోటికి వచ్చినట్లెల్లా ప్రేలుతున్నావు. నీతిలేనివాణ్ణి, నిర్ధనుణ్ణి, మానవుణ్ణి అధికుడనీ, త్రిలోకపూజ్యుడైన నన్ను అధముడనీ అనటానికి నీకెన్ని గుండెలున్నవే? సంధ్యాసమయాన్ని పద్మినీ వల్లభుడు హరించినట్లు నిన్నిప్పుడే హరించుతాను. నీ ఆగడం నా ముందా? లోకవిద్రావణుడు రావణుడని నీకింకా తెలియలేదా?" అని గర్జించి పలికి రక్షణగా కాపుంచిన రాక్షసాం-

గనం పేరు పేర పిలిచి "ఓ దైత్యకాంతలారా! నా ఆజ్ఞ శ్రద్ధగా వినండి. మీరంతా గుంపుగూడి కాని, విడివిడిగా కాని, ఈ మానవిని సామదాన భేద దండోపాయములచే నాకు వశవర్తినిగా చేయండి. మీకు అన్ని అధికారాలూ, అవకాశాలూ, ఇస్తున్నాను" అని ఆజ్ఞాపిస్తూ జానకిని తేరిపార చూస్తూ దవాగ్ని వనాన్ని సమీపించినట్లు ఆమెను సమీపించాడు.

## రావణుని ధాన్యమాలిని అడ్డగించుట

పట్టరానికోపంతో భూజతను చేరవస్తున్న అసురనేతను చెంతనున్న ధాన్యమాలిని అనే దైత్య కామిని రెండుచేతులతో గట్టిగా ఆలింగనం చేసుకుని "ప్రాణేశ్వరా! నిష్కారణంగా స్త్రీ హత్యా పాపం ఎందుకు ఒడిగట్టుకుంటారు? మా ఇందరికన్న ఈమెలోని ప్రత్యేకాకర్షణ ఎట్టిది? ప్రభువుల సంకల్పం ఎట్టిదైనా మాకు అవశ్యం అంగీకరించ తగింది కనుక ఇంతవరకు ఆ విషయం పట్టించుకోలేదు. ఇప్పుడామె తన అనిష్టాన్ని నిర్ద్వంద్వంగా చెప్పింది కదా. ఇష్టంలేని ఇంతిపొందు సరసులైన పురుషులు ఎన్నటికీ కోరరు. ఈ సకి అమర్త్యకాంత కాదు. ఈ సకియ మర్త్య కాంతయే. ఈ కాంత విపన్న. మహాకృశాంగి. నేనుండగా ఈ దీనురాలెందుకు? ఈమె నొసట విధాత వ్రాసింది దిక్కుల జయించితెచ్చిన మీ అపారధన సంపద అనుభోగించాలని కాదు. అరణ్యవాసకృశుడైన ఆ రామునితో అష్టకష్టాలు అనుభవించమని. మనమేం చేస్తాం. ఆకొన్నవాడికి అన్నంపెడితే అమృతం లభించినట్లు ఆనందపడుతాడు. అజీర్ణరోగి అపథ్యం అని అంటడు! ఆ విధంగానే ఈమె మీ మహాభోగాలను తిరస్కరించింది. అదికాక అకాముని కామించే పురుషుని శరీరం పాడయిపోతుంది. అనుకూలపతితో కామానుభవం కలిగితే సుఖం, ఆయుర్వృద్ధి కలుగుతుంది. మీకై ఎందరు పరితపించటం లేదు? ఈమె కిన్నెరను ఈమెను వదలండి" అని అనునయ వాక్యాలు పలికింది. ఆ మాటలకు దశవదనుడు నవ్వుకుంటూ, ఆ వనంలో తనకై నిర్మించిన హర్మ్యానికి సీతను వదలి వెళ్ళాడు. అతని వెంట గంధర్వ కిన్నెర పన్నగ దేవభామినులు అనుసరించారు. అనంతరం ప్రభువు ఆజ్ఞానుసారం అసురకాంతలు సీతను చేరవచ్చారు.

# రాక్షసాంగనలు సీతకు బోధ సేయుట

కాంతాజన పరివృతుడై రావణుడు పోగానే, కాపున్న రాక్షసస్త్రీలు జానకి చుట్టూ మూగారు. వాళ్ళంతా ఏకవాక్యంగా, కర్కశ కఠోరంగా సీతను చూస్తూ, "ఓసి వెర్రిదానా! ఎంత బేలవు? ఆయన ఎవరను కున్నావు? అతడు నీకు పతి గాదగడా? పులస్త్య బ్రహ్మపుత్రుడు. మహా తపోరాశి. ఈశ్వరార్పిత హృదయుడు. త్రిలోక విజేత. అనితర దుర్లభ మైన లంకా నగరానికి ఏలిక. ఎందుకు చేచేతుల వచ్చిన లక్ష్మిని త్రోసి వేస్తావు? ఆయన అన్నంత పని చేస్తాడు. నీవు వృధా భ్రాంతితో, ఆశించిన వానిని ఆదరించక జీవితంలోనే చూడలేని ఒక సామాన్య మానవునికోసం ఎందుకు శరీర త్యాగం చేస్తావు? మా మాటవిని సుఖంగా జీవించు" అని నొక్కి చెప్పారు. అందులో ఏక జట అనే అంగన ముందుకు వచ్చి "ఓ సీతా! మా రాజును గురించి వివరంగా చెపుతా విను. ప్రజాపతులు ఆర్గురు. అందులో నాల్గవవాడు, బ్రహ్మ మానసపుత్రులలో శ్రేష్ఠుడు పులస్త్యబ్రహ్మ ఆయన మానస పుత్రుడు విశ్రవుడు. ఆయన తపోనుగ్రహంతో ఈయన అవతరించాడు. జన్మ కాలంలో ఈయన రోదనం లోకాన్ని కలవరపెట్టింది. అందుకే రావణుడు అని నామకరణం పెద్దలు చేశారు. పెద్దవాడుకాగానే రావణ నామం లోక విద్రావణంగా సార్థకం చేశాడు. స్వయంగా అంతటివాడు వలచి వచ్చి నిన్నర్థిస్తే నిరాకరిస్తావా? ఇందరికిలేని అదృష్టం నీకు కలిగినందుకు ఆనందించక ఇంకా ఏడుస్తా వెందుకు? బతిమాలినకొద్దీ నిక్కులుపోతా వెందుకు? తోటి ఆడుదానవని తోచినమాటలు చెప్పాను. ఇక నీ యిష్టం" అని అన్నది. వెంటనే హరిజట అందుకుంది. పిల్లి కన్నుల వంటి కళ్లు గిరగిర త్రిప్పుకుంటూ, "ముప్పై మూడు కోట్ల దేవతలను, ముప్పు తిప్పలుపెట్టి, మూడు చెరువుల నీరుత్రాగించి, ఇంద్రుణ్ణి జయించి, దిక్పాలకులను సేవకులుగా చేసుకున్న మా రాజును భర్తగా గ్రహించటం చేదు మింగటమనుకున్నావా?" అంటూ అగింది. ప్రఘసలేచి "ఓసి నిర్భాగ్యు రాలా! తులమెత్తు మాంసంకూడా లేని నీకెందుకే ఇంత తలబిరుసు? మాకు ఒక్క పంటిక్రిందికి నంజుడుకురాని మానవికి నీకే ఇంత పొగరు బోతుతనం వుంటే ఆ మహారాజుకు ఎంత వుండాలే? నీకంటే ఎన్నో రెట్లు అందమైనదీ, అనుకూలవతి ఐనదీ మా రాణి మండో

దరి. ఆమెను కాదని నిన్ను ఎందుకు కోరాడో ఆయనకే తెలియాలి. ఎందుకు కోరినా నీ భాగ్యం పండిందని అనుకోక ఈనిక్కులూ, నీల్గులూ ఎందుకు? ఈనిర్బంధం ఎందుకే నీచురాలా? మా ప్రభువు చిత్తాన్ని పరికిస్తే "కాంతాజనసహస్రకలితంగా, సర్వమణిగణహేమసంవలితంగా, నయనపర్వంగా ఉన్న అంతఃపురంకూడా వదలినీకుదాసుడవుతాడా" అన్నట్లువుంది. ఇంతకంటె ఆడుది కోరేదేముందే?" అని కఠిన కర్కశంగా అంది. వికటపేరుగల విరూప నికటానికి వచ్చి "ఓసి అదృష్టం లేనిదానా! ఎన్నివందలమారులో దేవాసుర యుద్ధం జరిగింది. అన్నిసారులూ నాగ గంధర్వ యక్షోరగ దానవులను హేలగా మాప్రభువు నిర్జించాడు. ఎందరెందరో ఆయన ప్రతిభకు, పరాక్రమానికి, అందచందాలకు, ఐశ్వర్యానికి మురిసి తమ కన్యాత్వాన్ని ముడుపుకట్టుకుని అతి కష్టం మీద భార్యలైనారు. అట్టి మహాపురుషుడు ఆశించివస్తే ఇల్లాలివై సుఖపడక ఇంత కావరం ఎందుకు? మా చిన్నదొరసాని ధాన్యమాలిని లేకుంటే నిన్ను తరిగి పోగులు పెట్టమనేవాడు. ఆశించినా అనుభవానికి రాని వెర్రి రాముడిపై ఇంకా ఆశఎందుకు? వాడురాడు. రాలేడు. వచ్చినా మా రాజును జయించలేడు. రెండునెలలు దాటగానే నీకథ కంచికి మేం ఇంటికి పోతాం. ఆయన కరం గ్రహించి అనంతకాలం శారీరక మానసికమైన ఆనందాన్ని హాయిగా అనుభవించు" మని అంది. వెంటనే దుర్ముఖి ఎదురుగా వచ్చి బొగ్గులకుప్పవంటి మొగం వికటంగా పెట్టి "ఎందుకే ఏడుస్తావు? ఇప్పుడేం ప్రమాదంవచ్చింది? ఎవని ఇష్టంలేక సూర్యుడు ఎండలు కాయడో, ఎవని ఆజ్ఞలేక వాయువు వీచడో, ఎవని కనుబొమల కదలికతో మబ్బులు భయపడి సకాలంలో వర్షిస్తవో, ఎవని ఆనందంకోసం, వృక్షాలూ, లతలూ పూచికాచి ఫలించి రాల్చుతాయో, ఆ మహాశక్తి సంపన్నుడు నిన్ను అర్ధాంగిగా కోరితే అంత బిర్రబిగుసుకుంటావెందుకు? ఏ ఆడుది ఇంత మహా మహా యోగం ఎదురువస్తే కాదని కాలదన్నుతుందే మూర్ఖురాలా? ఒకవేళ జరిగితే ఈ భోగం నీ భర్త నీకు కల్పిస్తాడా? ఇహ సౌఖ్యాలు మాని, కంటికి కనుపించని పరలోకాలు కల్పించుకుని మానవులలో కొందరు ఎందుకో ఏడుస్తారు. వాళ్ళనుచూస్తే నాకు జాలివేస్తుంది. నీకుకూడా ఆ రోగమే పట్టినట్టుంది.

లేకపోతే అన్నాహారాలుమాని "రామా! లక్ష్మణా!" అంటూ చిక్కి శల్యమవుతావు. చివరిసారిగా చెపుతున్నాం. విన్నావుగా మా ప్రభువు ఇచ్చిన ఆజ్ఞ. రెండేరెండు నెలలకాలం. కనుమూసి తెరిచేలోపల అది గడిచిపోతుంది. నీకథ మాస్తుంది. ప్రభువు చెప్పమన్నాడు. మేం చెప్పాం. చెడేవినీవు. నీకోసం మాకు ఆరాటం ఎందుకు?" అంటూ వెర్రి వెర్రిగా వాగింది.

## దైత్యకాంతలు సీతను భయపెట్టుట

దుర్ముఖిని వారిస్తూ అంగనలంతాచేరి క్రూరంగా పురుషులవలె కర్ణకఠోరంగా వుండే కంఠస్వరాలతో ఒక్కసారిగా "దుర్ముఖీ నీ సొమ్మంతా పోయినట్లు దీన్ని బ్రతిమాలుతావెందుకు? మనకు అన్ని అధికారాలు అసురపతి ఇచ్చాడు. మంచిమాటలు తలకెక్కలేదు. ఇంకా నిర్రనీల్గి బిర్రబిగుసుకుంటూంది. సర్వజీవ లోకసంతోష కారణమైన ప్రభువుల శుద్ధాంతం దీనికి బండ్లపై తెచ్చే బండరాళ్ళవలె వుంది. అనర్ఘ మణిసంపద కుండపెంకుల్లాగా భావిస్తూంది. ఇది మానవి కావటం చేత భయపడి మానవుణ్నే భర్తగా ఆశిస్తూంది. బంగారు పట్టు పరుపులు వున్న హంసతూలికా శయ్యలు కటికనేలపై పరచిన దర్భలకంటే తక్కువనుకుంటూంది. అంతేకాని మన ప్రభువును మన్నించటంలేదు. మర్యాదతో చూడటంలేదు. మన రాజు మానవ భోక్త, సర్వలోక మానిత పదార్థభోక్త అయిన దానవ భర్త అని అనుకోటంలేదు. ఆయన ఆగ్రహిస్తే వచ్చే ప్రళయం తెలుకోలేక వాపోతూంది. ఇక దీనికి మంచిమాటలు పనికిరావు. రాచిరంపాన పెట్టాలనే కోరుకుంటూంది. దీని కోరికే తీరుద్దాం మనకు జాలి ఎందుకు?" అంటూ భయపెట్టారు.

## సీత తన మనోనిశ్చయం దానవస్త్రీలకు తెలుపుట

దైత్యకాంతలు నయంతో, భయంతో, క్రోధంతో తర్జించి, భర్జించి గర్జిస్తుంటే, జానకిసంతత ధారగావచ్చే కన్నీళ్ళను కొనవ్రేలి గోటితో మీటుతూ, అంతరంగలో ఆత్మేశ్వరుని సంస్మరించి, ధైర్యం సంతరించుకుని, సాహసం సమకూర్చుకుని, "అనుభవ యోగం వుంటే

ఆత్మపతి దర్శనం కలుగుతుంది. అది లేకపోతే అసురకాంతలచే మరణం కలుగుతుంది. ఏది జరిగినా తనకు క్షేమమే" అన్నభావాన్ని స్వీకరించుకుని, గాద్గద్యం విడిచి స్పష్టంగా ఇలా అంది. "రాక్షసాంగనలారా! నా మాటలు వినండి. మీ ధూర్తత ఆపండి. మీ మాటలు మీకే కాని లోకానికి రుచించవు. పై పెచ్చు ఘోర పాపాన్ని కుత్తుక బంటిగా కూడబెట్టుతవి. సృష్టిలో ప్రాణికోటికి జాతి సాంగత్యం విధి విధించాడు. ఇంతకాలం అలాగే జరుగుతూ వస్తూంది. నేను మానవ జాతి దాన్ని. నేను కోరేది మానవుణ్ణి. నన్ను బలవంతంగా రాక్షస రాజుకు భార్యకమ్మని బాధిస్తారెందుకు? మీకు అనిష్టమైంది కోరితే మీరు చేస్తారా? నా మాటలు మీకు అంగీకారం కాకపోతే రెండు నెలలెందుకు? ఇప్పుడే భక్షించి రాజాజ్ఞ నెరవేర్చండి. కాని మీరు అనరాని, నేను వినరాని కూతలు కూయకండి. దీనుడైనా, రాజ్యహీనుడైనా నేనెవరికి భార్యగా దత్తం చేయబడ్డానో ఆయనే నాకు భర్త. నా ఏడుగడ. భానుడు సువర్చలకేవిధంగా పతి అయినాడో, రాముడు నాకు ఆ విధంగా ఆత్మేశుడైనాడు. ఇంద్రునకు శచివలె, వశిష్ఠునకు అరుంధతివలె, చంద్రునికి రోహిణివలె, చ్యవన మహర్షికి సుకన్యవలె, సత్యవంతునకు సావిత్రివలె, కపిలునకు శ్రీమతివలె, అగస్త్యునకు లోపాముద్రవలె, సగరునకు కేశినివలె, సౌదాసునకు మదయంతివలె, నలునకు దమయంతివలె, రఘుకులాధీశుడైన రామచంద్రునకు ఆదర్శగృహిణిని. మా అనుబంధం ఇప్పటిది కాదు. ఎప్పటికీపోదు. అన్ని అధికారావకాశాలు మీకున్నై. ప్రభువిచ్చిన రెండు మాసాల కాలం నన్ను బ్రదుకనిచ్చినా సరే. అంతదాక ఎందుకని నన్నందరు కలసి భక్షించినా సరే. నాకిష్టమే. కాని, ఆడువారై వుండి ఆడుదాన్ని, దిక్కులేదాన్ని, తీవరించటం, దూషించటం, అసహ్య వాక్యాలు పలకటం చేయవద్దు. దీనివల్ల మీకు మేలే కాని కీడురాదు" అని సీతాదేవి రాక్షసాంగనలకు చెప్పింది. అంతా చెట్టుపై నున్న హనుమ కదలక, మెదలక, పెదవులు తెరవక విన్నాడు. ఆ భయంకర ఘట్టాన్ని మహా కపి చూచి ఎలా సహించాడో.

# దైత్యకాంతలు ధరణిజను బలవంతపెట్టుట

కరకురాళ్ళు సయితం కరగిపోయే సీత దైన్య వాక్యాలను లక్ష్య పెట్టక రక్కసి గుంపు గొడ్డళ్లు త్రిప్పుతూ, కూడని కూతలు కూస్తూ, పైన పడ్డట్టుగా వచ్చి కోపంతో "ఒసే, నీవటే మాకు ఎదురుబడ్డిపల్కేది? మా ప్రభువును ఏ విధంగా ఏలుకోవో మేంచూస్తాం. అంగీకరిస్తావా? లేక మాచేత చస్తావా? చెప్పు"మంటూ పైకి వస్తుంటే సీత సింహరవం విన్న లేడిలాగా వణకిపోతూ, ఏకధారగా అశ్రువులు రాలుస్తూ, శింశుపా వృక్షం మూలం చాటునకు భయంతో పారిపోయింది. వ్రేలాడే పొట్టా, ఎర్రని కళ్ళూ, బుర్ర ముక్కూ, భీతిగొల్పగా, చిర్రు బుర్రుమంటూ సీత్కారంచేస్తూ వినతనామంకల వికృతాంగి ముందుకు తోసుకుని వచ్చి "ఏమే సీతా! ఎంత గడుసుదానవే? ఎంత తెగవరివే? ఇటువంటి సంకట సమయంలో కూడా పతిపై ప్రేమానురాగాదరాలు చూపి సతీత్వం నిజంగా చాటుకున్నావు. నాకు నీ శీలం ముద్దు వచ్చింది. "అతి సర్వత్ర వర్జయేత్" అన్నట్లు, ఏదైనా మితిమీరకుండా వున్నంతవరకే శ్లాఘా పాత్రం అవుతుంది. హద్దు అతిక్రమిస్తే అపాయం కోరకుండా వస్తుందని నీకూ తెలుసు. నీవు చెప్పిన ధర్మం మానవజాతికి తగిందే. మగనాలివి కనుక నీకూ అనుష్ఠింపదగ్గదే. అందుకు నేను అభ్యంతరం చెప్పను. అది విధిచేత విఘటితమైంది. ఇప్పటి నీ కర్తవ్యం నాకు తోచింది చెపుతాను. ఇంతవరకు నీవు మా ప్రభువు దృష్టిలో ఆరాధ్యవుగా నిల్చావు. ఆ కారణంవల్ల ఆయనగాని, మేంకాని నిన్ను నిర్బంధించలేము. కాలం నీకు కలిసి వచ్చింది. కాముకుడైనా, క్రూరుడైనా నీపట్ల సౌమ్యంగానే మా నేత ప్రవర్తించాడు. నీవు కూడ దీర్ఘోపవాస దీక్షతో పతిరాక కోసం ప్రాణధారణ చేయటం జరిగింది. ఇప్పుడాకాలం వ్యతిరేకించింది. అందువల్ల హితమైన నా వాక్యాలు విను. సురపతి ముల్లోకాలకు సర్వాధికారి. అతడే మారాజనకు ఆశ్రితుడైనాడు. ఇక ఆయన విక్రమాన్ని విడిగా వర్ణించ పని లేదు. నీవు చూచావుకదా వచ్చిన శుద్ధాంత కాంతలను. వారంతా జగదేకసుందరులేకదా? అందువల్ల ఆయన అందచందాలకు కాలం వ్యర్థం చేయటమే అవుతుంది వివరించటానికి. ఈగికలవాడు. భోగం కలవాడు. దక్షిణ నాయకుడు. ప్రియదర్శనుడు.

నీకు నీ పతివలె అన్ని విధాలా భావింప తగినవాడు. కృపణుడైన రాముని కోసం ఎందుకు ఏడుస్తావు?

ఘుమ్మనే అంగరాగాలు, కాంచనరత్న ఖచితమైన ఆభరణ విశేషాలు ధరించి ఈ క్షణం నుంచే ఎల్లలోకాలకు రాణివై ఏలుకో. ఇంద్రునకు పౌలోమివలె, అగ్నికి స్వాహాదేవివలె మారాజునకు అనుకూలవతివై సుఖించు. ఎన్నాళ్ళనుంచి "రామా రామా" అంటూ ఏడుస్తున్నావు? ఏడీ రాముడు? ఇంతవరకు రాలేదు. నీ క్షేమం తెలుసుకోలేదు. నీవాశించినట్లు మా దొరను యుద్ధంలో జయించలేదు. ఇక వస్తాడనీ ఆశలేదు. అపారమైన దక్షిణ సముద్రంలో శతయోజనాలు తరించి రావటం మానవులకు సాధ్యమా? రాజ్యహీనుడు. ఒంటివాడు. నీ వలెనే ఆతడు నిన్ను తలచుకుంటూ గతాయుష్కుడై వుంటాడు. నీవన్నట్లు పతికోసం చస్తావు. చచ్చి ఏం సాధిస్తావు? నా మాటలు పాటించు. మనసు మార్చుకో. రేపు మనది కాదు. వచ్చిన అవకాశం వదిలిస్తే మళ్ళీ రాదు. ఇంత చెప్పినా నీ మౌర్ఖ్యం వదలకుంటే కూటిలోకి వ్యంజనంగా నిన్ను కోసి తింటాము" అని ముగించగానే సార్థకనామం గల లంబస్తని లేచి వికటాట్టహాసం ప్రకటిస్తూ, "దుర్మార్గురాలా! మా లంకకు మృత్యువు లాగా దాపురించావు. నీవు వచ్చిన దగ్గరనుంచీ మాకూ, మా దొరకూ మనశ్శాంతి లేదు. ఏవేవో ఆకున కందనివీ, పోకకు పొందనివీ, కలల్లో కానవచ్చేవీ కబుర్లు చెపుతున్నావు. ప్రాణంపై తీపిగలవారు మా ప్రభువు ముందు కారుకూతలు ఇంతవరకు కూయలేదు. నీవు కూసి జీవించావంటే మా స్వామి నీపట్ల ఎంత దయాభావో గ్రహించలేకపోయావు. ఎవరికీ తేరిపార చూడరాని ఈ అకూపార మధ్యంలో, అసురపతి అంతఃపురంలో, కామపాదులమై మేం కాపుకాస్తుండగా నిన్ను చూడటానికి సర్వశక్తులు కల్గిన ఇంద్రునకే దిక్కులేదన్న రాముడూ గీముడూ వచ్చి నిన్ను రక్షిస్తాడా? తగని మాటలు నీకు చెప్ప తలచుకోలేదు. మావలె నీవూ ఆడదానవే. నీకు పట్టబోయే దుర్గతి తెలిసినదాన్ని కనుక ముందుగా హెచ్చరిస్తున్నా. ప్రాయం భామలకు శాశ్వతంకాదు. ఆ సంగతి నీకు తెలుసు. పరమేష్ఠి ప్రసాదించిన జవ్వనంతో లతముందే సితంలేకాంత సౌఖ్యంద

వనాంత సీమల్లో, అంతఃపురాల్లో, కేళికాపర్వతాల్లో మా కులాధి పతినికూడి భోగాలు పొంపిరిపోయేట్లు అనుభవించు. కాదంటావా? ఈ క్రూరముష్టి ప్రహరణం నీ తలప బ్రద్దలుచేస్తుంది. సప్తసహస్ర సంఖ్యా పముపేతమై దశవదనుని అంతఃపురం దాస్యం చేయటం కోరుకుంటావో, వాడిగోళ్ళతో నీగుండె చీల్చి కవోష్ణ రక్తం మేం పానం చేయటం వాంఛి స్తావో రెండు ఘడియల కాలం నీకు అవకాశంఇస్తున్నా"నని తప్పుకుంది.

చండోదరి చండక్రోధంతో చివాలునలేచి త్రిశూలం త్రిప్పుతూ "అబ్బా! ఎంతకాలంనుంచి ఓపికపట్టాను? ఇప్పుడు కోరినకోర్కె తీరే అవకాశం ప్రభువు చేకూర్చాడు. త్రాసంచేత కంపిస్తున్న పయోధరాలు కలదాన్ని, చలిస్తున్న నేత్రాలు కలదాన్ని, సున్నితమైన శరీరం కల దాన్ని, మారాజు మనస్సు హరించినదాన్ని చూస్తుంటే నా నోట్లో నీళ్ళూరుతున్నై. దీని నరాలు, మెదడు, మాంసం, తింటూ, రక్తం త్రాగుతూ, ఎముకలు నాకుతూ తనివితీరేందడం ఎప్పుడే(ప్రభుసా?" అంటూ అరచింది. ప్రఘసలేచి "ఎందుకే ఇంతచర్చ? దేనికే ఇంతచర్చ? దీనిగొంతు నులిమివేసి, అదే చచ్చిందని దొరకుచెపితే అంతా ఆహారంగా కొనండని ఆజ్ఞ ఇస్తాడు. వెంటనే సమంగా ఈ మూర్ఖురాలి మాంసం, నల్ల, నరాలు పోగులుగా పంచి లొట్టలువేసుకుంటూ తిందాం" అన్నది. అజాముఖి "తలకుతోచినట్లు గంగలపంటూ మాటలాడుతున్నారు. కాని, కావలసిన కార్యం ఎవరూ ఆలోచించరు. దీని మాంసం నంజుకుందాం. పరుగెత్తుకొనిపోయి మద్యం, పూరగాయలు తీసుకరండి" అన్నది. శూర్పణఖ "బలేగా చెప్పావే. అదేమంచిపని. చాలాకాలం అయింది. మనుష్య మాంసం తిని. కల్లులో దీని రక్తం కలిపి త్రాగుతూ, మధ్య మధ్య దీని మాంసం నంజుకుంటుంటే ఎంత రుచిగావుంటుందో చెప్పలేను. తప్ప త్రాగి మత్తు తలకెక్కగానే నికుంభిల అనే ఆటతో హాయిగా కాలం గడుపుదాం" అంది.

## రాక్షసకాంతల పలుకులకు సీత భయంతో ఏడ్చుట

ఉపాసు సమయంలో సముద్రం ఘూర్ణిల్లినట్లుగా, ఒకరిని మించి ఒకరు దారుణ వాక్యాలు పల్కుతూ, అస్త్రశస్త్రాలను ఝళిపిస్తూ, చుట్టూ

వికటనృత్యం చేస్తూ తిరుగుతుంటే భరించలేని ఆవేదనతో "హా రామా, హా లక్ష్మణా! అంత్యకాలం సమీపించింది. ఇక నేను లేను. మీ ప్రయత్నం, మమతా అంతా వ్యర్థం కాబోతుంది. ఈ నిశాచర కాంతలు ఇక నన్ను బ్రతుకనీయరు. అసలే రక్కసులు. అవకాశం వచ్చింది. ఓ ధర్మదేవతా! ఓ వేదమాతా! మీ విధ్యయాన్ని యథాశక్తి ఇంతవరకు పాటించాను. ఇక ఈ వికృతాంగనలకు బలికాబోతున్నాను. నాకు మళ్ళీ జన్మ ప్రసాదిస్తే నా రాముడే పతిగా, నా లక్ష్మణుడే మరిదిగా అనుగ్రహించండి" అంటూ ఆత్మలో పతి పదయుగ్మాన్ని పలుసార్లు భజించి, మొదలు నరికిన తరువువలె శింశుపావృక్షం మూలంలో మూర్ఛపోయింది. ఏదో అనిర్వాచ్యమైన శక్తి ఆమెలో ఆవేశించినట్లయి మెల్లగా కన్నులుతెరచి చూచింది. యథాస్థితిగానే రాక్షస స్త్రీలనడుమ వుంది. ఎంతో కష్టంమీద తేరుకుని వాళ్ళను పరిశీలనగా చూస్తూ, "దైత్య కాంతలారా! మీ పలుకులు తథ్యం. నాకు పథ్యం. అందుకే అంగీకరిస్తున్నాను. మీరాశించినట్లు నన్ను యథేష్టంగా భుజించండి. అసురాధము లెక్కడ? మర్త్యకాంతల పొందెక్కడ? ఈ విపరీతం ఎన్నడైనా జరిగిందా? ఇకముందు మాత్రం జరుగుతుందా? ఈపైన మీ ఇష్టం ఎలా ఉంటే అలా చేయండి" అంటూ జానకి వేపమానాంగియై, క్రుంగిపోతూ మందనుండి చెదరి, తోడేలుకు చిక్కిన హరిణిలాగా అల్లాడి పోయింది. అంతలో అంతర్ముఖిగా మారింది. పుష్పకదంబధారలంబ మానశాఖి కాలంబయై కంబుకంఠియైన మైథిలి అంబుజాక్షుడైన పతిని మనంబున నిల్పుకొని, నీటివాకలు కన్నుల నిండి పారగా, హస్తంతో వక్షోజాలు పవరించుకుంటూ, దనుజాంగనలకు లోపల జంకుతూ నిలుచుంది. ఆమె గాలికి కదలుతున్న కదళికవలె కంపించుతుంటే, దీర్ఘమైన ఆమె జడ అటుఇటు కదలుతూ సర్పాన్ని తలపిస్తుంది. ఆమె లోలోపల "రామా! లక్ష్మణా! అత్తయ్యా! అన్నిటికీ దెబిపోతున్నాను. చిన్నత్తయ్యా! నీవు మహాయోగినివి. నీవైనా నా దురదృష్ట గాథకు పరిహారం కల్పించలేవా? మీలో ఒకరైనా కృపతో నన్ను అనుగ్రహించరాదా? తాళ్మి కోల్పోయి, దైత్య స్త్రీల తర్జనంతో గోముపడి, భర్తనుబాసి, ఇంకా జీవంతో వుండటం చూస్తే, కాలం కాని కాలంలో స్త్రీ పురుషులకు మృత్యువు రాదన్న

సూరిజనుల సూక్తి సత్యమని చాటుతూంది. కొంగనోములు నోచి, పుణ్యం కొరతగా ఆర్జించిన నేను జలధి మధ్యంలో గాలికి గిర్రున తిరిగి మునిగే పడవలాగా పతి రహితనై ప్రాణాలు విడుస్తాను. ఆ అదృష్టం కూడ నాకు లేదు. అనురాగంతో ఆదరించే ఆత్మేశ్వరుని వదలి, క్రూర దానవ కాంతల ఘోరతర వాక్యశరధారలబడి ఇంకా బ్రతుకుతున్నానంటే ప్రవాహవేగంతో ఉర్లిపడే ఒడ్డుగల తీరం గుర్తుకు వస్తూంది. సౌమ్యుడూ, సౌజన్యుడూ, మాన్యుడూ, రాజలోక మూర్ధన్యుడూ అయిన నా ప్రాణ కాంతుని చూస్తూ జీవించే జనులు ఎంత ధన్యులో! వసనాభి తిన్నవాడికి అసువులు నిలువనట్లు భర్తను బాసిన నా మేన ఇంకా ప్రాణ వాయువులుండరాదు. అయ్యయ్యో! ఇంత అటమటపడుతూ అసుర కాంతల మధ్య బందీకృతనై బ్రతకటానికి పూర్వ జన్మలో ఎంతపాపం చేసుకున్నానో. ఈ విధంగా అభేద్యమైన లంకా నగరంలో రక్తదాహకులైన రక్కసి మూకలు రక్షిస్తుంటే, రఘువంశ భూషణుడు రక్షించటం ఇంకెక్కడ? నా దీనదశ తొలగించే దిక్కేది? ఆలోచిస్తే మృత్యువే నాకు దిక్కు. ఛీ ఛీ. ఈ మానవ జన్మం ఎందుకు? ఛీఛీ. పర పురుష పరిరక్షితమైన పాడు బ్రతుకెందుకు? ఎంత యత్నించినా ఎందుకు చావు రాదో నాకు తోచటంలేదు. చావురాక, బ్రదుకుపోక చిత్రవధ పొందుతున్న సీతకు దైవమా! గత్యంతరంలేదా! నీకు కనికరంలేదా?

## సీత రాముని తలంచుకొని ఏడ్చుట

లేదు. నాకిక విమోచనంలేదు. నాకు పతితో కలయికలేదు. అరణ్యవాస దీక్షానంతరం, అత్తలను, మరదులను, చెల్లెండ్రను, పౌరులను చూచే అదృష్టంలేదు. నేను ఏ ఆడుదిచేయని ఎన్నో అకృత్యాలు చేసి వుంటాను. ఆ పాపఫలం నిర్నిద్రుడుగా వుండే భర్తను దూరం చేసింది. కామ సంచారుడైన రావణ రూపంలో అవతరించి గోడగోడున ఏడ్చే నన్ను లంక చేర్చింది. దనుజ స్త్రీల దారుణ భాషణాల నడుమ నిలిపింది. ఇంకా ప్రాణాలు దేనికి? భూషణాలెందుకు? అర్థం ఎందుకు? ఏ కాలంలో ఎవ్వరూ అనుభవించని ఈ అంతంలేని కష్టాలు పడుస్తూంటే నా గుండె ఇనుపచిట్టెం. నా హృదయానికి ముదిమీ, చావూ

మూరం. కాకపోతే ఇంకా బ్రద్దలుకాదు. చలనం లేదు. ఇదంతా నా దౌర్భాగ్యం. ఛీఛీ! నామీద నాకే రోతపుడుతూంది. బాహ్యాభ్యంతరాలను అన్యూనంగా పంచి ఇచ్చిన భాగస్వామిని వదలి ఇంకా జీవించివున్నాను. నేను పట్టి అనార్యను. శీలంలేనిదాన్ని. సతీకుల కళంకిని. ఇదేం బ్రతుకు? నాదేం వ్రతం? ఈ దైత్యకాంతలు నన్ను ఖండించి తృప్తితీర తిననీ. ఇంకేమైనా చేయనీ. చతుస్సముద్ర ముద్రిత భూభర్త నా భర్త. ఆయన పొందు వీడి అంతులేని దుఃఖంతో అల్లాడుతూ, నిద్రాదివతె విల్చి సౌఖ్యాలు కోరుకుంటానా? నా పతికంటే ఈ అల్ప ప్రాణాలు తీపా? నా వామపాదన ఖరాగ్రంతో కూడ ఈ దుష్టుణ్ణి తాకనన్న, అతని వలచే మాటలకు ఇంక తావెక్కడ? అతడు దుర్బుద్ధి కావటంచేత నన్ను తెలుసుకో లేక సామాన్యగా తలంచాడు. తిట్టి తిరస్కరించినా నా మనస్సు గుర్తించ లేడు ఏ వంశంలో పుట్టాడో, పరువు, ప్రతిష్ఠలు ఎంతగా సంపాదించాడో, తానెంతవాడో మరచిపోయి నాపై ఆశలు పెంచుకున్నాడు. కాదంటే క్రౌర్యం చూపిస్తున్నాడు. అయినా నేనెందుకు భయపడాలి? కృతాంతుడు కాలపాశంతో కట్టి లాగుతుంటే చావసిద్ధంగా వున్న వీడు నన్నేం చేస్తాడు? నా శీలం హరించటానికి సృజించిన బ్రహ్మకే సాధ్యం కాదు. ఇక నా బాహ్య శరీరం పోతేపోనీ, పర పురుష స్పర్శగల కాయం పతనం కావలసిందే.

## సీత కఠోరంగా అసుర కాంతలకు ప్రత్యుత్తరం ఇచ్చుట

ఓ క్రూర కర్మనిష్ఠలైన రాక్షస కాంతలారా! కడసారి నా హృదయం విప్పి చెపుతున్నాను. ఖండ ఖండాలుగా నా శరీరం కోయండి. రోషంతో మండే మంటల్లో నన్ను త్రోయండి. మీ మాటలు ఇక వినను. మీ మిడిసిపాటును తగ్గించుకోనండి" అంటుండగా గత గాథ స్మృతికిరాగా ఆపుకోలేక దాన్ని ఆవృత్తం చేయసాగింది. "మీకు వావి వరుసలు లేవు. ధర్మాధర్మాలు లేవు. మానావమానాలు లేవు. చెప్పినా తెలియదు. తెలిసినా వినరు. అయినా వివరిస్తాను వినండి. ఎన్నిసారులో నా పతిని హీనుడని దూషించారు. ఆయనను మీరెరుగరు. తనవారిలో ఎంత దోషమున్నా

గుణం మాత్రమే గ్రహించే గుణవంతుడు. లేశ మాత్రం ఎవడు ఉప కారం చేసినా విస్మృతి పొందని విజ్ఞుడు. నమ్ముకున్న వారి దుఃఖానికి విలవిలలాడే కరుణా స్వరూపుడు. పరుల అభివృద్ధికోసం ప్రాకులాడే ఉదార హృదయుడు. నిర్మల చిత్తుడు. నిపుణశ్రేష్ఠుడు. జనస్థానంలో పదునాల్గువేల రాక్షసులను ఒంటరిగా ఎదిరించి పరలోకం పంపాడు. అటు వంటి నా భర్త వుపేక్షించటం నా దౌర్భాగ్యబలం కారణం కావచ్చు. మీ ప్రభువును సబాంధవంగా చంపగల శక్తి సంపన్నుడు నన్ను రక్షింప రాడెందుకు? దండకలో విరాధుని ద్రుంచిన అప్రతిహత కోదండ విద్యా గురువు నా క్షేమం తెలుసుకునే ప్రయత్నం చేయడెందుకు? ఖరదూషణ త్రిశిరుల ఖండించిన వీరాధి వీరుడు నన్ను వీక్షించటానికి ఎందుకురాడు? రాక్షస నిర్బంధంలో వున్న నన్నేల రక్షింపడు? సముద్ర మధ్యంలో లంక వుండుగాక. ఇతరులకు ప్రవేశం దుస్సాధ్యముగుగాక. ధనుర్వేద మంత్రార్థదేవత వశవర్తినియైన నాపతిశరానికి అడ్డంలేదనితెలుసుకోనండి. నేను మతిలేనిదాననై నా భర్తను శంకిస్తున్నాను. ఏమాత్రం నా సోక తెలిసినా ఇంతకాలం ఇక్కడ నన్ను గడపనిస్తాడా? అన్వేషణలో వృద్ధ జటాయువు "నీ సతి రావణాపహృత" అని చెప్పకపోరాదా? ఈ దుశ్శీలు దొంగదాటు దెబ్బతో వృద్ధపక్షి రెక్కలు నరికాడు. లేకపోలే మీ రాజు ఏమయ్యేవాడో. అబ్బా! ముదుసలి అయినా ఎంత పరాక్రమం చూపాడు? ఆతడెక్కిన రథం అనుపయుక్తం చేశాడంటే నమ్మితారా మీరు? నా పాపపండి నీచంగా పక్షాలు నరికివేసింది. ఆ పనే మగవాని లక్షణంగా మీ రాజు భావించాడంటే మీరు విశ్వసిస్తారా? నా జాడ తెలిసిన మరు క్షణంలో లంకానగరంతో రావణుని మూలముట్టుగా నాశనం చేయడా? దుస్తరం అనుకున్న సాగరాన్ని ధూళితో పూడ్చడా? అప్పుడు రాక్షస స్త్రీలంతా నేనేడ్చినట్లు విధవలై గోలుగోలున ఏడ్వరా? నా మనోహరుడు ఎన్నటికీ ప్రయత్నం విరమించడు. ఆయనకు దైవం తోడ్పాటు దొరకక పోదు. లంకకు రావటం తథ్యం. వచ్చిన వెంటనే ప్రాణాలు అరచేత బట్టుకుని పలలాశనులు పారిపోవటం సత్యం. నా పతి బాణాగ్నిలో కాలి బూడిదయైన లంకలో బాటలనిండా చచ్చిపడిన పీను లతో, బాణాగ్నికి కాలుతున్న శవాలపొగలతో నిండిన వాహనాలతో,

ఎగురుతున్న గ్రద్దల గుంపులతో ఈ వీడు వల్లకాడుగా మారిపోవటం యథార్థం. తొందరలో నా కోరిక తీరుతుంది. చెడేవారంతా లంకలోని స్త్రీలు. మీరుచేసిన దుష్కార్యాలకు ఫలం మీకు తప్పదు. ఇప్పుడు నా మాట వినండి. తర్వాత వచ్చిన కష్టకాలం కనండి. ఈ నగరం నాశనమయ్యే లక్షణాలు నాకు కనపిస్తున్నై. ఈ మహాపురం నిష్ప్రభమై చెడిపోతుంది. మీ రాజు చావగానే వయసులోనే మగడు చచ్చిన మగువవలె విధవాకృతి పొంది లంక విభ్రాంతి కల్పిస్తుంది. ఇంటింటా ఆడువాండ్రు "అయ్యో బిడ్డా! అయ్యో మగడా! అయ్యో కొడుకా!" అంటూ రోదించటం నే త్వరలోనే వింటాను. దేవతలు, సాధువులు, మునులు సంతోషించేలాగా, కాలి, కాంతి దొరగిన లంకా, చచ్చిన రాక్షసవీరులతో, ఏడ్చే స్త్రీ జనంతో నిండిన వీధులూ, నా భర్త కోదండవిర్ముక్త శిలీముఖ నిహతుడైన రావణుడూ నా కన్నులకిప్పుడే కనిపించటం జరుగుతూంది. దుష్కర్ముడైన ఆ శరప్రభువు నాకిచ్చిన గడువు క్షణక్షణం గడుస్తున్న కొద్దీ మీ లంకలో ఉత్పాతాలు హెచ్చుతున్నై. అసురులకు ఈ విపరీతాలు కలగటం తెలియదు. క్రూరమృగాలవలె మనుష్య మాంసంతినే నృశంసులైన మీరు కాలధర్మాన్ని గమనించలేరు. లోకాలన్నీ మీ శత్రులకు లోకువనే తలుస్తారు. నన్ను చంపి నా మాంసం మీ రాజుకు ప్రాతరశనప్రం జనంగా చేస్తారు. చేయండి. ఏమిచేసినా నేనేమీ అనను. కరుణాసముద్రుడైన నా పతిని విడిచి బ్రదుకు భారంగా ఈడ్చుతున్న దాన్ని. ఆత్మ భర్తకు దూరమై అల్లాడుతూ బ్రదికే నాకు ఇంత విషం ఇచ్చి మీలో ఎవరైనా పుణ్యం కట్టుకుంటే ఇంకా సంతోషిస్తాను. ఇక్కడ నేను బ్రదికి ఏడుస్తుంటే అక్కడ నా భర్త నా కోసం వెదకుతూ నా వార్త తెలియక శోక వేగంతో ప్రాణాలు విడిచాడేమో. జీవించి వుండి, నా వార్త తెలిస్తే ఇంత దీర్ఘకాలం నన్నిలా పర నిర్బంధంలో వుంచుతాడా? నేనెంత హత భాగ్యను? దేవ సిద్ధమౌను లెంత ధన్యులు! సకల లోక నృపకుల మూర్ధన్యుడూ, మాన్యుడూ అయిన నా భర్తను నిరంతరం సందర్శిస్తుంటారు. సత్యపరాక్రముడు, ధర్మరతుడు, పరమాత్ముడు, రాజఋషి అయిన ఆ రఘువంశాలంకారునకు సహధర్మచారిణినై ఏమి సుఖ పెట్టాను? వద్దన్నా వెంట వచ్చి దుఃఖం కోరి తెచ్చి పెట్టాను.

కృతఘ్నులు ఎదుట నున్నంతసేపు కపట ప్రేమ ప్రకుమ్మరిస్తారు. మరుగు కాగానే మరచిపోవటమో, మర్యాదా హీనంగా విసర్జించటమో చేస్తారు. నా పతి కృతజ్ఞుడు. నన్ను మనసారా ప్రేమించాడు. నా వల్లనే ఏకపత్నీ వ్రతుడైనాడు. నన్ను మరువడు. నాకై అన్వేషణ చేస్తూనే వుంటాడు. అంత మంచి గుణాలు నాకు లేవో, నే చేసిన పుణ్యం చాలపోయిందో, ప్రాణేశునకు దూరంగా బ్రదుకుతున్నాను. ఆ సర్వ సులక్షణ సంపన్నుడు, శూరుడు, ధీరుడు, అరిమర్దనుడు సన్నిధి లేకుండా బ్రదికిందొక బ్రదుకేనా? ఘోరారణ్యాల్లో నన్ను వెదకుతూ, కందమూల ఫలాలు తింటూ, ఆస్త్ర శస్త్రాలు వర్జించి దుఃఖంతో అసువులు వదిలారో? లేక ఈ మన్మాన్యుడు మాయా విద్యా ప్రభావంతో అన్నదమ్ముల హతమార్చాడో? ఇన్ని బాధలు పడి బ్రదకటం కంటే మరణం ఎంతో మేలు అది కూడ నా మీద ఆగ్రహించి దరికి రాకుండా వుంది. ప్రియంతో సంతోషం అప్రియంతో అధిక సంతాపం ప్రాణి కోటికి లభిస్తుంది. ప్రియా ప్రియాలకు దూరంగా వుండే సర్వగుణ సమవస్థలైన ఋషులకు అంజలిస్తున్నాను. ఇక బాహ్యాభ్యంతర సంబంధాలు పరిత్యజించి నాకు నేనే చావు తెచ్చుకుంటాను. మీకు శ్రమా, యజమానితో మాటా లేకుండా చేస్తాను" అని చివరి నిర్ణయాన్ని సీత రాక్షస కాంతలకు తెలిపింది.

## త్రిజట తన స్వప్నాన్ని తోటి రాక్షస భామలకు చెప్పుట

ఆ మాటలు వింటున్న దైత్యాంగనల్లో కొందరు భయంతో పంక్తి ముఖునకు చెప్పటం కోసం పరుగెత్తారు. కొందరు ముందుకు వచ్చి "చస్తే చావు. నీ మాంసం మేమంతా ఆరగిస్తాం" అంటూ గద్దించారు. ఆ సమయంలో అంతవరకూ ఆ కాంతల ఆగడంలో పాలు పంచుకొనకుండా పడుకున్న త్రిజట అనే రక్షఃకాంత చివాలున లేచి "ఛీ ఛీ! చాలించండి మీ దుడుసుతనం. ఎవరిని తింటారే మీరు? రాము పత్నినీ, జనక పుత్రినీ, దశరథుని కోడలినేనా? పో పొండి. దూరంగా పొండి. అంత తినతలచుకొంటే నన్ను తినండి. ఇక మన ఆగడాలు సాగవు. ఎప్పుడూ రాని పీడ కల వచ్చింది. నాకు

వస్తే వచ్చింది జరుగుతుంది. ఆ కల తలచుకుంటే ఇప్పుడు కూడా కంపం కలుగుతుంది. ఆశర సంతానానికి ఆయుష్కాలం సమీపించింది. ఈమె భర్తకు జయం, దానవ భర్తకు మరణం తథ్యం. రాక్షసేశ్వరుడు ఈ సీతను ఎప్పుడు తెచ్చాడో అప్పుడే లంకకు అనిష్టం ప్రాప్తించింది" అని అనగానే చెంతనున్న కాంతలందరు చేరి "ఏం జరిగిందే? ఆ కల సాంతంగా చెప్పు" మంటూ భయంతో అడిగారు. ఆ ప్రశ్నలకు సమాధానంగా త్రిజట చెప్ప మొదలు పెట్టింది. "ఏనుగు దంతాలతో అమర్చిన పల్లకిలో, తెల్లని పుష్ప మాలలు ధరించి రామ లక్ష్మణులు హంస సహస్రం ఆకాశ మార్గంలో కొని రాగా ఇక్కడికి చేరుకున్నారు. తెల్లని జలతారు వలిపెములు ధరించి ఈ తల్లి, పాల కడలిలో శ్వేతపర్వతంపై భాస్కరునితో కూడిన ప్రభలాగా ఆ రాముని ప్రక్క నిలిచింది ఇంద్రుని ఐరావతం వంటి నాల్గు దంతాలుకల తెల్లని ఏనుగు నెక్కి వాళ్ళవెనుకగా పోతున్న లక్ష్మణుని చూచాను. ఆ అన్నదమ్ములు శుక్లాంబర మాల్య ధరులై ఈమె ప్రక్కన గుణ సుందరులై నిలుచుంటే గుండెలు ఉప్పొంగగా కలలో కన్నాను. ఆ విధంగా వారు ఒక ఉన్నత పర్వతాగ్రం చేరగానే రాముడు ఆసీనుడైనాడు. ఆయన వామాంకంపై కూర్చొనగానే "సూర్యచంద్రుల తాకుతున్నారా?" అన్నట్లు తోచింది. అనంతరం ఆ సోదరులూ, ఈ రాజాస్య ఒక ధవళ దంతావళంపై ఎక్కారు. ఆపై వాయుపథంలో పయనించి లంకా నగరం మీద తిరగటం చూచాను. ఆ దృశ్యం మారిపోయి తెల్లని బలిసిన ఎద్దులు ఎనిమిది పూన్చిన రథం ఎక్కి పురుష పుంగవుడైన రాముడు ఈమెతో కూడి ఇక్కడకు రావటం చూచాను. ఇంకా వింతలు వినండి.

సూర్యకాంతిని హసించే పుష్పక నామంగల దేవయానంపై ఈ ముగ్గురూ ఉత్సవం చేస్తుండగా ఉత్తర దిక్కుగా ఊరేగుతూ పోవటం తిలకించాను. విష్ణు పరాక్రముడూ, ధీవిభవుడూ, రామ ప్రభువు సోదరునితో, భార్యతో కూడి స్వప్రకాశం దిశల వెదజల్లుతుండే కన్నుల పండుగ్గా కాంచాను ఈ అపూర్వ స్వప్నాన్ని భావిస్తే ఈమె కేవలం మానవి కాదనీ, వాళ్ళు కేవలం మర్త్యులు కారనీ తోస్తుంది. సఖులారా! ఇంకా ఏం చెప్పనే? పాపులు స్వర్గం చేరలేనట్లు మన

రక్షోగణం వాళ్ళున్న తావు చేరలేదు. ఇంకా యుద్ధం ఎక్కడ చేస్తారు? చేసి ఎక్కడ జయిస్తారు? దీనికి బలంగా నాకు వచ్చిన కలలో మన ప్రభువు ఒడలినిండా నూనె పూసుకుని, నూనె త్రాగుతూ, ఉన్మత్తుడై, కంఠంలో గన్నేరు పూలదండ వ్రేలాడగా, రక్తాంబరాలు ధరించి తల గొరిగించుకుని, కృష్ణాంబరాలు పైనచుట్టి, తన పుష్పక విమానం పైనుంచి భూమిపై పడేట్లు తలక్రిందుగా ఒక ఆడుభూతం ఈడుస్తుంటే గోలపెడుతున్నట్లు కనుపించాడే. ఆ తరువాత గాడిదలను కట్టిన బండిపై గంతులేస్తూ, తైలం త్రాగుతూ, ఎర్రని గుడ్డలు కట్టుకుని దక్షిణదిశగా నవ్వుకుంటూ పోవటం చూడటం జరిగింది. మళ్ళీ స్వప్నం చెదరి ఒకేఒక గాడిదపై ప్రయాణంచేస్తూ అకస్మాత్తుగా భయమోహితుడై తలక్రిందుగా ధరణిపడి దిగ్గునలేచి వెలవెలపోతూ, మద విహ్వలుడై, ఆర్తుడై, జల్పకుడై (ప్రేలుతూ) దిసమొల కలవాడై, దిక్కు తెలియకుండా, దుర్గంధ ఘోరం, దుస్సహ తిమిరం, దురంత నరకాభం అయిన అంతులేని రొంపిలో పడటం కానవచ్చింది. ఆ పెను బురదలోపడ్డ మన ప్రభువును 'కాళి' అనే పేరున్న కాంతి రక్తవసన, కర్దమలిప్తకాయయై మెడబట్టి లేపి దక్షిణంగా ఈడ్చుకుని పోవటం కనిపించింది. అంతటితో ఆ దృశ్యం మారిపోయింది.

మన యువ ప్రభువు కుంభకర్ణుడూ, రాక్షసేశ్వర సుతులూ నూనె కొప్పెరల్లో పడటం, ప్రభువు పందిపై, ఇంద్రజిత్తు మొసలిపై, కుంభకర్ణుడు ఒంటెపై, దక్షిణ దిక్కుగా పోవటం, విభీషణుడు మాత్రం పూర్వం రామాదులు ఏ విధంగా కనుపించారని చెప్పానో ఆ శుభలక్షణాలన్నీ ధరించి సర్వశుక్లవర్ణ ప్రభాభాసుడై శంఖ దుందుభి నిర్ఘోషాలతో నృత్త గీత వాద్యాలు చెలిమిచేస్తుండగా శ్వేత దంతావళంపై అధిరోహించి, నలుగురు మంత్రులు పరివేష్టించి రాగా ఆకాశ మార్గంలో పోవటం కన్నులారా కాంచాను" అని త్రిజట చెపుతుంటే "ఒసే, త్రిజటా! ఈ కంకూ, నీ నోటికి హద్దేమైనా వుందా? ఇంత పెద్ద కలరావటం, వచ్చినదంతా పూసగ్రుచ్చినట్లు మరిచిపోకుండా చెప్పటం ఎట్లా నీకు సాధ్యమైందే? అంతా కల్పన. మమ్మల్ని భయపెట్టటానికి ఈ పన్నాగం పన్నావు. వచ్చిన కలంతా మనకు అశుభం, శత్రువులకి శుభంగానే

వుందిటే" అంటూ అవహేళన చేశారు అసురకాంతలు. వాళ్ళ ఎక్క-రింపులకు త్రిజట నోరువిప్పి పెద్దగా నవ్వుతూ "ఎందుకే మీకింత మిడిసిపాటు? ఎప్పుడైనా ఇటువంటి సంగతులు చెప్పానా? అయినా, మన కుల నాశనం, ప్రభువు నాశనం నేను కోరుకుంటానా? అవతల వాళ్ళెవరో నేను చూశానా? వాళ్ళ పేర్లు ఎరుగుదునా? ఈ స్వప్నం ఇంకా వుంది. మీకంటే తెలివికల దానినని మీరంతా అంటారు కదా! అదిగాక ఈ ఈ స్వప్నం జాగ్రదవస్థలో జరిగినట్లే జరిగి నాకు ధారణలో నిలిచి పోయింది. ఈ సీత నా కూతురా? రాముడు నా కొడుకా? వీళ్ళపై నాకేం మమకారమే. మీ రడిగారని చెపుతున్నాను. వద్దంటే మానుకుంటా"నని ఆ వృద్ధ బిర్ర బిగిసి కూర్చుంది. అందరూ చేరి "కల సాంతంగా చెప్పు. ఊరికే పరిహాసం చేశాం" అంటూ బలవంత పెట్టారు. ఆ వృద్ధ రాక్షసి మళ్ళీ అందుకుంది.

"ఓసి ధూర్తలారా! అందితే తలా, అందకపోతే కాళ్ళా పట్టుకునే లక్షణం మీ కెంతైనా వుందే. మిగిలింది చెపుతా వినండి. కల్లు త్రాగుతూ, చెంగావి గుడ్డలు కట్టుకుని భయంకర వాద్య ఘోషలతో రాక్షసులంతా లంకా నగరంవిడిచి లంకేశుడుపోయిన దిక్కుకే పోసాగారు. వాళ్ళు పోగానే, నగరంలోని తోరణాలన్నీ తెగి పడినై. ఆకాశాన్నంటే గోపురాలు విరిగి నేలబడ్డాయి. అపూర్వ శోభా విలసితమైన లంకాద్వీపం మూల ముట్టుగా సముద్రంలో మునిగి పోయింది. ఆ రామునకు ఒక కోతి బంటట. ఆ కోతి వచ్చి లంకంతా కాల్చి బూడిద రాసులు చేసింది. ఆబాలవృద్ధం గోడు గోడుమంటూ గోల చేస్తుంటే కూలి మునిగి పోతున్న మన నగరం గోచరించింది. మన పట్టణం తగలబడుతుంటే మన కుంభకర్ణాది యోధులంతా మగటిమి కోల్పోయి పేడ గలిసిన మడుగుల్లో పడిపోవటం చూశాను. ఇక మీ దౌష్ట్యం ఆపండి. సాధ్వీసవాక్యాల పుస్తకం మూయండి. మన కులానికి ప్రమాదం వచ్చింది. ఈమెను మంచి మాటలతో లాలన చేయండి. ఈమె పాదాలపై పడి క్షమాభిక్ష కోరండి. ఈమె భర్తను పొందటం ముమ్మాటికి సత్యం. వెంటనే లేచి చాటుకు పొండి. ఆ రాముడు ఉగ్రకోపుడై రాక్షసుల చెండి ఈమెను చేపట్టితాడు. ఆ సమయంలో మనం చేసిన ఘాతుక కృత్యాలకూ, అన్ని

దుర్నృపులకూ, భార్య సంతోషం కోసం మనలను ముక్క ముక్కలుగా నరుకుతాడు. ఆ రాముడు ఈమె కోసం నేల ఈనినట్లున్న రాక్షస సంతానాన్ని మిగులకుండా హతమారుస్తాడు. ఇంతవరకు ఈమెను మనసుంతా అవలించాం. బెదరించాం. ముదలకించాం. మనపై ఈమె సదయ ఎందుకవుతుంది? మనకు రామునిచే చావు తప్పదు. ఆయన కంటే ముందుగా ఈమెను వేడుకుందాం. తప్పక ఈమె మనల్ని కాపాడుతుంది. క్షమాగుణం ఈమె రూపం దాల్చింది. నిదానంగా చూస్తే ఈమెలో అవలక్షణాలేమీ కానరావు. కాల గమనంలో బాహ్య శరీరం కొంత కాంతి మారింది కాని అసలు తేజంలో మార్పులేదు. నేను తెలివి తక్కువగా ఈమెను సామాన్య మానవిగా శంకించాను. ఈ దేవి త్వరలో భర్తృ సమాగమం కలిగి వర్షంచే వాడిన లత తేరుకున్నట్లు తేరుకుంటుంది. చూడండే చూడండి. అదుగో, నే నీ మాట అంటుంటే ఆమె వామనేత్రం గాలికి కదలిన పద్మంలాగా కదులుతూంది. ఇక కార్యసిద్ధి ఎంతో దూరంలో లేదు. రాక్షసనాశనం, రాముని ఆశయపరిపూర్తి తథ్యంగా జరిగి తీరుతుంది" అని త్రిజట స్వప్న వృత్తాంతం ముగిస్తుంటే జానకి వామ హస్తం, వామ కురువు స్పందించి శుభం సూచించినై. చుట్టూ వున్న వృక్షాలపై వసించిన ఖగకులం మాటిమాటికీ కలకూజితం చేసి రాముని రాకకూ, జానకి సంతోషానికీ స్వాగతం ఇస్తూంది. త్రిజట ఈ సంకేతాలను బాగా ఎరిగింది కావటంతో తోటి రక్కసుల దూరంగా తోడుకొని పోయింది.

## సీత రాముడు రామికి పరి పరి విధాల దుఃఖించుట

భర్తృ భావ పరిఖిన్న మానసయైన సీత మాటిమాటికి రావణాపహృతయై, లంక చేరి పొందుతున్న బాధా గాథా పరంపర పునరావృత్తమై కంఠీరవం ఎదుర్కొన్న కరిణిలాగా కంపించింది. తన పుట్టిన చోటూ, చేపట్టిన తావూ, తనవారూ, పతివైపువారూ, తండ్రీ, మామా, అత్తా, భర్తా, మరదులూ, సముద్ర తరంగాలవలె ఉవ్వెత్తుగా స్మృతికి వచ్చి ఒక్కసారి క్రుంగిపోయింది. "అయ్యో! క్రూర దారుణ ఘోర కష్టాలకు వృత్రవైరి వజ్రపాత విభిన్న శైలశృంగంవలె నా గుండె వేయి మునకలు కాక ఇంకే సుఖం ఆశించి నిలిచి వుంది? దైత్యుడిచ్చిన

గడువు దాపునకు వస్తోంది. ఈ లోపల నా నాథుడు రాకపోతే రాత్రించర వల్లభుడు శస్త్ర చికిత్సకుడు మృత శిశువును గర్భం ఛేదించి వెలికి తీసినట్లు నన్ను శస్త్రం చేసి మాంసం వెలికి తీస్తాడు. మరణశిక్ష విధించగా చెరసాలలో వున్న దొంగ తెల్లవారులోపల పడే చింతను దాటిపోతూంది నా చింత. అయ్యయ్యో! ఎంత కాని కాలం వచ్చింది? కన్న తల్లికి మిన్నగా ఆదరించే అత్తా! కౌసల్యాదేవీ! అత్తకంటే అధికాధికంగా ప్రేమించే చిన్నత్తా! సుమిత్రాదేవీ! కన్నతల్లిని విడిచి నన్నే తల్లివలె భావించే ముద్దుల మరదీ! లక్ష్మణా! ప్రాణాధికంగా ప్రేమించి ఆదర్శ గృహస్థుగా పేరుగన్న ప్రణయ సముద్రా! రామభద్రా! హా రామా! లక్ష్మణా! హా అత్తలారా! సుడి గాలికి కడలిలో సుడి తిరిగే నావ వలె అల్లాడిపోతున్నాను. మందభాగ్యను. మీ మీ సౌజన్య సౌశీల్యాలు నాకు రక్షగా ప్రసాదించలేరా? ఇందులో ఎవరిదోషం లేదు. ఇంత జరగటానికి మూలం నేనే. సింహాన్ని దాకిన వృషభద్వయంవలె మృగ రూప ధారియైన ఆ ముక్కిడి రక్కసుని చేతితో నా పతి, మరదీ హతులై వుంటారు. ఎన్నడు కోరని నేను వింత మృగాన్ని కోరటం, నా భర్త పోవటం, మరదిని కాని మాటలని దూరంగా పంపటం అంతా నా పాపం పంటకు రావటం వల్లనే. హా రామా! ఆశ్రితజలధిసోమా! సుగుణా రామా! భవసంతరణ నామా! నీలమేఘ శ్యామా! విస్తుల కారుణ్య ధామా! శత్రు భయంకర కోదండపాణి భీమా! రణరంగ భీకరా! ఆజానులంబితదీర్ఘకరా! సమస్తజగచ్ఛయ సంరక్షణా! దుష్ట జన శిక్షణా! సారస నేత్రా! అనురాగపాత్రా! ఈ వికట స్త్రీలు నన్ను చంపటం నీవెరుగవా? నీవు తప్ప ఇంకో దైవంలేదని విశ్వసించిన నా తలపు, నీ మాటలు మళ్ళీ వినటానికై వికట రాక్షస పరుషాలాపాలు విని సహిస్తున్న నా ఓర్పు, నీతోకలసి శయనించే ఆశతో కటిక నేలపై పడివున్న కఠినదీక్ష, లోకభర్తవైన నీవు నా భర్తవై నన్ను రక్షించక పోతావా అనే ధర్మమార్గంతో కూడిన స్థైర్యం, మనసా, వచసా, కర్మణా అన్యభావం లేక నీకై సాగిస్తున్న పాతివ్రత్యం బూడిదలో పోసిన

పన్నీరువలె, కృతఘ్నునకు చేసిన మేలువలె పాడైపోయిందా? నా పాపం ఎంత బలీయస్థానంలో వున్నదో!!

నిన్ను చూచే ఆసతో క్రుంగి కృశించాను. అది ఫలించలేదు. నే చేసిన పుణ్యకార్యాలు అక్కరకురాని చుట్టాలవలె వ్యర్థమైనై. నా ఏకపత్నీ నియమం ఏటిలో కొట్టుకుని పోయింది. తండ్రి విధించిన అరణ్యవాసానంతరం అయోధ్యకు చని అభిషేకం పొంది సవ్యకాంతాజన లోలుడవై సుఖిస్తావు సుప్రతుడవైన నిన్ను భావిస్తాను. నాథా! ఏది ఏమైనా నేను మాత్రం నీవే పతిగా స్మరిస్తూ మరణిస్తాను. నేను సల్పిన సత్కార్యాలూ, నోచిన నోములూ నా దౌర్భాగ్యంచేత వ్యర్థమయినై. అయినా భారతనారికి పతియే దైవం. అదే వేదమాత ఆడుబిడ్డలకు ప్రసాదించిన అమోఘ సంపద. నేను నా భర్తను స్త్రీ స్వాభావికంగా శంకించాను. పాపం శమించుగాక. కటకటా! ఇంత మహానగరంలో నాకింత విషమిచ్చే దాతలేలేరా? ఒక కత్తి ఐనా ఈయగూడదా? ఏది లభ్యమైనా ఈ పాపిష్టి తనువును సర్వదుఃఖనాశంగా పతనం చేస్తాను" అంటూ అనేక విధాల పలవించి, గొంతు ఎండిపోగా ఏడ్చి వణకిపోతూ దగ్గరగా పుష్ప ఫలభారంతో వంగిన కొమ్మలతో వున్న చెట్టు సమీపానికి చేరింది. సంస్కారహీనంగా జడలుకట్టిన తన జడ చేతపట్టుకుని, అందుబాటులో వున్న ఒక కొమ్మను పట్టుకుని, సర్వాత్మనా తన పతిమూర్తిని భావిస్తూ, వేణిని కొమ్మకు చుట్టుచుండగా ఏదో తెలియని శక్తి, ఛళ్లున కొరడాతో కొట్టినట్లయి త్రుళ్ళిపడింది. వెంటనే శుభసూచిక నిమిత్తాలు శరీరంపై తోచినై. ఆ శుభశకునాలకు అవనిజ ఆశ్చర్యచకితురాలైంది.

## మరణించబోయే జానకికి శుభ శకునాలు కలుగుట

చివరి రక్తబిందువు వుడికి ఆవిరయ్యే వరకు వేచి, కాచి, చూచి నిరాశోపహతయై భర్త ఎడబాటు ఇక సహించలేక ఆత్మహత్యకుపాల్పడగావే, ధనవంతుని ఇంటికి చేరిన సేవకుల్లాగా, లక్ష్మీకమూ, అరాల పక్ష రాజీవృతం, విశదవిశాలం, వినీలం అయిన ఆమె వామనేత్రం మీనాహత పద్మంవలె చలించింది. మృదుమనోహరం, పీనవృత్తం, పరిమళ ద్రవ్య లేపన సమర్హం లోకనాథుడైన రామచంద్రునిచే చిరగృహీతం అయినవామ

భుజంకొంతసేపు కదలింది. కరికర సన్నిభం, కడు మనోజ్ఞం, సరసం, సమం,పీవరం, కాంతిమంతంఅయిన కరభోరు ఊరుమధ్యప్రదేశం రాముని రాకను తెలుపుతున్నట్లు అదిరింది. త్రిలోక సుందరియైన సీత ధరించిన చీర ధూళి దూసరంగా మాసి బిగిసి వుంది కూడ కొంచెం సడలింది. తనకు పూర్వం పరిచయమై శుభం సూచించిన నిమిత్తాలను భావించి మైథిలి గ్రీష్మ భీష్మతో పసివాళ్లు వాడిన బీజం వృష్టితోననసాగినట్లుగా జీవితాశను సాగించింది. దొండ పండును పోలిన వాతెర, తుమ్మెదల గుంపుకు దిమ్మెక్కించే కురులూ, ధనుస్సువంటి కనుబొమలూ, అర్ధ చంద్రాకారంవంటి భ్రుకుటీ, మల్లెపూలవంటి పలువరుసా, రాజీవం వంటి ముఖం రాహుముక్త చంద్రునిలాగా ప్రకాశించినై. తానెన్నడు కూడ కలలోనైనా తలపని సర్వోత్తమ శుభ నిమిత్తాలు స్మరణ సమయంలో తనకు కలగటంతో రామ భూకాంత కాంత నిశాకాంతతో శోభించే హిమ కాంతుని హసిస్తూ, విగత శోకియై, సంగతోత్సాహయై ప్రకాశించింది.

## జానకితో సంభాషించే విధానం హనుమ యోజించుట

కారుమబ్బులు క్రమ్మిన నీలాకాశం నిర్మలమైనట్లు, వర్ష ఋతువులో గట్టొరసి కశ్మలంగా ప్రవహించిన నది శరత్కాలంలో పరిశుద్ధంగా వున్నట్లు, శిశిరంలో నామమాత్రంగా మిగిలిన వృక్షాలూ, లతలూ వసంతంలో శోభించినట్లు, గ్రహణ నిర్ముక్తమైన దివాకర నిశాకర బింబాలు ప్రకాశించినట్లు, శోకంబాసి, ధైర్యం సంకరించి ప్రసన్నంగా వున్న సీతామాత మూర్తిని హనుమ చూచాడు. ఇంతవరకు రాక్షసీ ప్రలాపం, సీతా విలాపం, త్రిజట స్వప్న కలాపం విన్న మీదట ఇప్పటి రూపం చూచి నందనవనంలో వున్న మర్త్యకాంతగా భావించాడు. ఆలోచనా పరంపర అవ్యాహతంగా రాసాగింది. "అసంఖ్యాకంగా వున్న కపిశ్రేష్ఠులు ఏ మానవతి కోసం అహర్నిశలు నిద్రాహారాలు బ్రదుకు మాత్రంగా స్వీకరిస్తూ వెదకారో ఆ తల్లిని నేను చూచాను. ఈమె సీత అవునా కాదా అన్న సంశయం, ఈమె సతీత్వం రావణ వాక్యాలతో పరాస్తమై, సదృఢమైంది. ఓహో! ఈ వనం రావణాంతఃపురంలో ఒక భాగం అన్న మాట. కామభావం కలగగానే పంక్తిముఖుడు రావటం

జరిగింది. ఆ రాకతో నా మనశ్శల్యం తీయబడింది. వచ్చిన కార్యం నెరవేరింది. యోగ్యుడనై, చతురుడనై, శత్రు మర్మజ్ఞుడనైన నేను సీతమ్మ దర్శనంతోపాటు లంకా నగరం గుట్టుమట్లన్నీ తెలుసుకున్నాను. కనుక, సర్వభూత హితుడూ, అప్రమేయ గుణాకరుడూ అయిన రామచంద్రుని పత్నిని, భర్త రాకకై పరితపించే ఈమెను ఆశ్వాసించి పోవటమే అన్నివిధాలా మంచిది. దుఃఖసముద్రానికి పారం ఎరుగక వుండే ఈమెను ఓదార్చకుండా పోతే అనర్థం తప్పదు. ఈమె ఇప్పటికే విరాళ విస్పృహలతో ఆత్మహత్యకు సిద్ధమైంది. నా అదృష్టంవల్ల ఎందుకో విరమించింది. ఇకముందు తన్నుతాను రక్షించుకోలేక ప్రాణత్యాగం చేసుకోవచ్చు. ఇది సరికాదు. ఈమె వార్తకోసం ఎదురు తెన్నులుచూస్తూ, కన్నుల్లో ప్రాణాలుంచుకొని నారాకను ప్రతీక్షించే రామప్రభువును ఆశ్వాసపరచుట న్యాయం. రెండూ బలంగానేవున్నై. ఏదిముందు? ఏది వెనుక? ఈమెను ముందు ఓదార్చవలెనంటే ఈ ఆడు దయ్యాలు వినకుండా పలికేదెట్లా? తెల్లవారేలోపల రామసందేశం వినిపించకపోతే ఇంతచేసి ఆమెమరణాన్ని చూడవలసివస్తుంది. అక్కడ రామచంద్రుడు నన్నుచూచి "హనుమా! సీతను చూచావా? ఏమన్నది?" అంటూ ప్రశ్నించితే చూచానని మాత్రమే చెప్పితే ఆయన తృప్తిపడతాడా? ఆనవాలేమి తెచ్చావంటే నాతోనే తిరిగి తెచ్చానంటే సమాధానపడతాడా? ఈమె సందేశం లేకుండాపోతే నన్ను రామచంద్రుడే కాదు, రవిపుత్రుడుకూడా బ్రదుకనీయడు! "సీతను చూచాను. వెంటనే కపిసేనలతో కదలండి. లంకలో ప్రవేశించి రావణుని వధించండి" అని చెప్పికొనివచ్చేలోపల ఈమె ఇక్కడ జీవించి వుండదుకదా? అక్కడ రాముణ్ణి ఆదుకునేందుకు సుగ్రీవుడూ, లక్ష్మణుడూ వున్నారు. నా సంగతి తెలిసిన రవిపుత్రుడు నేను వచ్చేవరకూ ఓపికతో నిరీక్షించేటట్లు చేస్తాడు. ఇక్కడ ఈమెకు ఏ రక్షణాలేదు. ఉభయపక్ష విచారధారలో ఈమెను ఓదార్చటమే యుక్తమని తేలింది. ఇక ఇక్కడనిలిచే రంధ్రం వెదకి కార్యం సాధించాలి. ఇప్పటి నా శరీరం అల్పం. పైగా వానరాకారం. మానవునిలాగా సంస్కృతంలో పలికితే ఈ స్థితిలో ఈమె భీతురాలవుతుందేమో. లేక రాక్షసమాయగా తలుస్తుందేమో. ఈ సంకట

సమయంలో కర్తవ్యం ఏమిటి? ఎలాగైనా ఈమెను ఊరడించి ధైర్యం చెప్పాలి. ఎలా చెప్పాలి? ఏవిధంగా చేస్తే శంకారహితంగా ఆమె విశ్వసిస్తుంది? మౌనం కార్యసాధనంకాదు. రూపంచూస్తే కోతి. మాటలు చూస్తే మానవులవి. ఈ విచక్షణతో ఇతఃపూర్వం దానవకాంతల దారుణపీడనంతో ధైర్యంచెడిన ఈమె ఇంకా భయభ్రాంతురాలు కాక మానదు. దానితో ఆగక, కామచరుడైన రావణుడు తన కార్యసిద్ధికి ఈ మాయ పన్నాడని ఊహించి బిగ్గరగా అరుస్తుంది. ఆ అరుపులకు అసుర కాంతలు వివిధాయుధధారిణులై నాపై పడతారు. వీలయితే చంపుతారు. కాకపోతే బంధించి కొనిపోతారు. ఈ ఊహ యుక్తంగా లేదు. కొమ్మలతో, రెమ్మలతో, చెట్లతోకూడిన వనంలో పరుగులెత్తితే ఈ కాంతలు భయంతో పారిపోతారు. ఆసమయంలో ఆమెతో మాటలాడవచ్చు ....ఉహూ. ఇది కూడ సరియైన భావం కాదు. నా భీకరాకారం, నా ప్రళయచేష్ట చూచి పారిపోయిన కాంతలు వనరక్షకులకు చెపుతారు. వారు రాక్షసరాజుకు చెపుతారు. ఆయన సైన్యాన్ని పంపుతాడు. ఆ సైన్యం సర్వసాధన సంపత్తితో నా పైకి వస్తుంది. ఆత్మరక్షణ కోసం వచ్చిన సైన్యంతో పోరక తప్పదు. దానితో సముద్రతరణం సాధ్యంకాదు. విధి వికటించి నేను పట్టుబడితే రామ క్షేమవార్త సీతమ్మకు చేరదు. నేను రాక్షసులకు చిక్కుతాను. ఈమెను ఈ కాంతలూ చంపుతారు. ఇంత వరకు తెలివిగాచేసిన కార్యం చెడుతుంది. అంతతో రామ రవిజులు ప్రారంభించిన కార్యం పాడైపోతుంది.

రావణుడు నీచకాముకుడు. వానికి నియమనిష్ఠలతో పనిలేదు. మనసు మార్చుకోవచ్చు. జానకమ్మ అనుకూలవతి కాకున్నా, బలాత్కారంతోనైనా చూడవచ్చుని భావించి మహాసాగరం అగడ్తగావున్న లంకలోనే రహస్యంగా రక్షిస్తూవుండవచ్చు. బహుకాలమైనా పతిజాడ తెలియని ఈమె బలవంతాన ప్రాణాలు వదలవచ్చు. రెండూసాధ్యాలే. ఇక నా విషయంచూస్తే, కాలం కర్మం కలిసివచ్చి పోరులో నన్ను చంపినా, లేక నిర్బంధించినా, రామకార్యం నెరవేర్చే దక్షులు కపులలోలేదు. శత

యోజన పరిమిత జలనిధి దాటి లంకలో ప్రవేశించే సాహసవంతుడు ఇంకొకడులేడు. సూర్యపుత్రుడు శక్తి సంపన్నుడే కాని, ఆయనకు సీత లంకలో ప్రాణాలతో వున్నదని చెప్పేవారేరి? ఆహా! విధి విపరీతం! ఎంత విడివడని ముడి పడ్డది? నాకు గల అపార శక్తి సంపదతో లంకలోని రాక్షసానీకాన్ని పేరు లేకుండా చేస్తాను. కాని, కాలం ఎంత గడచి పోతుంది? తిరిగి వస్తానన్న గడువు దాటగానే కపులంతా ప్రాయోప వేశంతో మరణిస్తారు. ఈ వార్త తెలిసి రామ, లక్ష్మణ, సుగ్రీవులతో కిష్కింధ కూలిపోతుంది. ఇక్కడ ఈమె మరణిస్తుంది. రణరంగంలో జయాపజయాలు దైవాధీనంగా వుంటై. నాకేమో శంకా పంక దూషిత మైన పని చేయటం సమ్మతం కాదు. బుద్ధిమంతుడు సందేహ కార్యాల్లో తల దూర్చి నిందా భాజనుడు కాడు. ఈ ప్రాణ మాత్రావశేషగా మిగిలిన సీతమ్మను ప్రాణ ధారణ నిమిత్తం పలుకరించక తప్పదు. పలుకరిస్తే పై ప్రమాదాలు సంభవిస్తాయి. విధి లీల ఎంత విచిత్రమైంది? ఏన విధంగా తోచే పనులు సూర్యకాంతికి తిమిరంగా క్షణంలో చెదరిపోతవి. కాని పనుకున్న కార్యాలు కొబ్బరి కాయలో జలంవలె తెలియకుండా కూడి వస్తై. అందుకే కార్య సాధకుడు దేశకాల పాత్రలు తెలిసి ప్రవర్తించాలి ఈ కార్యం ఈవిధంగా చేస్తే ఫలిస్తుందని ప్రాజ్ఞులు నిర్ణయించిందైనా బుద్ధి హీనుల చేతిలోబడి భస్మ హవ్యమవుతుంది. ఏం చేస్తే కార్య హాని కలుగదు? నాకు కల్గిన బుద్ధి జాడ్యం ఏ విధంగా నశిస్తుంది? విఘ్నం కాకుండా సముద్ర లంఘనం ఏం చేస్తే జరుగుతుంది? ఈ సీతమ్మ నా మాటలు ఎట్లా ప్రవర్తిస్తే వింటుంది? విని విశ్వాసంతో నమ్ముతుంది? నా రూపంగని భీతి చెందకుండా వుం టుంది?" అని దీర్ఘంగా ఆలోచించాడు. చివరకు ఒక నిర్ణయానికి వచ్చాడు. "ఈమె ఇప్పుడు భర్తృ దర్శనంకోసం పల్లటిల్లి పోతూంది. భర్తవార్త తెలిస్తే చాలని కోరుతూంది. కనుక ముందుగా నా రూపం చూపకుండా, ధర్మబద్ధం, శుభ సహితం అయిన శ్రీరాముని మహోన్నత గుణాలను మధుర వాక్యాలతో అనుమానం కలగకుండా గానం చేస్తాను. రూపం చూడదు కనుక భయపడదు. ఆత్మేశుని గుణగణ సంకీర్తనం

కనుక ఆశతో ఆలకిస్తుంది. ఆలకించి ఎంతమేరకు విశ్వసిస్తుందో ముందు తెలుసుకుంటాను. ఆపై కార్యం అటు తర్వాత చేస్తాను. ఇది అపాయంలేని ఉపాయం" అని హనుమ నిశ్చయించాడు.

## హనుమ సీత వినునట్లు రామగాథ కర్ణపేయంగా గానం చేయుట

ఎన్ని సంకట సమయాల్లోనైనా మహాత్ముల సంకల్పం ఫలిస్తుందన్న శ్రుతిసూక్తి హనుమపట్ల సార్థకం అయింది. ఎట్టకేలకు సంకల్ప సాగరంలో ప్రయాణం చేస్తున్న భావ నౌకను హనుమ తీరం చేర్చాడు. మనస్సు నిర్మలమై ప్రసన్నమైంది. వెంటనే శింశుపా వృక్షశిఖరం నుంచి నిశ్శబ్దంగా క్రిందకి దిగి గుబురుగానున్న కొమ్మల ఆకుల్లో సీతమ్మను తాను చూచేలాగా, ఆమెకు తన మాటలు వినపడేలాగా నెలవు చేసుకొని, ప్రారంభంలోనే శంకారహితంగా, విశ్వాసపాత్రంగా, చమత్కార బీజావాపనంచేస్తూ, సంగీతకళా రహస్యనిధియైన హనుమ, సరసం, సార్థం, సత్యం, శివం, సుందరం, మధురం, మనోజ్ఞం అయిన శబ్దాలతో కూడిన రామకథ, విశేషణ పునరుక్త భాషణాలతో గానం చేయసాగాడు. "రామాయ, రామ భద్రాయ సీతాయాః పతయేనమః" అని హృదయంలో విఘ్నశాంతికై రాముని సంస్మరించాడు. సర్వ దేవతలకు నమస్కరించాడు. "దశరథుడనే రాజు అయోధ్యను పాలిస్తుండేవాడు. ఆయన మహారథి. యశస్వి, తేజస్వి, ధర్మశీలుడు, దయాపయోధి, గుణధన్యుడు, సర్వజన మాన్యుడు, రాజఋషి, సార్వభౌమ వంశసంజాతుడు, తపంలో మహర్షి, బలంలో పాకశాసనుడు, సత్య పరాక్రముడు, ఇక్ష్వాకు వంశ శ్రేష్ఠుడు, అహింసాపరుడు, రాజలక్షణ సహితుడు, సత్యవాది, చతుస్సముద్ర పరివృతమేదినీ చక్రవిశ్రుతుడు, సుఖి, భోగి, త్యాగి, దొరలకు దొర. ఆ పూజ్యునకు అగ్రసుతుడు శ్రీరాముడు. ఆయన అతి ప్రియ భాషణుడు, ఆశ్రితజన రక్షాదక్షుడు. ఆత్మధర్మపరినిష్ఠితుడు, స్వీయ వంశాచార పాలకుడు, వినయ సింధువు, జగద్భయంకర శరచాపధారి, దుష్ట శిక్షణుడు, శిష్ట రక్షణుడు, పరమ పూజ్యుడు. వృద్ధ జనకుని ప్రీతికై దారతో, తమ్మునితో ఆయన దండకాటవి చేరుకున్నాడు.

నిష్కారణ వైరం పెట్టుకుని చతురంగ బల సమేతంగా ఎత్తి వచ్చిన జన స్థాన పాలకులు ఖర దూషణ త్రిశిరాదుల పదునాల్గు వేల రాక్షస సైన్యంతో ఒక్కటిగా ఎదిరించి రూపు మాపి దండకారణ్యాన్ని తాపసులకు ఆవాసంగా చేశాడు. ఆ వార్త విన్న రావణుడు బంధు నాశనానికి ప్రతీకారంగా మాయా మృగాన్ని వలగా పన్ని రామచంద్రుని దూరంచేసి, ఆయన కోసం తమ్ముడు లక్ష్మణుడుపోగా, వంచనా రూపం దాల్చి ఒంటరిగా వున్న వైదేహిని అపహరించి తెచ్చి లంకలో నిర్బంధించాడు. ఆమెను అన్వేషిస్తూ ఆ లోకోత్తర మూర్తి కాల చోదితుడై పంపా తీరంలో వున్న ఋశ్యమూకానికి చేరాడు. ఆయన దివ్యరూపం, ఆ గంభీర చాపం చూచి సుగ్రీవుడనే ప్లవంగ పుంగవుడు మైత్రి చేశాడు. మిత్రుని తృప్తికై దేవతలకు కూడ అజయ్యుడైన కిష్కింధా ప్రభువు వాలిని ఒక్క బాణంతో వధించి వానర రాజ్యలక్ష్మిని వశం చేశాడు. కృతజ్ఞుడైన సుగ్రీవుడు ఆప్త మిత్రుని దుఃఖం పాపటం కోసం ప్రపంచంలోగల వానర వీరుల రప్పించి ఆయన అర్ధాంగి అవనిజ కోసం నాలు దిక్కులకు అన్వేషించమని పంపాడు. వచ్చిన వానరులంతా కామరూపులు. సర్వశక్తి సంపన్నులు. ప్రభువు మాట మన్నించి భూతలమంతా అణువణువూ శోధిస్తున్నారు. రవి పుత్రుని ఆజ్ఞాబద్ధులై సర్వ వానర శిరోమకుట మాణిక్యాలైన అంగద జాంబవంతాదులతో దక్షిణ దిశను శోధిస్తూ మహేంద్రగిరి చేరాను. జటాయువు అన్న సంపాతి వాక్యానుసారం శతయోజనాయత మహా కూపారం ధరణీ పుత్రి దర్శనార్థంగా దాటాను. ఇచ్చట ఇప్పుడు శ్రీరామునిచే చెప్పబడిన లక్షణాలతో శోభించే సాధ్విని సీతను నా పుణ్యం పండగా దర్శించాను. నా శ్రమ ఫలించింది. నన్ను గన్న తలిదండ్రులు ధన్యులైనారు" అని ముగించాడు.

## సీత హనుమంతుని చూచి భయపడుట

క్షుధార్తుడై నీటికి కూడా నోచక మూర్ఛ మునిగిన పాంథునకు అమృతమే లభించినట్లు మైథిలికి హనుమద్గాన రూప రామ కథా సుధారసం లభించి భయ సంభ్రమాశ్చర్యాలలో కొంత తేరుకుంది. హనుమ భాషణాలను అక్షరం అక్షరం పరిశీలనగా విన్నది. సురుచిరమైన రామ

కథ సంక్షిప్తంగానైనా తనివి తీర ఆలకించింది. స్వరూపం కనపడకుండా కేవలం మాటలు వినబడటంతో విస్మయాన్ని పొందింది. నాలుగువైపులా చూచింది. ఏమీ కనపించలేదు. మొగంపై మూగిన ముంగురులు మెల్లగా పైకి త్రోసి మొగం పైకెత్తి చెట్టును తేరిపార జూడ సాగింది. దట్టంగా వున్న ఆ వృక్షంలో ఒక కొమ్మ మీద ఉదయించే సూర్యునివలె వెలుగుతూ, శ్వేత వసనం ధరించి, నక్కి వున్న మహా కపి సంగ్రహ రూపం చూచింది. ఆ కపి మృదు భాషి, చంచలా రహితుడు పింగళుడూ, ధాన్యవ శోక సుమోత్కరాఘుడూ, స్వర్ణలోచనుడూ, అచింత్య పరాక్రముడూ, ఆపద్బాంధవుడూ అయినట్లు ఆమెకు తోచింది. ఒక్కసారి పతి నామస్మరణం "ఆపదామపహర్తారం" అని చేసింది. తేరిపార చూచింది. అదిరిపడింది. "అయ్యో ఇది ఎంత భీషణ వానరాకారం? పీడ కలలో చూడటం కలిగింది. ఏం కష్టాలు ప్రాప్తిస్తాయో? హా రామా! లక్ష్మణా! వుండుపై కారంపడినట్లు నా గోడుకు తోడు ఈ దుస్స్వప్నమా?" అని ఏడ్చింది. మళ్ళీ మళ్ళీ చెట్టు వైపు చూచింది. భగ్నపత్త్రిడూ, వానరపతి మంత్రి, వాతాత్మజుడూ, అఖండ మేధావి, రవిజ రాఘవుల బంటూ, తేజోమూర్తి అయిన హనుమ అక్కడే వున్నాడు. ఆగకుండా క్రమ్ముకుంటున్న అతి కంపనంతో శోకిస్తూనే, "లోలోపల ఇది నిజంగా స్వప్నమా? స్వప్నమే అయితే శాస్త్రం చూడరాదని నిషేధించింది. హరి నేను చూచింది కోతినేగా? ఇక విపత్తులు తప్పవు. రామ లక్ష్మణులకు కళ్యాణ పరంపర కలుగుగాక! నా తండ్రి సబాంధవంగా ఆయురారోగ్యములతో సుఖంగా వుండుగాక!" అని కోరుకుంటూ, వ్యాకుల చిత్తంతో శోకం పరమావధి చేరగా విసంజ్ఞయై శవప్రాయంగా పడిపోయింది. అంతలోనే తెలివి తెచ్చుకుంది. తనలో తాను వితర్కించుకుంది.

"ఇది కలే అనుకుందాం. కలవచ్చేది నిద్రలో కదా? నాకు ఈ కష్టంలో నిద్ర యెక్కడినుంచి వస్తుంది? అది మరచి ఎంతకాలమైంది! ఈ స్థితిలో భర్త సందర్శనం దుర్భగురాలనైన నాకు ఎలా కలుగుతుంది? ఇది మాత్రం స్వప్నం కాదు. స్వప్నమైతే ఆ చూచినచోటనే ఆ కోతి ఎందుకు వుంటుంది? కాదు కాదు. ఇది సత్యం. నిరంతరం త్రికరణ

శుద్ధిగా నా భర్తను స్మరిస్తూ, భావిస్తూ, నోటితో అంటూ, ఆ వాక్యాలే వినగోరుతూ వుండటంచేత, ఆ మాటలే వినటం, ఆ మూర్తినే దర్శించటం జరుగవచ్చు. కాకపోతే ఎల్లప్పుడూ పతిపై వ్యామోహంతో వున్న నా భావనాశక్తి పతిరూపంవలెనే వానర రూపంతో వచ్చి ఈ విధంగా భాషించవచ్చు. ఏమైనా ఇది స్వప్నం కాదు. యథార్థం. అలా అయితే ఇది మనశ్శక్తిచే ఏర్పడిన ఆకృతి కాదు. దానికి ఇదమిత్థం అన్న రూపు లేదు! ఇది స్థిరమైన ఆకారం పొంది వుంది. పలుకుతున్న మాటలన్నీ నన్నుచూచే. కనుక కలాకాదు. మాయాకాదు. 'జాగ్రదవస్థలోనే జరిగింది" అని మనస్సులో నిశ్చయించుకుని, రెండు చేతులు జోడించి "ఇంద్రయుక్తునీ, దేవతా మంత్రినీ, స్వయంభువునీ, శుచినీ మ్రొక్కుతున్నాను. వనచరుడు ఇప్పుడు నా ఎదుట పల్కిన పల్కులన్నీ సత్యంగా జరుగునట్లూ, అన్యథా జరగకుండునట్లూ చేయండి. నా కష్టాలకు అంతం కల్పించండి. వేదవిహిత కర్మాచరణ శీలురకు విజయం తప్పదని ఋజువు చేయండి. సతీధర్మం నిష్ఫలంకాదని నిరూపించండి" అంటూ అవనిజ అర్థించింది.

## హనుమంతుడు సీతతో సంభాషించుట

జానకి పల్కిన పలుకులు విన్న హనుమ ఇంకా క్రిందికి దిగి వినీతుడై, శిరంపై కేలు కీలించి, మధురాతి మధురమైన మాటలతో భాషించటం మొదలు పెట్టాడు. "అమ్మా! నీవు ఎవతెవు? ఈ మాసిన చేలం ఎందుకు ధరించావు? ఈ కొమ్మను వూతగాకొని ఎందుకు నిల్చావు? పద్మ పత్రాల నుంచి జారే జలంలాగా ఎందుకు శోకాశ్రువులు జారుస్తున్నావు? అర్హతగలవాడననుకుంటే ఆనతీయమని ప్రార్థిస్తున్నాను. కిన్నర కాంతవా? అమరగేహినివా? వసురుద్రుల భామవా? ఫణికామినివా? విబుధ గృహిణివా? యక్ష యోషవా? చంద్రుని బాసి వచ్చిన రోహిణివా? నీ భద్ర లక్షణాలను చూస్తుంటే నీవు సాక్షాత్తూ దేవతవే అనిపిస్తుంది. అమ్మా! మాట పట్టింపుతో మగని బాసి వచ్చిన అరుంధతివా? దయతో చెప్పమ్మా! కళ్యాణీ! నీకు భద్రం కలుగుగాక. ఎక్కడి నుంచి ఇక్కడికి వచ్చావు? ఎందుకు దుఃఖిస్తున్నావు? సౌందర్య రాశివి నీకీ

ఇక్కట్లు ఎందుకు వచ్చినై? తండ్రి ఎవ్వరు? సోదరులున్నారా? భర్త నామం ఏ సువర్ణాక్షర సంపటితం? అమ్మా! బిడ్డలున్నారా? నీ దీనస్థితి గమనిస్తే బలాత్కారంగా కొనిరాబడ్డట్లు గోచరిస్తుంది. కన్నుల నీరు కార్చటంవల్ల నీవు దేవ కాంతవు కావనీ, వేగంగా నిట్టూర్పులు విడుస్తుండటంచేత మర్త్య కాంతవనీ తోస్తున్నది. నేలపై నిలవటం, రాజకన్యా లక్షణాలుండటం నా తలంపును బలపరుస్తున్నై. జననీ! నీ మేనిపై నున్న శుభ లక్షణాలన్నీ సామాన్యవు కాక నృపకుల సంజాతవనీ, సార్వభౌముని పట్టపు దేవేరివనీ చెప్తున్నై. భర్తతో దండకారణ్యంలో తిరుగుతుండగా మోసంతో రావణుడు తెచ్చిన రామ పత్ని సీతా మాతవా? చెప్పు తల్లీ! నీకు మేలు కలుగుతుంది. అతి మానుషం నీ రూపం. దుస్సహప్రశయుత మైంది నీ వేషం. భావన కందని వైవర్ణ్యం రామ సతివని చెప్పక చెప్తున్నై. ఈ నా ఊహకు తిరుగులేదు. నీవు మమ్మాటికీ సీతవే అనుకుంటాను" అని పలుకుతుండే, పొంగి వస్తున్న శోకం నిలవరించుకుని జానకి మారుతి వంక ప్రసన్నంగా చూచింది. హనుమ తన నిశ్చయం ఫలించినందుకు పొంగి వస్తున్న ఆనందాన్ని నిలవరించుకుని వినమిత శిరస్కుడై సాభిప్రాయ గర్వితంగా చూచాడు.

## సీత హనుమకు స్వీయ వృత్తాంతం చెప్పుట

హనుమ చేసిన రామ నామ సంకీర్తనంతో, పలుకరించిన తీయని పలుకులతో హృష్టమానసయై, జనక సుత జనని పుత్రుని చూచే విధంగా పావనిని విలోకిస్తూ, హనుమ ప్రారంభించినట్లే ప్రారంభించింది. "వానర రూపా! సావధానంగా నా చరిత్ర విను. దశరథ మహారాజు కోడలను. జనక చక్రవర్తి పుత్రిని. రామ పత్నిని. పేరు సీత. అన్ని భోగాలతో అయోధ్యలో పతిని గూడి పన్నెండు వత్సరాలు ఆనందంగా అనుభవించాను. పదమూడో ఏట మంత్రి పురోహిత పౌర వర్గంతో మంతనం సలిపి నా మామ పతికి పట్టం గట్ట యత్నించాడు. ఆయన మూడవ భార్య కైకేయి వృద్ధ భర్తను మభ్యపెట్టి, అదలించి, బెదరించి, స్త్రీ జాతి లక్షణాలన్నీ ప్రయోగించి "నీవు సత్యవాదివైతే నా

బిడ్డకు రాజ్యం, రాముడికి అరణ్యవాసం విధిగా కల్పించు" మంటూ కోరింది. పాపం ఆ వృద్ధరాజు పూర్వం భార్య కిచ్చిన వరదానానికి కట్టుబడి నా భర్తను అడవికి పంపాడు. నా నాథుడు రాజ్యం కంటే పితృవాక్య పాలనం పరమధర్మంగా భావించి నన్ను అత్తకు అప్పగించాడు. నా పతి ప్రాణ రక్షణకైనా అసత్యం పలకడు. ఆయనకు ఇవ్వటమే తెలుసు. గ్రహించటం తెలియదు అందుచే సంతోషంతో అడవికి పయనమయ్యాడు. కుశాజినాలు కైకొన్నాడు. నేను భర్తలేని స్వర్గం కూడ తృణంగా భావించే దాన్ని. కనుక ఆయనకంటే ముందుగా నేను అడవికి బయలుదేరాను. మృదు హృదయుడు, నిరంతర రామాగ్రజ పాదారవింద భజనానందుడు, చిన్నత్త కుమారుడు, సౌమిత్రి నార గుడ్డలు ధరించి వెంట వచ్చాడు. మేం ముగ్గురం వనవాసవ్రత స్వీకారం చేసి, భయావహమైన దండకారణ్యం ప్రవేశించి కాలం గడుపుతున్నాం. ఆ సమయంలో ఈ కూళ, రావణుడు మ్రుచ్చిలించి తెచ్చాడు. అప్పటినుంచీ దిక్కుగానక ఆయన వారి కోసం అల్లాడుతున్నాను. వారి దర్శనం మాత్రమే నా జీవిత పరమావధి. అంతవరకే అసురపతి గడువిచ్చాడు. ఆ పైన నా శరీరం రాక్షస కాంతలకు ఆహారంగా నిర్ణయించాడు. ఆ సమయం లోపల నా భర్త వస్తాడనే ఆశతో భార్యగా బ్రతుకుతున్నాను. ఇంతవరకు ఇంత చల్లని మాటలుగానీ, ఈ కుశల ప్రశ్నలుగానీ, నా పతి చరిత్ర గానంగానీ ఎరుగను. నాయనా! విన్నావు కదా నా దీనగాథ" అని పలుకుతూ కంటికి మంటికి ఏకధారగా సీత ఏడ్చింది.

## హనుమ సీతకు రామలక్ష్మణుల క్షేమ వార్తను చెప్పుట

ఆమె దుఃఖం చూచి, హనుమ "అమ్మా! జానకీ! శోకించకు. నీ శోకం నేను చూడలేను. నీ శోకం తీర్చటానికే రామదూతగా వచ్చాను. నా స్వామి శ్రీరామచంద్రమూర్తి లక్ష్మణ సమేతుడై క్షేమంగా ఉన్నాడు. తాను కుశలంగా వున్నట్లు ముందు చెప్పమన్నాడు. బ్రహ్మాస్త్ర వేదశాస్త్రవిదుడు రామభద్రుడు వెంటనే నీ క్షేమం తెలుసుకోమన్నాడు. శౌర్యంలో సాటిలేని మేటి, సౌమిత్రి, రామానుజుడు పాదాభివందనం చేసి నీ కుశలం

అడిగినట్లు చెప్ప మన్నాడు. ఆ చెప్పే టప్పుడు సాశ్రుజల నేత్రుడై తల్లిని బాసిన బిడ్డవలె తల్లడిల్లిపోయాడు. దైవకృపవల్ల నీ దయితుడూ, మరదీ కుశలంగానే ఉన్నారు. వారికై నీవు బెంగపడవద్దు. నీవు ధైర్యం ధరించు" అంటూ ఓదార్చాడు. మారుతి పల్కిన మాటలకు సీత హర్షోత్ఫుల్ల మనోరవింద అయింది. శరీరం పులకించింది. సంతసంతో కన్నులు విప్పారినై. ఉబికిన ఉత్సాహంతో పావని చూచి "నాయనా, పావనీ! శరీరంలో ప్రాణాలుంటే నూరేండ్లకైనా చింతిత కార్యసిద్ధి మనుజులు పొందుతారన్న సూక్తి పెద్దలనుకొంటే విన్నాను. అది యిప్పుడు సత్యమైంది" అని పల్కుతూ, శుభవార్త తెచ్చిన హనుమంతుని అద్భుత ప్రీతిపూర్వకంగా చూచింది. కొంతసేపు ఈ విధంగా అన్యోన్య విశ్వాసం అంకురించి, పల్లవించి, కుసుమించే వరకూ జరిగింది సంభాషణం. అనంతరం సీత తనను నమ్మిందని తలచి అంజనా సుతుడు మెల్లగా ఆమెను చెట్టు దిగి చేర వచ్చాడు. దుఃఖోపశమనార్థం ఎన్నో విషయాలు వివరం చేశాడు. తల్లి ఒడిలో వుండే బిడ్డ లాలించినట్లు ఆమెను లాలించాడు. పావని సమీపిస్తున్న కొలది సీత హృదయంలో శంకించ సాగింది. రావణుడు మాయావి. తన కోర్కె విఫలం కాగా, భంగ్యంతరంగా ఈ మార్గం తొక్కి తనను స్వాధీనం చేసుకోదలచా దేమోనని భీతిల్లింది. ఆ భావం అంతకంతకు అవశగా చేయసాగింది.

## సీత హనుమను రావణుడని శంకించుట

ఆమె భయ సంతోష సందేహాల మధ్య కొంత కాలం కొట్టుమిట్టాడింది. ఎట్టకేలకు తెలివి తెచ్చుకుంది. "అయ్యో! ఎంత మోసం జరిగింది. రావణుడే ఈ రూపు దాల్చి వచ్చాడు. దైత్యుడు వానర రూపంతో వంచిస్తున్నాడని తెలియక మనస్సు విచ్చి మాటలాడాను. విశ్వసించాను. దీనితో ప్రమాదం వచ్చింది. ఇంకా చెంతకు చేరవస్తున్నా" డని లోలోపల భయపడుతూ, పట్టుకున్న కొమ్మను వదలి నేల పడిపోయింది. వడ వడ వణకిపోయింది. ఇంత కాలం ప్రాణప్రదంగా రక్షించుకున్న శీలం పాడవుతుందేమోయని వెగడిల్లింది. ఆమె పాటు చూచి ఆంజనేయుడు "అమ్మా!" అని పిలుస్తూ అంజలించాడు.

కాని, మైథిలి మాత్రం అతని వంక చూడలేదు. వేడి నిట్టూర్పులు విడుస్తూ, "ఓరీ రావణా! నీ మాయ రూపం పోల్చుకున్నా. ఇంతకు పూర్వం దుర్భాషలతో బాధించావు. ఇప్పుడు ఈ వేషంతో ఏడిపించుతున్నావు! నీ కిది శుభం కాదు. దండకలో భిక్షుక రూపంతో వచ్చి వంచించిన దుర్మార్గుడవు. దుర్బలను. ఉపవాస దీక్షతో కృశిస్తున్నాను. దీనను. పాపీ! నన్నా ఈ విధంగా హింసించటం? ఇక నీ మాయలు నా కడ సాగవు. అడుగు ముందుకు వేయకు. భస్మమై పోతావు" అంటూ అరచింది. అంతలోనే మనసు మార్చుకుని "ఈ కోతి రావణుడుగా గోచరించటం లేదు. రావణుడైతే ఇంత వినయం చూపిస్తాడా? తల్లీ, జననీ, మాతా" అని సంబోధిస్తాడా? అతని చూస్తే అసహ్యపడే నామనస్సు ఈ కోతిని చూస్తే ప్రసన్నమవుతున్నది. ఏదో కారణం లేకపోదు" అని భావించి "ఓ వానరా! నిన్ను రావణుడని గట్టిగా అనలేను. నీవు నిజంగా రామదూతవే అయితే నీకు శుభం కలుగుగాక. నాకు ప్రియమైన నా రామచంద్రుని గుణాలను వర్ణించు. పొర్లిపారే ప్రవాహం గట్లను హరించునట్లు ఓ శాంతమూర్తీ! నీవు నా హృదయాన్ని హరిస్తున్నావు" అని పల్కి మరుక్షణంలో మనస్సు వికలించగా, "ఎక్కడ లంక? ఎక్కడ రామదూత? ఇక్కడికి రావటం సాధ్యమా? స్వప్నం యథార్థ సౌఖ్యం ఇస్తుందా? ఇప్పటికిప్పుడే ఒక కోతి రామదూతనంటూ వస్తుందా? వచ్చి మాటలాడుతుందా? అయ్యో! కలకూడా కరవైంది కదా? దానికీ నా మీద మత్సరం హెచ్చింది. ఇక ఏ విధంగా నా నాథుని చూస్తాను? నేను బ్రదుకరాను? ఇది కలకాదు. ఇది స్వప్నజగత్తు కాదు. వాస్తవ జగత్తే. ఇది కలే అయి, కోతే కనబడితే అరిష్ట సమూహం ఆక్రమించుకుంటుంది కదా? అందుకు వ్యతిరేకంగా శుభ సందేశం ఎందుకు వస్తుంది? అంతా అయోమయంగా వుంది. ప్రసన్నంగా వున్న మనస్సు కల్లోలితమవుతూంది. లేక వాతం ప్రకోపించే లక్షణాలు శరీరంలో కలుగుతున్నవేమో? అవీ కాకపోతే ఉన్మాదమో? ఎండమావియో? ఏదీ నిశ్చయించుకోలేకపోతున్నాను. ఛీ ఛీ! నా ఊహ సరిఅయింది కాదు. నా దృష్టికి లోపం లేదు. వస్తున్న కపివరుడు అక్కడే ఆగి నా వంక జాలిగా చూస్తున్నాడు. నా జ్ఞాపకశక్తి యథాస్థితిలోనే వుంది. నేను భ్రాంతిపడలేదు. అనుమా

నించవలసిన అవసరం కూడా లేదు. వీడు కామరూపంతో వచ్చిన ఆ దుష్ట దానవుడే. ఇది ముమ్మాటికి నిశ్చయం" అని నిర్ణయించుకుని ప్రత్యుత్తరం ఇవ్వకుండా మౌనంగా వూరకుంది.

## హనుమ జానకి సందేహం తీరేట్లు సంభాషించుట

క్షణానికి పూర్వం సంతోషంగా, ఉత్సాహంగా వున్న రాముని పత్ని ఉదాసీనంగా పెడమొగమై వుండటం హనుమ గుర్తించాడు. "ఓహో! ఈమె నన్ను అన్యుడుగానో, రాక్షసుడుగానో భావించి వుంటుంది. అందుకే పరాఙ్ముఖురాలైంది. ఈమెను ఎలాగైనా తిరిగి ప్రసన్నురాలను చేసి, రామ సందేశం వినిపించాలి" అని తలంచి "జననీ! ఎందుకు సందేహిస్తున్నావు? రాజల్లోకల్లా మేటి. ప్రతాపంలో దినరాజు. సౌమ్యంలో యామినీ రాజు. రారాజు. అందంలో రతీరాజు. శౌర్యంలో మృగరాజు. మాకు రాజు. మధురోక్తులకు గురుడు. శాత్రవులకు భీకరుడు. ఆర్తులకు శ్రీకరుడు. విశ్వానికి శుభంకరుడు. శరణాగతులకు అభయంకరుడు. మా రామచంద్రుడు. ఆ సర్వజీవ శరణ్యుని మోసగించి ఎవరు నిన్ను గొనివచ్చి పరితాపంపాలు గావించాడో వాడు ఆ పాపఫలం అనుభవించే సమయం ఆసన్నమైందని నమ్మమ్మ. నా స్వామి, నీ విభుడు ద్వాదశాదిత్య మండలంలాగా ప్రకాశిస్తూ, మండలీకృతచాపుడై శరప్రవాహంలో ముంచి, దశవదనాలు త్రుంచి నీకు నేత్రోత్సవం చేయటానికే నన్ను దూతగా నీ కడకు పంపాడు. నీ వియోగంతో వేదన పొందుతూ నీ కుశలమడిగాడమ్మా నీ భర్త. సౌమిత్రి సజల నయనాలతో సాష్టాంగ పడి నీ క్షేమం అడిగాడు తల్లీ. నీ పతి మిత్రుడూ, వానర కులానికి ఏలికా అయిన సుగ్రీవుడు నీ శుభాన్ని కోరాడు జననీ. ఎప్పుడూ మిత్ర సోదర సహితుడై రామ ప్రభువు నీ స్మరణతోనే కాలం గడుపుతున్నాడు మాతా! మా అందర భాగ్య వశంచేత రాక్షసులకు చిక్కికూడా ఇందాక బ్రతికి ఉన్నావు. ఇక ఎంత మాత్రం ఆలస్యం జరుగదు. మరుక్షణంలో రామలక్ష్మణ రవిజులను చూడగలవు. రావణుడు పెట్టిన గడువు నీకు కాదు. తన చావుకని విశ్వసించు. నేను వానరుణ్ణి. నా పేరు హనుమంతుడు. సుగ్రీవునకు మంత్రిని. నూరు యోజనాల వారాశి లంఘించాను. లంకను గాలించాను.

నీ పగవానిపై ప్రమాదం వర్షించి, వచ్చి నిన్ను దర్శించాను. నీవు నన్ను ఎవ్వరని అనుమానించావో, ఆ దుష్ట రావణుణ్ణి కాను. నీవు శంకారహితవై, ఆప్యాయంగా భాషించు" అని సానునయ వాక్యాలతో శాంతింపచేశాడు. ఆ మాటలు మైథిలి అమృతం గ్రోలినట్లుగా ఆకర్ణించింది. పునస్సంభాషణకు పూనుకుంది.

## సీత హనుమను రామలక్ష్మణుల చిహ్నాలను అడుగుట

"హనుమా! నీ మాటలు శ్రద్ధగా విన్నాను. పోవనున్న ప్రాణం నిలిచింది. సంశయం చాలవరకు సమసిపోయింది. నేను నిన్ను కొన్ని ప్రశ్నలు అడుగుతాను. సమాధానం చెప్పి సాంతంగా మనశ్శల్యం పెకలించు. అన్నదమ్ములకున్న భేదం ఎట్టిది? సంస్థానం ఎటువంటిది? రామలక్ష్మణుల రూపాలెట్టివి? ఊరువులు, బాహువులు ఏ విధంగా వుంటై. వీటికి సరిగా సమాధానం చెపితే నిన్ను పూర్తిగా విశ్వసిస్తాను. మనసులోని మాటలు చెపుతాను" అని కోరింది. ఆమె అన్న వాక్యాలకు హనుమ అమందానందం పొందాడు. "అమ్మా నా అదృష్టం కొద్దీ అడగవలసినవే అడిగావు. అంతకన్న నాకు కావలసింది ఏముంది? నీవు కోరినవన్నీ వివరంగా వినిపిస్తాను. దాంతో నీ అనుమానం తొలగుతుంది. నా పడిన శ్రమకు ఫలం కూడా లభిస్తుంది. నేను స్వామికి చెప్పదగిన సందేశం చేకూరుతుంది. పంక్తి ముఖునికి అవసానకాలం చేరువవుతుంది. నీ పతియైన శ్రీరాముడు వికసిత పద్మ విశాలనేత్రుడు. సకల జీవకోటి మనోహర సద్గుణుడు. పుట్టుకతోనే రూప దాక్షిణ్యాలను పొందాడు. తేజంలో దినకరుని పోలుతాడు. ఓర్పులో ఉర్వికి తుల్యుడు. బుద్ధికి బృహస్పతి సాటి. కీర్తిలో హరి. సర్వ జీవ రక్షకుడు. ఆశ్రిత పోషకుడు. స్వకులాచార నిష్ఠుడు. ధర్మపథ వర్తి. చతుర్వర్ణ సమ దర్శనుడు. వేద ధర్మాలను మానవుడై ఆచరిస్తూ, జగద్ధితం కోసం మానవులను కూడా ఆ విధంగా చేయటానికి పురికొల్పే ఆదర్శ వర్తనుడు. కాంతిమంతుడు. పూజితుడు. బ్రహ్మచర్యవ్రత నియమం కలవాడు. సాధులకు తప్పని ప్రాపు. సద్విద్యలన్నీ సాంగోపాంగంగా తెలిసినవాడు. సముపాసిత విప్రుడు. రాజనీతిలో పారంగతుడు. శీలం కల

వాడు. సత్య పరాక్రముడు. సర్వజన ప్రియుడు. వేదవేదాంగాలనూ, యజుర్వేదాన్నీ, ధనుర్విద్యనూ కరదముట్టిన వాడు. ఆజానుబాహువు విపులమైన అంసలున్న వాడు. ముఖం రాకాబ్జసఖం. తామ్రలోచనుడు. గూఢజత్రుడు, దుందుభిస్వనుడు, స్నిగ్ధవర్ణుడు. సింహబలుడు. చామనఛాయ మేనివాడు. సమ విభక్తమైన అంగాలు కలవాడు. త్రితామ్రుడు. త్రిప్రలంబుడు. త్రిస్థిరుడు. మూడుచోట్ల ఔన్నత్యం. స్నిగ్ధత, గాంభీర్యం గల వాడు. వళీత్రయం, త్రినమం, అవనతత్రయం, శిరస్త్రయం కల వాడమ్మా.

ప్రక్క దంతాలు నాలుగు, నాలుగింటి నడక, రెండు నాలుగుల పంశం, అయిదు స్నిగ్ధం, పది పద్మాలు, పది గొప్పలు, ఆరు మిట్టలు, తొమ్మిదిసన్నంగా కలవాడు. మాట వ్యాప్తుడు. మాటని ఎల్లప్పుడు అనుష్ఠిస్తాడు. రెంటిలో తెలుపున్న వాడు. సర్వకాలం సత్యాన్ని అంటి పెట్టుకుని వుంటాడు. దానధర్మ విషయంలో సరిలేనివాడు. శ్రీమంతుడు. (ఈ సంకేతాలు సాముద్రిక లక్షణాలు. కొన్ని బాహ్యాలు. కొన్ని మరుగులు. కొన్ని అందరికీ తెలుస్తై. కొన్ని సీతకే తెలుస్తై. ఆమె నమ్మటం కోసం శాస్త్రజ్ఞానంతో బాహ్యాభ్యంతరాలు ఔచిత్యం కోసం సంకేతరూపంగా హనుమ చెప్పాడు. వివరణ ఔచిత్య భంగానికి కారణం అవుతుంది. కనుక ముడి విప్పలేదు. ఇది తెలియకున్నా ఇబ్బంది లేదు.) ఆయన పినతల్లి కొడుకు సౌమిత్రి అన్ని విధాలా అన్నవంటి వాడే. వర్ణంలో మాత్రం ఎర్రని ఎరుపు గలవాడు. యుద్ధంలో అజేయుడు. వారు నిన్ను వెదకుతూ మేంవున్న చోటికి వచ్చారు. అన్న తన్ని తరమటంతో భయపడి ఋశ్యమూకాద్రిపై మున్న మా సుగ్రీవుడు చూచి భయపడి కొండెక్కి నన్ను విచారించ పంపాడు. శరచాప ధరులను, చీరవసనులను చేరి నమస్కరించి భాషించాను. వారు నన్ను విశ్వసించారు. వెంటనే వారి మోచితెచ్చి ఉభయులకు స్నేహం కలిపాను. పరస్పర భాషణానంతరం వాలిని వధించి భార్యతో రాజ్యం మా రవిపుత్రునకు నీ భర్త చేకూర్చాడు. కృతజ్ఞుడైన కీశపతి నీ ఆభరణాలు చూపాడు. అవి కాంచి ఆయన అవువరై అరచి పొందిన అనుతాపం ఇంత అంత కాదు. నేను ఆయనను సాంత్వన వాక్యాలతో శమింపచేశాను.

## శ్రీరాముని విరహతాపం హనుమ సీతకు చెప్పుట

మేం చూపిన ఆభరణాలను ఎన్నోసారులు చూచాడు. ఎంతో భారంతో తిరిగి మా ప్రభువునకిచ్చాడు. తదాది పూర్వంకంటే అగ్ని గర్భంలోగల పర్వతంవలె లోలోపల పొగలు సెగలు చిమ్ముతూ శోకభగ్నహృదయుడై తపిస్తున్నాడు. నిద్ర సరిగాపోడు. ఆహారం తృప్తిగా భుజించడు. అగ్ని లతో మూసిన అగ్ని గృహంలాగా వున్నాడు. నీవు దూరం కావటంతో సుఖ భావం శూన్యమైంది. శాంతి నశించింది. తాపం హెచ్చింది. నీ వియోగం ఉద్ధృతం గావటంతో అగ్ని పర్వతం బ్రద్దలు కాగా కంపించే భూనగాల వలె నిరంతరం సంచలనం తనువుకు సంక్రమించింది. మనోహరంగా పూలతో నిండిన లతా వృక్షాల సౌభాగ్యానికి సంతోషించడు. తరంగిణుల పై నుంచి వచ్చే శీత వాతానికి హాయి చెందడు. ఎట్టి సంకటాల్లో సహితం హాసం చేకూర్చే సంఘటనలు, నవ్వుకు మారుగా శోకం పెంచు తున్నై. సముద్రం వలె గంభీరుడూ, మేరువువలె ఉన్నతుడూ అయిన రాముడు అర్ధాంగివైన నిన్ను బాసి విప్రలంభ భారంతో వేగుతున్నాడు. నీ పతి వానర పతికి వాలిని చంపి రాజ్యం, దారను ప్రసాదిస్తానని ప్రతిజ్ఞ చేసి ఆ మాట నిల్పుకున్నాడు. దానికి ప్రతిగా నీ వార్త తెప్పించి, నిన్ను ఆయనకు అప్పగిస్తానని కీశపుడు బాస చేసి మమ్ముల వెదకే నిమిత్తం పంపాడు. మాలో కొందరు తూర్పుకూ, పడమరకూ, ఉత్తరానికి వెళ్ళారు. వాలి పుత్రుడైన అంగదుడు అధినేతగా మేం దక్షిణానికి వచ్చాం. వచ్చిన మేం అన్వేషణచేస్తూ ఒక భూవివరంలో ప్రవేశించి, మళ్ళీ దారి తెలియక ఇచ్చిన గడువు వెచ్చ పెట్టాం. దైవానుగ్రహం వల్ల బయటపడి మళ్ళీవెదకసాగాం కాని, నీ దర్శనం కాలేదు. సమయాతిక్రమణం జరగటంతో ప్రభువుచే ప్రాణ హాని తప్పదని అంతా ప్రాయోపవేశానికి పాలుపడ్డాం. అప్పటికి అంతకంటే మార్గం గోచరించలేదు.

## హనుమ సీతకు ఆమె జాడ తెలిసిన విధం చెప్పుట

ఆ సమయంలో అంగదుడు బిగ్గరగా జరిగిన కథంతా ఉచ్చరిస్తూ, జటాయు మరణం, వాలి వధ, ఆత్మహత్యా యత్నం మాటిమాటికి ఎత్తి ఏడ్వసాగాడు. ఆ రోదనం సంపాతి అనే పక్షిరాజు విని “నా తమ్ముని

మరణానికి ఎవరు కారణం చెప్పండి" అంటూ గద్దించాడు. అందుకు అంగదుడు గత గాథ చెప్పాడు. అది విన్న ఆ వృద్ధ గృధ్రం ఆగ్రహంతో ప్రతీకారేచ్ఛ కలిగి రావణ నాశనానికి సంకల్పించి నీవు లంకలో వున్న సంగతి చెప్పాడు. ఆ వార్త విన్న అందరం వార్ధి తీరం వుత్తరానికి చేరాం. ఆకాశం, భూమీ కలిసినట్లుగా కనుపించే వరకు కూడ నీరు తప్ప నేల కనపడని కల్లోలిని చూచి కపులు భయపడ్డారు. ఉన్న చోటు తెలిసి కనకుండా పోవటం కపులకు ఇష్టం లేదు. అలాగే సముద్రం దాటే శక్తి లేదు. చివరకు నేనే సాహసించి నూరామడల కడలిదాటి, లంకజొచ్చి, రాత్రివేళ రావణాంతఃపురం, నగరం విడవకుండా పరిశోధించి నా పూర్వకృత పుణ్యంవల్ల నిన్ను చూడ గలిగాను. అమ్మా! ఉన్నదివున్నట్లు పలికాను. ఇకనైనా నన్ను నమ్ము. నేను వానరుడను. పేరు హనుమంతుడు. సుగ్రీవుని మంత్రిని. రామచంద్రుని దూతను. నీకై వచ్చాను. ప్రచండ ధనుర్ధారులు నీ భర్తా, మరదీ క్షేమంగా వున్నారు. నీ భర్త హితం కోసం వానరపతి దక్షిణంగా పంపినందుకు ఫలం దక్కింది. నీ పతివ్రతాత్వం, నా తపం కలిసి "సీతా మాతను వీరాంజనేయుడు ఒకడే దర్శించా"డన్న కీర్తి నాకు దక్కించినై. ధన్యోస్మి. ధన్యోస్మి. నా సముద్ర లంఘనం సార్థకమైంది. నిన్ను కానక హతాశులై నా కోసం వేచివున్న కపి కోటికి నీ కుశలం చెప్పి ఆనందం కలిగిస్తాను. ఇక పద్దంత కాలం బాధపడ వలసిన పని లేదు.

## సీతకు హనుమ తన జన్మ వృత్తాంతం చెప్పుట

తల్లీ! మంచి కాలం వచ్చింది. ఏది మాకు అసాధ్యమనుకున్నామో ఆ నీ క్షేమ వార్త తెలిసింది. మిగిలినదంతా మా చేతిలో వుంది. నేను పోగానే రామలక్ష్మణ రవి పుత్రులు సర్వ కపి సైన్యంతో లంకలో ప్రవేశిస్తారు. రావణుని సమూల బాంధవంగా సంహరిస్తారు. నేను కామరూపంతో వచ్చిన వాణ్ణి కాను. నీ విశ్వాసం కోసం నా జన్మ కథ చెపుతున్నాను. మాల్యవంత పర్వతం నా తండ్రి కేసరి నివాసం. ఆయన గోకర్ణ పర్వతానికి నా తల్లి అంజనాదేవితో పోయి, శంబసాదుడనే దైత్యుణ్ణి వధించి దేవతలకు ప్రీతి కలిగించాడు. ఆ సమయంలో అనిలుని

అనుగ్రహంతో ఆయన క్షేత్రంలో జన్మించాను. స్వకృత కర్మం వల్లా ఇంద్ర వజ్రాహతికి హనువు భగ్నం కాగా హనుమంతుడు అనే పేరు వచ్చింది. నా దుఃస్థితికి జన్మ కారకుడైన పవనుడు ఆగ్రహంతో తేజం ఉపసంహరించాడు. ప్రాణభయార్తులైన దేవతలంతా బ్రహ్మతో వచ్చి నాకు అనేక దివ్య వరాలిచ్చి చిరాయువుగా దీవించి నా తండ్రిని మెప్పించారు. ఒక్కసారే నన్ను చూస్తే భయభ్రాంత వవుతావని, నీకు క్రమంగా నమ్మకం కలగటానికి రాముడి గుణసంపద వినిపించాను. నీవు నమ్మి నమ్మక మనస్తాపం పొందుతుంటే సమీపించక దూరంగా నిలిచే భాషించాను. నీ ప్రశ్నలు చాలా విషమమైనవి. నీకు కాక కొన్ని ఇతరులకు తెలియవు. అవి అన్నీ శాస్త్ర జ్ఞానంతో, అంతర్దృష్టితో, చూచి చెప్పాను. నా జన్మ కథ చెప్పాను. ఇదంతా నీవు సంశయరహితంగా నన్ను విశ్వసించటానికే. నీ హృదయం విప్పి మాట్లాడటానికే. నీవు అణుమాత్రం శంకించవద్దు. రావణ వధ తథ్యం. రామ పునఃపాణిగ్రహణం యథార్థం ఇందుకు సర్వ దేవతలుసాక్షులు" అంటూ మారుతి ప్రసంగం ఆపాడు. అమృతోపమానాలై హనుమ నోట వెడలిన అక్షరాలు అవనిజకు ఆనందాన్ని అక్షయంచేసినై. వాలుకన్నుల నుండి సమ్మదాశ్రువులు జాలు వారినై. వికసించిన పుష్పం భ్రమరాన్ని ఆకర్షించినట్లు ప్రసన్నమైన మనసు పావనిపై విశ్వాసాన్ని ప్రకటించింది. వదనం వెలుగులు విరిసింది. ఆమె అపాస్త శంకయై హనుమను రఘునాథ దూతని నమ్మింది. అది కాంచి ఆంజనేయుడు తృప్తిపడి "అమ్మా! నాకు సెలవిస్తే పోయి వస్తాను. నీకేం ఇష్టమో తెలిపితే అది చేసి పోతాను. పవన పుత్రుణ్ణి కనుక ఆయన జవం నాకూ వుంది. నన్ను కపి మాత్రుడుగా భావించ వద్దు" అంటూ మనవి చేశాడు.

## సీతకు హనుమ శ్రీరామ ముద్రిక ఇచ్చుట

"తల్లీ! ఇప్పటికే నన్ను పూర్తిగా విశ్వసించావు. అంతరాంతరాల్లో ఏమైనా అనుమానం వుంటే దీంతో తీరిపోతుం"దని చెపుతూ "ఇదిగో రామ నామాంకితమైన ముద్రిక. దీనిని నీకు సందేహనివృత్తికీ, సందేశానికీ చిహ్నంగా మా రామ ప్రభువు ఈ కింకరుడిచే పంపాడు.

ఇది గ్రహించి సర్వాత్మనా సంశయ నివృత్తి పొంది నన్ను గ్రహించు" మంటూ తీసి ఆమె కందించాడు. సర్వజగద్రక్షా దక్షమైన శ్రీరాముని అంగుళీ స్పర్శతో పూతమైన ఆ ఉంగరాన్ని చూచి, కోల్పోయిన ధనం కూడి వచ్చినట్లు, పొంగుతున్న సంతోషంతో కన్నులకు అద్దుకుని, ప్రేమ భక్తి గౌరవాలతో భర్త స్వయంగా వచ్చి దర్శనం ఇచ్చినట్టుగా భావించి మైథిలి క్షణకాలం నిర్వచనీయమైన యోగ సిద్ధిని పొందింది. తామ్ర శుక్లవర్ణ భాసితమైన నయన ద్వయంతో రాకాసుధా కర సుఖంగా ఉన్న వదనం వెలిగి పోయింది. గుండెలోని బరువు చేతితో తీసినట్లు తేలిక పడింది. శక్తిని గోల్పోయి శుష్కించిన తనువల్లి నవ చైతన్యం పుంజుకొని వసంత సమయ లతవలె ఒప్పారింది. ఆమె అప్పటి అక్షరూప లావణ్యం హనుమకు పాల కడలిలో పద్మ హస్తయై ప్రభవిస్తున్న మహాలక్ష్మి లాగా గోచరించింది. ఆ యోగ సమాధి చెదిరిపోవటం ఇష్టం లేని సీత చివరకు కనులు తెరచి కృతజ్ఞతాభావం కుదురుకొనగా, పావని వంక మాతృ వాత్సల్యం వుట్టిపడేలాగా చూసింది.

## సీత హనుమను ప్రశంసించి శ్రీరామాదుల క్షేమం అడుగుట

ఆ చూపు హనుమపై అమృతాన్ని వర్షించింది. వివేక నిధియైన మారుతి నమ్రుడై నిల్చాడు. మైథిలి మాటల్లో మల్లెలు పరుస్తూ, చూపుల్లో వెన్నెల వాకలు విరియిస్తూ "పావనీ! జీవనదాతా! గర్భ జనితుడైన బిడ్డ వలె ఘనకార్యం చేశావు. శతయోజన విస్తీర్ణంగల జలరాశిని గోష్పాదంవలె తరించిన మహాజవ సంపన్నుడవు నీ వొక్కడవే. దేవతలు చొరరాక రాత్రించర సహస్ర రక్షితమైన లంకా నగరంలో నిర్భయంగా ప్రవేశింప గల్గిన ధీరుడవు నీ వొక్కడవే. కామరూపులైన రాక్షస స్త్రీల మధ్యలోనున్న నాతో, అపాయం లేకుండా, వాళ్ళకు తెలియకుండా భాషించి కార్యసిద్ధి గాంచిన కపికులాలంకారుడవు, మేధావివి నీ వొక్కడవే. నా పతికీ, నాకే తెలిసిన రహస్యాలు శాస్త్ర బలంతో పరులకు తెలియకుండా సంకేత రూపంగా సమర్థ భాషించిన మహా

మనీషివి నీ వాక్కుడవే. అందుకే నా భర్త నిన్ను దూతగా ఎన్నుకున్నాడు. పరీక్షకు నిలవని వానిని ఎప్పుడూ దూతగా ఎన్నుకోడు. అందులో నా నిమిత్తం పంపేవానిని అసమర్థునిగా ఎందుకు పంపుతాడు? ఆయనకు అన్ని విధాలా తగినవాడవు. నాకు ఎంతో నచ్చినవాడవు. నిన్ను సామాన్య కపిలాగా నేను భావించటంలేదు. నీ వాక్యాలు విన్నకొద్దీ వినాలని వుంది. నాభర్త కుశలం ఎంతవిన్నా, ఎన్నిసార్లు విన్నా తృప్తికలగటంలేదు. కౌసల్యాపుత్రుడు, సత్యస్వరూపుడు, శ్రీరామచంద్రుడు నాభాగ్యవశంచేత, నా మాంగళ్యబలంచేత కుశలంగా వున్నాడుకదా? తండ్రీ. సుమిత్రానందవర్ధనుడు, గుణోత్తరుడు, రామానుజుడు, లక్ష్మణుడు సుఖంగా వున్నాడుకదా బిడ్డా? వారు క్షేమంగా వుంటే, నాకోసం లోకాన్ని కల్పాగ్నివలె దహించలేరెందుకు? వారు శూరులే. అసురులనైనా యుద్ధంలో జయిస్తారు. నా పాపఫలం అడ్డంనిల్చి ఆ భావం రాకుండా చేసిందా? వత్సా! నా వియోగాగ్నిలో మరగకుండా ఆయన ఆరోగ్యంగా వున్నాడా? నన్నుగూర్చి పరితాపం పొందడుకదా? చేయవలసిన నిత్యకృత్యాలు సకాలంలో నెరవేరుస్తున్నాడా? దీనభావంతో అవసరకార్యాలను ఏమరుపాటున విస్మరించడుకదా? పురుషకారాన్ని పాటిస్తున్నాడా? మిత్రుశత్రుల ఎడ దాన భేదోపాయాలు సరిగానడుపుతున్నాడా? మిత్రులను, హితులనూ మిక్కిలిగా సంపాదిస్తున్నాడా? దేవతానుగ్రహాన్ని పొందేకర్మ విడువకుండా చేస్తున్నాడా? దైవపౌరుషాలు ఆయనలో సమంగా పనిచేస్తున్నవా? ఎంతో కాలం గడచిన నామీద కరుణవుందా? నన్ను శీలవతిగా భావించి రక్షించే యత్నం సంకల్పించాడా? అగర్వ శ్రీమంతుడై, అనుభవించే కాలంలో తండ్రి కోసం ధరణీపాలనం త్యాగంచేసి, అడవుల్లో అష్టకష్టాలు పడ్డాడు. ఇప్పుడు నాకై ఇంకెన్ని కష్టాలు పడుతున్నాడో తలచుకుంటే గుండె చెరువవుతూంది. అత్తలూ, మరదులూ కుశలంగా వున్నట్లు వార్తలు వస్తున్నవా? నాకోసం కోరితే భరతుడు అక్షౌహిణీసేన అంపగలడా? వానరానీకంతో వనచరపతి లంకానగరంలో ప్రవేశిస్తాడా? నా మరది సౌమిత్రి నాకొరకై నిశాటుల, దివ్యాస్త్ర ప్రయోగంతో విరిస్తాడా? రామ కార్ముక నిర్ముక్త దారుణ మారణాస్త్ర పాతిత దశవదనుడైన దశవదనుని

తన్నారా నేను చూస్తానా? ఏకపతియేనా నాపతి? స్వచ్ఛ సువర్ణవర్ణమూ, వికసిత రాజీవగంధిలం అయిన నా పతి ముఖపద్మం, నా విరహవేదనతో, వ్యసన దీనతతో నీరింకిన పంకజంలాగా కాంతిహీనం కాలేదు కదా? క్రూరురాలైన కైకయపుత్రి నిర్ణయంతో అడవికి పంపేవేళ ఏ వికారం లేకుండా పురంవీడి వచ్చిన స్థితప్రజ్ఞుడు, నన్నుతలంచుకుని దీనుడై ధైర్యంవిడనాడలేదుకదా? సత్యంచెప్పు తండ్రీ! ఏమని నీతోచెప్పుకునేది? ఆత్మజుని వంటివాడవు, ఆప్తుడవు కనుక చెపుతున్నాను. ఆయనకు తలిదండ్రుల కంటే, హితులకంటే, బంధువులకంటే నా మీద ప్రేమ హెచ్చు. అందుకే, ఆయన కోసం, కన్నుల్లో ప్రాణాలు పెట్టుకుని శుభ వార్త అందేవరకూ జీవించాను" అని మధురార్థ యుక్తం, మహార్థ సక్తం అయిన మాటలు పలికి, ప్రత్యుత్తరం వినే తలంపుతో మౌన మూర్తి అయింది అది గ్రహించి వాయుపుత్రుడు, మేరుమందర బల సంపన్నములై, కృతకంగా సంక్షిప్తములైన బాహువులు జోడించాడు.

## సీతకు హనుమ ధైర్య వచనాలు చెప్పుట

"అమ్మా! మైథిలీ! అంతా విన్నాను. నీ ఆంతర్యం గ్రహించాను. బహుకాలం భర్తృ వియోగంతో బాధపడుతూ, దానవ కాంతల దురాలాపాలతో విసిగిపోయిన నీవు ఈ విధంగా నన్ను అడగటం ఎంతైనా ఉచితంగా వుంది. ఈ విధంగా ఆ మహాపురుషుణ్ణి గూర్చి పలకటం నాకు సర్వవిఘ్న పరిహార కారణం. మాతా! ఇంతవరకు నీవెక్కడ వున్నది నిజంగా ఆయన ఎరుగడు. శచికోసం ఇంద్రుడు వచ్చినట్లు వచ్చి కొనిపోలేడు. నేను వెళ్ళి చెప్పిన తర్వాత నిమిషం కూడా వ్యర్థం చేయడు. తీవ్ర బాణాలతో వరుణాలయం స్తబ్ధంచేసి, లంకను హతదానవానీకం చేసి నిన్ను కొనిపోతాడు. మధ్యలో యముడైనా మృత్యువైనా, విబుధాసుర కోటియైనా అడ్డంవస్తే హతం చేస్తాడు. నా మాటలు నమ్ము. సింగంతో విరోధించబడ్డ మాతంగంవలె నీ వియోగ తాపంతో పూట పూటకూ కృశిస్తున్నాడు. మలయమేరు మందర వింధ్య దర్దురధరణీ ధరాలపై, ఓషధులపై, ఫలాలపై బాసచేసి చెపుతున్నాను. విస్ఫారిత కంజలోచనం, వినూత్న మణిస్థగిత హేమకుండలం, అరుణాధరం అయిన నీ నాథుని

మనోజ్ఞ ముఖమండలాన్ని కరువుతీరగా ఆలోకిస్తావు. మా రాముణ్ణి ప్రస్రవణ పర్వతధాముని, దౌర్బల భీరుని, దేవతలు సేవించే సుత్రాముని లాగా చూస్తావు. ఆయన మాంసం ముట్టడు. మధువు సేవించడు. (మాంసం అంటే పరిమళద్రవ్యాలతో తయారు చేసింది. మధువు అంటే కల్లుగాదు. తేనె) సాయంవేళ ప్రాణరక్షణకు లఘువుగా ఫలాలను తింటాడు. ఆయన శయనించే వేళ క్రిమికీటకాదులు, మశక మక్షికాలు శరీరాన్ని బాధించినా, నీయందు లీనమైన మనస్సు కలవాడు కావటంచేత దాన్ని గుర్తించడు. అమ్మా! నీపై విరాళితో ఆయన మతిచెడి నిన్నే ధ్యానిస్తాడు. పలవరిస్తాడు. వచ్చినట్లే భావిస్తాడు. పిలిచినట్లే పలుకుతాడు. సర్వం నీవే. ఫలం కాని, పూవు కాని, మరో మనోహర వస్తువు కాని చూస్తే, నీ పేరే వుచ్చరిస్తాడు. వెంటనే నీవు లేవని విచారం పొందుతాడు. ఏ మార్గంలో నిన్ను గ్రహించ వీలవుతుందో ఆ మార్గం త్రొక్కుతాడు. ఆలస్యం ఎంతమాత్రం లే"దన్నాడు.

## సీత హనుమకు రావణుడిచ్చిన గడువు తెలుపుట

రామచంద్రుడున్న స్థితి ఆనుపూర్విగా విన్న జానకి దుఃఖాన్ని దూరం చేస్తూ, శరత్కాలంలో ధూమ ఖండంతో కూడిన తోయజ విరోధి మండలంగల యామినివలె అయి, "అంజనాసుతా! 'రాముడు పరాధీన మానసుడూ, భూరివ్యథా పరాయణుడూ' అంటూ కలిపి చెప్పిన నీ పల్కులు అమృతంలో విషం కలిపి ఇచ్చినట్లుగా వున్నై. ఐశ్వర్యంతో వున్నా, దారుణ శోకంలో వున్నా, మానవుణ్ణి దైవం త్రాడుగట్టి ఈడుస్తుంది. జగత్తులో జీవికి స్వాతంత్ర్యం లేదుకదా? విధిని దాటే ప్రాణి విశ్వంలోనే లేదు. ఇంతవరకు జరగలేదు. ఇకముందు జరుగదు. ఎన్ని శుభ లక్షణాలున్నా, ఎంతవారమైనా, నేనూ, దాశరథులు ఎంతపాటు పడుతున్నామో చూచావుకదా? ఆ పూజ్యుడు ఎప్పుడు ఈ దుఃఖార్ణవంపారం చేరుతాడు? తుపాను తాకిడికి పరిభ్రమణం పొందే ఓడవలె నా కోసం నలిగిపోతున్నాడా? ఎప్పుడు రావణుని వధిస్తాడు? నన్నెప్పుడు కొనిపోతాడు? నీవుపోయి ఆయన్ను త్వరపెట్టు. నా బ్రదుకింక ఈ రెండు నెలలు మాత్రమే. అప్పుడే వత్సరంలో పది మాసాలు గడిచినై. ఆ దుష్టుని

సోదరుడు విభీషణుడు ఎంతో నొక్కి చెప్పాడు. నన్ను మళ్ళీ కొనిపోయి నా నాథుని చేర్చమని. లంకా నాశనం కాకుండా చూడుమని. వాడు వింటేగా? చావు సమీపించిన వాడికి సాధు వచనాలు సమ్మతమవుతవా? దురభిమానం కన్నులకు పొరలు కల్పిస్తుంది. భర్త ఆజ్ఞతో విభీషణుని భార్య అనల పేరుగల ఆత్మజాతను నీ కథ తెలుపుమని నా కడకు పంపింది. నా పతి తప్పక నన్ను పరిగ్రహిస్తాడు. మనస్సు శరత్కాల జీవనం నిర్మలంగా వుంది. మనో నైర్మల్యంగల చోట మంచి గుణాలు వర్ధిల్లుతై. నా పతి పౌరుషం, ఉత్సాహం, బలం, నానృశంస్యం, మహిమ, కృతజ్ఞతా భావాలు కలవాడు. జనస్థానంలో తమ్ముని సాయం కోరకుండా పదునాల్గువేల రక్కసులను పరిమార్చాడు. అట్టి బాహు బల శాలికి, ధనుర్విద్యా పండితునికి ఎదురెవ్వరు నిలుస్తారు? ఇంద్రుని శచివలె ఆయన సర్వ సౌభాగ్యం ఎరుగుదును. కష్టాలకు ఆయన కలత పడడు. బాణ కిరణాలతో రాక్షస కుల జలాన్ని రామ భాస్కరుడు శోషింప చేస్తాడు. సంశయంలే"దని పల్కుతూ కన్నీరు కార్చింది.

## హనుమ తన మూపుపై కొనిపోతానని సీతతో చెప్పుట

అవనిజ పొందుతున్న ఆతురత చూచి హనుమంతుడు "అమ్మా! ఇంకా ఎందుకు శోకిస్తావు? ఎప్పుడు నేను నిన్ను గుర్తించానో అప్పుడే రావణుని జీవిత చరిత్రలో చివర ముగింపు వాక్యాలు వ్రాసి, కాలుని కరకమలానికి చిత్రగుప్తుకు చేర్చాడు. ఆయన చదివి తన భటులకు అందించాడు. మేం యుద్ధసన్నద్ధులమై వచ్చేవరకు ఓప్పుకోలేకపోతే, ఇప్పుడే నిన్ను నీ పతిని చేరుస్తాను. నావీపుపైన అధివసించు. క్షణకాలంలో ప్రస్రవణ పర్వతపాదంలో వున్న రాముని చరణరాజీవాలచెంత నీవుంటావు. తల్లీ! నా శక్తికి ఈ లంక ఏపాటిది? లంకతో రావణునికూడా కొనిపోతాను. హవ్యాన్ని అగ్నిహోత్రుడు ఇంద్రుని చేర్చిన విధంగా రామునికి నిన్ను చేరుస్తాను. నేను చేరగానే సోదరమిత్ర సమేతుడైన నీపతి చేసే యుద్ధ ప్రయత్నం చెంతవుండి కనులారా కాంచగలవు. ఇంకా కాలహరణం ఎందుకు? నావీపుపై ఆసీనవుకమ్మ. సుధర్మంపై ఆసీనుడైన పాక

శాసనునివలె పర్వతపాదంలో మిత్రసోదర పరివారపరివృతుడై యున్న నీపతిని నీవు చూడగలవు. చంద్రరోహిణులవలె మీ ఆలుమగలు సంతోషంతో వుండంగా, చేతులుమోడ్చి నేను చూచి తృప్తిపొందటానికి సూర్యచంద్రులతో లీలాప్రసంగం చేస్తూ, హేలగా ఆకాశపథంలో అంబుధిని తరిస్తాను. నేను నిన్ను కొనిపోతుంటే నన్ననుసరించివచ్చే అసురుడు ఈ లంకలో ఒక్కడుకూడా లేడు అనుమానంమాని నా మూపుపై అధిరోహించు. ఏ విధంగా సముద్రం తరించివచ్చానో, ఏవిధంగా దుష్ట దానవుల కన్నుల్లో దుమ్ముచల్లి నీ క్షేమం తెలుసుకున్నానో ఆవిధంగానే అంతరిక్షంలో కొనిపోతాను" అని హనుమ మేఘ గంభీర ఘోషణం వంటి భాషణం చేశాడు. అవనీజాత హర్షం, విస్మయంపొందింది.

## హనుమ సీతకు శరీరం పెంచి చూపించుట

క్షణంలో తేరుకుంది. "హనుమా! నీ కోతిబుద్ధులు పోనిచ్చావు కావు. ఇంతదూరం ఈ అల్పదేహంతో నన్ను ఎలాకొనిపోగలవు? వినటానికి నీ పల్కులు విశిష్టంగావున్నా, కనటానికి వింతగా కనబడుతున్నై" అని అంటూ శంకించింది. ఆ మాటలకు మారుతి "ఇంతవరకు ఎరుగని పరాభవం ఇప్పుడు కొత్తగా కల్గిం"దని విచారించాడు. "ఈమె ఇంతకుపూర్వం నన్ను ఎరుగదు కనుక ఈ విధంగా అనుమానించింది. ఇప్పుడు నా నిజాకృతి చూపిస్తే నమ్ముతుంది" అని ఆలోచించి చెట్టుతోనుంచి క్రిందికి దూకాడు. మూరెడుకూడా లేనికోతి తనముందుకు దూకటం, క్రమంగా పెరగటం సీతచూచింది. ఆమెచూస్తుండగానే, అనంతంగా పెరుగుతున్న హనుమ, దీప్తానలప్రభతో, మేరుమందర సంకాశకాయంతో, తామ్రవక్త్రంతో, వజ్రసంకాశ దంష్ట్రానఖాలతో, అతి భీషణ భీకరంగా ఆమెకు కనుపించాడు. ఆయన పాదాలు కనపడుతున్నై. తక్కిన శరీరం సీతకు కనపడటంలేదు. ఇంతలో "అమ్మా! నా అసలు రూపంచూచావుకదా? ఈరూపంతోవస్తే కార్యం విఘ్నమవుతుంది. అల్ప వానరాకారం వహించి వచ్చాను. ఇప్పుడైనా నీకు విశ్వాసం కలిగిందా? సప్త సాగరవలయిత సమస్త ధరామండలం తలకిందులు చేసే నాకు,

లంకతో రావణుని కొనిపోవటం ఒకలెక్కా? నాపై అల్ప భావం వదలి నా కోరిక మన్నించు. వీపుపై సుఖంగా కూర్చో" అన్న మాటలు ఆమెకు వినిపించినై. ఆమె ఆనందాశ్చర్య జలధిలో తేలింది.

## హనుమతో సీత తాను రామికి కారణం చెప్పుట

"మారుతీ! చూచాను. నీ బల గర్వ సమున్నతీ, వాయువేగ మనోవేగాలూ, దీక్షాకృత వన దహనోదుతేజం కన్నారా చూచాను. నీవు కపి మాత్రుడవే కావు. సాక్షాత్ ఈశ్వరాంశభవుడుగా తోస్తున్నావు. చంచల బుద్ధి నీ పట్ల నాకే కలిగింది. ప్రాకృత వానరుడు సముద్రం తరించి, లంక చొచ్చి, ఏకాంతంలో నన్ను చూచి, రాముని సందేశం వినిపించి, ఆనవాలిచ్చి, అనుమానరహితంగా ఆత్మ స్వరూపం ప్రదర్శించగలడా? నీవు అన్న మాట ప్రకారం ఆత్మేశ్వరునితో నన్ను కూర్చగలవు. త్రికరణ శుద్ధిగా విశ్వసించాను. అయినా, ఇప్పుడు నేను రాను. ఆయన సంకల్పించిన కార్యం నెరవేరే మార్గం ఆలోచించాలె. అదిగాక, ఇప్పుడే భీతి చెందుతున్న నేను నీ వాయు వేగంతో పోతున్న రభసానికి కన్నులు తిరిగి సముద్రంలో పడవచ్చు. మహా వాయు పథం నుంచి పోతుంటే ఘూర్ణిల్లుతున్న అంభోరాశి చూస్తే తల తిరుగవచ్చు. అందులో పడగానే జలచరాలు నన్ను మ్రింగిపోవా? నా రక్షణకోసం యత్నించే నీపై కూడ సంకటం కలుగుతుంది. కామచరులైన రాత్రించరులు రావణ చోదితులై నిన్ను అడ్డగించవస్తారు. అప్పుడు వాళ్ళకూ నీకూ ప్రచండ సంగ్రామం జరుగుతుంది. వాళ్ళంతా అస్త్రాలూ, శస్త్రాలూ ధరించి పోరుతారు. నీ కవి లేవు. వాళ్లతో పోరటంఎలా? నన్ను కాపాడటంఎలా? ఆ దృశ్యం నేను చూచి భరించలేనుకదా? మైమరచి క్రింద పడిపోతుంటే మధ్యలోనే నన్ను పట్టుకుని మళ్ళీ రావణుని కప్పగించవచ్చు. నీవు పోరుపై మనస్సు నిల్పి వుంటావు. నేను జారిపడిన సంగతి నీకు తెలియదు. వాళ్ళ చేతికి చిక్కినా, వార్ధిలో పడినా, నీవు పడిన శ్రమంతా పాడవుతుంది. యుద్ధంలో జయాపజయాలు దైవాధీనం కనుక ముందు నిర్ణయించలేం. వాళ్ళకు చిక్కి ముక్క ముక్కలు గాకుండా, వార్ధి పడకుండా, విజయం నీకు దక్కినా, వాళ్ళ ఆర్పాటులకు గుండె లవిసి

ఆమాంతం చచ్చిపోతాను. అప్పుడు నీవేం చేయగలవు? ఇంత కీర్తి నీకే దక్కుతుంది. మరి నా భర్త యశస్సుకు కళంకం రాదా? విధి వక్రిస్తే రాక్షసులు నన్ను కొనిపోయి రహస్యంగా దాస్తే మీ పడిన కష్టమంతా నేలపాలే కదా? ఇప్పటి స్థితిపట్టిగానీ, మీ వ్యూహాన్ని పరిశీలిస్తేగానీ, ఈ కార్యం కూడదని నా మది చెపుతూంది. రామ లక్ష్మణ రవిజుల ప్రాణం నా ప్రాణంపై ఆధారపడి వున్నై. నేను ఇక్కడ క్షేమంగానే వుంటాను. నా క్షేమవార్త కొని చెచ్చెరగాపోయి వారికి తెల్పి వెంటనే రావలసిన రీతిగా రమ్మని రామప్రభువుతో నా మాటలుగా చెప్పు. నీవింక జాగుసేయవద్దు. నీ రాక ఆలస్యమైన కొద్దీ అక్కడ నిరాశతో వారంతా ప్రాణాలు వదులుతారు. నేనై కోరి బుద్ధి పూర్వకంగా నా భర్తను కాక పరులను స్పృశించను. రావణుడు నన్ను తాకలేదా అని ప్రశ్నిస్తావేమో! అప్పుడు నేను స్మృతిహీనను. దుర్బలను. ప్రాపులేదు. ఒంటిదాన్ని. అనాథను. ఆ స్థితిలో నేనేం చేయగలనో పావనీ! నీవే చెప్పు. నేనై నేను తాకలేదు కదా? ఆ విధంగా మైమరచి నన్ను మగనికి దూరంచేసి తెచ్చిన ఈ రావణుడు బంధువులతో ఇక్కడే చంపబడాలి. ఆపై నన్ను ఆత్మేశ్వరుడు నన్ను గ్రహించాలి. ఇది నా ఆశయం. ఇది నా ప్రతిజ్ఞ. ఆ విధంగా చేయటం ఆయనకు సముచితం. రామచంద్రుని పరాక్రమం మున్ముందు ప్రత్యక్షంగా చూచాను. శివ ధను ర్భంగం, పరశురామ పరాజయం, ఖరదూషణ త్రిశిరఖండనం. ఇంతే కాక పరోక్షంగా విన్నాను. ఆయనను సంగ్రామంలో దేవదానవ యక్ష రక్షోగణాలు ఎదిరించి నిల్వలేవు. అగ్నికి వాయువువలె అన్నకు దీటయిన వాడు లక్ష్మణుడు. చిత్ర ధనుర్ధారి. మహాత్ములకు సాధ్యంకాని సంయమం కలవాడు. అంతర్ముఖుడు. అఖండ తపశ్శాలి. నీ పతియైన సుగ్రీవు డెంతటివాడో, మీ వానరశక్తి ఎంతటిదో నీకు తెలిసినదే కదా? కనుక ఇది మంచి ఉపాయం. అపాయం లేదు. అనర్థంరాదు. అన్నింటికీ నీవున్నావు. జయం మనకు సిద్ధం. నే చెప్పిన విధంగా చేసి సీతారాముల చేరిక నీ చేతిమీదుగా చేసి పుణ్యంకట్టుకో" అని పలికింది.

## జానకి తెల్పిన కారణాలకు హనుమ ప్రశంసించుట

ఆమె పలికిన పల్కులకు వాక్య విశారదుడూ, రాజనీతి చతురుడూ స్వామి కార్యధురంధరుడూ అయిన హనుమ ఆనందించాడు. ఆ సంతోషంలో "గుణవతీ! నీ పల్కులు మిగుల యుక్తాలైనవి. నీ వంటి పరమసాధ్వికి, స్త్రీ స్వభావానికి, శీలానికి తగినట్లుగా వున్నై. ఆడు దానవు కనుక నా వీపుపై సముద్రం దాటటానికి జంకావు. దీనితో నీ పిరికితనం వెల్లడైంది. రెండవమాట పరుల తాకనన్నావు. అది నీకే తగింది. అన్యకాంతలకు సాధ్యం కాదు. నీ కుశల వార్త, నీ చెద్యుం, నా ఎదుట నీవు పలికిన పలుకులు రఘువీరుడు నా ముఖంగా వినగాక. నీ బాధ చూడలేక, రాముని యందుగల భక్తి ప్రేరేచగా నిను కొని పోతానన్నాను. అందులకమ్మా క్షమించు. సముద్ర తరణం, లంకా ప్రవేశం, స్వశక్తి తెలియుటం అందరికీ సాధ్యం కాదు. కాబట్టి ఆ విధంగా నీ నమ్మకం కోసం అనవలసి వచ్చింది. కాని, ఆత్మోత్కర్ష కోసం కాదు. నేను ఏంచెప్పినా, ఏంచేసినా మిమ్మల అనుసంధానం చేయటానికే. నీవు నా వెంట రావటానికి ఇష్టపడకపోతే, నేను నిన్ను చూచినట్లు మా రామ భద్రునకు ఏదైనా అభిజ్ఞానం ఇవ్వు. దాన్ని చూచి నీవు పొందిన ఆనందమే ఆయన కూడ పొందుతాడు" అని పావని జానకితో అన్నాడు.

## సీత హనుమకు కాకాసుర వృత్తాంతాన్ని చెప్పుట

హనుమంతుడన్న మాటలకు సీత ఒక్కరి సంతోషించింది. కాని ఏవో గురుతు రాగా కన్నుల నీరు పెట్టుకుంటూ, "హనుమా! నీవు కోరింది సబబుగానే వుంది అతి రహస్యమైన గాథ వినిపిస్తాను. ఏనాడో జరిగింది. మా లోనే మరుగు పడింది. అది తలచుకుంటే ఆత్మేశ్వరుని అనురాగం ఎట్టిదో స్మరణకు వచ్చి శోకం పొంగుతూంది. మేం దండకలో చిత్ర కూటంలో ఉత్తర దిక్కుగా మందాకినీ నదీ తీరంలో తాపసాశ్రమాలను చూస్తూ, విహరిస్తూ వున్నాం. పుష్ప సుగంధం కోలాహలంగా వీస్తూ మలయ మారుతం పంచుతూంది. ఆ సమయంలో నేను బడలిక తీర నాథుని అంకపాళిపై పడుకున్నాను. వాయసం మాంస భ్రమతో నన్ను ముక్కుతో చురుక్కున పొడిచింది. మట్టిపెడ్డతో కొట్టినా

పోక అక్కడక్కడే చుట్టి తిరుగ సాగింది. నాకు కోపం వచ్చి మొలనున్న ఒడ్డాణం వూడ తీశాను. అప్పుడు అంశుకం చెరుగు కొంచెం జారింది. అది చూచి నా పతి ఇంచుక నవ్వాడు. వెంటనే సిగ్గుపడి తల వాల్చాను. ఆయాస పడ్డాను. నన్ను కాకి చీరుటచే కినుకా, పతి పరిహాసం చేయుటచే సిగ్గూ పొంది సమీపించి తొడపై కూర్చున్నాను. నా కన్నుల్లో నుంచి బుడబుడ జలం పడుతుంటే పైట చెరగుతో తుడుచుకుంటుంటే, ఆయన నన్ను ఊరడించాడు. నిద్ర ముంచుకురాగా మళ్ళీ భర్త ఊరువుపై పవళించాను. శ్రమ తీరగానే మేలుకున్నాను. తర్వాత ధవుడు నా అంకంపై నిద్రించాడు. పూర్వం తోలినప్పటికీ పోని ఆ పలుగాకి కాకి రివ్వున వచ్చి నా ఉరోజాన్ని చీరింది. అది అంతతో పోక మాటి మాటికీ ముక్కుతో పొడపటం మొదలు పెట్టింది. అంతకంతకు నాకు బాధ అధికమైంది. వ్రణంనుంచి నిద్రించే నాథునిపై రక్తం ఒలికింది. ఓర్చుకోలేక ఆయన్ను లేపాను. లేచి నా పాటు చూచి "ఎవ్వడీ పని చేశాడు. వాడికి ప్రపంచంలో బత్తెం లేకుండా చేస్తా"నని కోపంతో అన్నాడు. భర్తను నేను లేపుతుంటే ఆ పాడు కాకి లేచిపోయి దూరంగా వాలింది. "రోషంతో బుసలుకొట్టే పంచ ఫణ ఫణితో ఆడుకోనెంచిన అవివేకి ఎవ్వడు?" అంటూ నా కెదురుగా రక్తసిక్త నఖ చంచువులతో వున్న కాకిని చూచాడు. వెంటనే ఇంద్రుని పుత్రుడైన జయంతుడు వాయస రూపంతో పారిపోసాగాడు. అది చూచి నా మనో విభుడు క్రోధతామ్రాక్షుడై, అదయుడై, దర్భాసనం దర్భముక్క విరిచి, బ్రహ్మమంత్రం పఠించి ప్రజ్వరిల్లజేసి ఆ అరిష్టంపై ప్రయోగించాడు. ఆ బలిభుక్కు అందకుండా అంబరపథంలో పారిపోతూంది. అది ఎంతదూరం వెళ్ళినా బ్రహ్మాస్త్రం విడవకుండా వెంటనంటింది. ఆకాకి మూడులోకాలు తిరిగింది. త్రిమూర్తుల శరణు వేడింది. తండ్రిగాని, దేవతలుగాని, మహర్షులుగాని రక్షించలేమన్నారు. మరలివచ్చి నాభర్త చరణాలపైబడి శరణుగోరింది. అది శిక్షకు పాత్రమైనా అభయం ఇచ్చి "ప్రాణంకాక ఏదైనా నా అస్త్రానికి లక్ష్యం చేయుమన్నాడు. ఆ వాయసం కుడికన్నిచ్చింది. ఆవాయస నేత్రం హరించి అస్త్రం ఉపసంహృతం అయింది. కాకికి చావుతప్పి కన్ను లొట్ట

పోయింది. అల్పజీవిపై అంత పౌరుషం ప్రదర్శించిన అనురాగమూర్తి అసురునిపట్ల, అందులో అర్ధాంగిని అపహరించిన వానిపట్ల ఉపేక్ష చేస్తారా? ఈ వాక్యాలు నేను నీకు చెప్పినట్లుకాక, నేనే నాపతితో గుర్తు చేసిన రీతిలో తెలుపు. అన్నదమ్ములు అప్రతిద్వంద్వులు. నాకోసం ఒక్క బాణం అభిమంత్రించివేస్తే లోకం భస్మం కాదా?" అంటూ సీత పల్కింది. "అమ్మా! ఇక అన్నీ చక్కబడతై. నీపై ప్రమాణంచేసి చెపుతున్నాను. సత్యపరాక్రములైన దాశరథులు నిర్దిష్టలక్ష్యం లేక అస్త్ర ప్రయోగంచేసి అమాయక లోకాన్ని అంతంచేస్తారా? నీపతి నీమీది బెంగతో కార్యవిముఖుడైనాడు. అన్న అవస్థకు లక్ష్మణుడు శోకమగ్నుడైనాడు. నాకోసం అంతా ఎదురుచూస్తుంటారు. అన్ని పనులు నీవు కోరిన విధంగా జరుగుతై.

## సీత హనుమతో శ్రీరామాదులకు సందేశం పంపుట

అమ్మా! నేనిక పోతాను. నీవు చెప్పవలసిన మాటలుంటే చెప్పు. రామునకు, లక్ష్మణునకు, వానరస్వామికి, కపులకు నేను ఏమని నీ సందేశం వినిపించాలో ఆవిధంగా చెప్పు. తొందరగా చెప్పు. ఈ నక్తంచరస్త్రీలు మళ్ళీగోలచేసారు. ఈ సమయం వ్యర్థం కారాదు" అని హనుమ తొందరించగా, జాలితో, ధైర్యంతో ధరణీజాత మారుతితో సందేశ వాక్యాలు చెప్పసాగింది. "రామకార్య ధురంధరా! రవిపుత్ర మహామంత్రీ! అంజనాగర్భశుక్తిముక్తామణీ! హనుమా! విను. లోకంలో తలిదండ్రులు వాళ్ళను భరించే నిమిత్తం పుత్రులనుకంటారు. మా అత్త వాళ్ళనేకాక లోకాన్ని భరించే పుత్రుడుగా రామభద్రుని కన్నది. కనుక నేను లోకంలో దానినే యనీ, నీ అర్ధాంగినికూడా అని చెప్పి పాదాభివందనంతో కుశలం అడిగానని చెప్పు. నా ముద్దులమరది, నన్ను తల్లిగా, అన్నను తండ్రిగా భావించి అయోధ్య విడిచి అడవులపాలైన మెత్తని మనస్సు కలవాడు, మా ఇద్దరి భారం ఆనందంతో భరించే క్షమాసంపన్నుడు, అన్ని చింతలు తన సేవలో అంతర్హిత మయ్యేట్లు అర్పించే నిర్మల హృదయుడు, అన్నగాక అన్యం భావించని ఇంద్రియ విజేత, మా మామకు మనసున కెక్కిన మంచి

నడవడి కలవాడు, సర్వ ప్రకృతిలో లీనమై నన్ను కాపాడేవాడు, లక్ష్మణుడు. ఆతనిని అంతస్సాక్షిగా అభినందించి క్షేమం అడిగిందని చెప్పు. తక్కిన వారికి నీవు నా హృదయం తెలిసినవాడవు కనుక తగిన విధంగా చెప్పు. నేను ఎంత చెప్పినా నన్ను రావణుని సంహరించి రక్షించుమనేగా. నిజంగా నీకు చెప్పవలసింది లేదు. ఏ విధంగా చెబితే తలచిన కార్యం నిర్విఘ్నంగా నెరవేరుతుందో ఆ విధంగా అందరికీ చెప్పు. ఇది నా కడసారి మాటగా నా నాథునితో చెప్పు. "అపహర్త ఇచ్చిన గడువు రెండు నెలలు. అందులో ఒక నెల మాత్రమే ఆశతో బ్రతుకుతాను. ఆపై నన్ను గూర్చిన ప్రయత్నం వ్యర్థం" అని. పూర్వం అఘో భర్తను చేరిన కౌశికిని హరికి చేర్చిన రీతిగా నన్ను తన్ను చేర్చుకొమ్మను.

## సీత హనుమకు చూడామణి ఇచ్చుట

ఇదిగో హనుమా! చూడు. ఇది నా చూడామణి. అన్ని భూషణాలు పరిత్యజించినా, దీనిపై మక్కువకొద్దీ రావణుడు, రాక్షస స్త్రీలు చూడకుండా చీరె కొంగున దాచుకున్నాను. ఇది మహార్ఘమైంది. దీన్ని నా భర్తకు ఉంగరం కాకుండా హృదయంగా అర్పించు" అంటూ దాచిన అంగుళీయాన్ని వెలికి తీసి హనుమ హస్తంలో వుంచింది. ఆ అపూర్వ మణి ఖచితాభిజ్ఞానాన్ని ఆనందంతో ఆంజనేయుడు తన హస్తాంగుళికి పెట్టుకున్నాడు. అల్ప శరీరుడు కావటంచేత సరిగా సరిపోయింది. దాన్ని ధరించి ధరిత్రీ పుత్రికి వలగొని మ్రొక్కాడు. ఆ సమయంలో హనుమ దేహం అవనిజ వద్దనూ, ఆత్మ రామ పాద రాజీవాల చెంగటనూ వుంది. ఎన్నడూ, ఎవరికీ ఊహకైనా అందని ఆ పరమాద్భుత దృశ్యం చూసి దేవతలు పరవశించారు. తమకు ముక్తి త్వరలో కలుగుతుందని సంతసించారు. ఆ రీతిగా మైథిలి తన ఆత్మ సదృశంగా భావించి ఇచ్చిన అనర్ఘ చూడామణిని కైకొని వాయువుచే కించిత్తు కదలి మళ్ళీ స్థిరంగా నిల్చిన పర్వతం వలె సంతోషంతో సంచలించి సిద్ధుడైనాడు.

## సీత తన్ను గూర్చి రామునికి తెలుప హనుమంతుని వేడుట

ప్రయోజనం సాధించి ప్రయాణోన్ముఖుడైన సామీరిని జానకి చూచి "పవనజా! నేనిచ్చిన చూడా రత్నం చూడగానే ఆయన నన్నూ, తల్లినీ, తండ్రినీ స్మరిస్తాడు. అందులో సంశయం ఆవంతైనా లేదు. అన్ని విధులు నీపైనే వున్నై. మర్మం తెలిసి, మంత్రాంగం నడిపి, ఏ మార్గం యుక్తమో ఆ మార్గం చెప్పే యోగ్యత నీకు మాత్రమే వుంది. ఈ కార్యానికి నీవే గతి. ఫలసిద్ధి కల్గించగల బుద్ధి బలం నీకే కాని మరెవ్వరికి లేదు ఇంత దుర్ఘట కార్యం ఇంకొకరు చేయలేరు. చేసినా ఇంత నిగూఢంగా నిర్విఘ్నంగా చేయలేరు. ఇది చూడగానే నా పతి ఇంకా శోకాకుల మనస్కుడవుతాడు. కర్తవ్యం నీవే బోధించాలి. నన్ని దుఃఖజలధి నుండి నా పతి ఏ విధంగా ఉద్ధరిస్తాడో ఆ విధంగా ఆయన్ను ప్రేరేపు. నా మేను పాయకుండా సకాలంలో కార్యం సిద్ధించే పద్ధతి వచించి వాచా పుణ్యంకట్టుకో. నీవు పల్కిన పల్కులు ఉత్సాహం కలిగిస్తే తక్కినవని ఆయన శరచాపాలు సాధించగలవు. నా సందేశం, అనవాలూ, నీ ప్రబోధం ముప్పిరిగొని రావణుని సబాంధవంగా రాముడు చంపునట్లు చేయాలి. ఆయన చిరకీర్తికి ఇది పెద్ద పరీక్ష సమయం. దైవ పౌరుషాలను ప్రకటించటానికి ఇంతకంటె తగిన సమయం ఇక ఎన్నటికీ రాదు" అని చెప్పింది. "ఆలస్యం నేను వారిని కలుసుకోవటమే. సముద్ర తరణం, రావణ హరణం ఆలస్యం కాదు. అన్నీ నీ వాంఛించినట్లే ముగుస్తవి. సకల విశ్వాన్ని శాసించే రామచంద్రుడు విజయం సాధిస్తాడు. అందుకు నీవే కారణం అవుతావు. సీతారాముల కీర్తి చిరస్థాయిగా నిలుస్తుంది. ఇంక నాకు ఆదరంతో అనుజ్ఞ ఇస్తే వెళ్ళి వస్తా"నని హనుమ అర్థించాడు.

## సీత హనుమకు తన సంశయం చెప్పుట

ఉత్సాహంతో మహాకపి పల్కిన వాక్యాలకు సీత అభినందించింది. "నీ సంకల్పం నెరవేరుతుంది. నీవు కూర్చి పల్కిన రెండు నామాలతో కూడి నీ యశస్సు చిరకాలం నిలుస్తుంది. మా గాథ అంకురమైతే నీ

సాహస త్యాగాలు సగాల వృష్టికాగా, నీవు మాలిపై మహావృక్షాన్ని చేశావు. మహాకపీ! నిన్ను కూర్చిగాని, నీ భవిష్యత్సంకల్పంలో కాని, నా నీవారి పరాక్రమాతిశయాల్లో కాని అనుమానంలేదు. కాని, ఒక క్రొత్త అనుమానం కలిగింది. అది తరువాత చెపుతాను. ముందు నిన్ను నేనొకటి కోరుతున్నాను. నీ పలుకులపైనా, నా పైనా నీకు గౌరవం వుంటే ఈ పూటకిక్కడ ఆగి, రేపు పో. నీవు పడిన శ్రమ కొంత తీరుతుంది. నీవున్నట్లయితే నా దుఃఖం కొంత శమింపుతుంది. ఈ అల్పభాగ్యాన్నైనా నాకు కలిగిస్తావా? లేక పోవటం యుక్తమను కుంటే పోయిరా. నీవు వచ్చేవరకు ఏదో విధంగా ప్రాణాలు నిలుపు కుంటాను. ఎంత సరిపెట్టుకున్నా, నీ మీదా వానరపుంగవుల మీదా సందేహం పోవటంలేదు. ఆ విధంగానే దాశరథుల మీద కూడ సంశయం కలుగుతూంది. ఎంతవారైనా ఈ అపార పారావారం ఎలా దాటుతారు? నీవూ, నీ తండ్రి పవనుడూ, హరివాహనం గరుడుడూ, మాత్రం అనా యాసంగా దాటగలరు. చరాచర భూతకోటికి ఇది సాధ్యం కాదు. ఆలో చించిన కొద్దీ ఇది అసాధ్యంగా తోస్తూంది. ఏదైనా చేస్తే నీ వొక్కడవే చేయగలవు. ఈ కీర్తి నీకే దక్కుతుంది. సమరంలో క్షణాచరపతిని చంపి నా భర్త నన్ను కొనిపోతే నాకు కీర్తి. నా భర్తకూ కీర్తి. అది మాకు దక్కే ఆలోచన నీ వల్ల వినకోరుతున్నా" అని అనగానే వక్తవ్య శేషం హనుమ చెప్ప సాగించాడు.

## హనుమ సీత సంశయం తీర్చుట

"అమ్మా! నీ అనుమానం గుర్తించాను. నీవు నీ భర్తనూ, మరదినే ఎరుగుదువు కాని, తక్కిన వారిని ఎరుగవు. ఈ మహా సంగ్రామ నౌకకు కర్ణధారి కిష్కింధాపతి రవి పుత్రుడు. ఆయనకు దాసటగా అసంఖ్యాకంగా ప్లవగ శ్రేష్ఠులు పాలు కొంటారు. వారంతా అసమాన విక్రములు. భూగగనచరులు. కామరూపులు. సంకల్ప సిద్ధులు. రాజాజ్ఞ కాగానే ఈ లవణార్ణవం పిల్ల కాల్వవలె ఒక్క గంతులో ఆకాశమార్గాన అవతరిస్తారు. నా సరివారు, నాకంటే గొప్పవారుకాక, నాకంటే తక్కువ వారు అక్కడ లేరు. నేనే నిన్ను చూడగలిగితే వారి సంగతి ఇంకా

వేరే చెప్పటం ఎందుకు? మొదట పంపేవాళ్ళను పెద్దలను పంపటం రాజనీతి కాదు. కనుక సంశయంతోపాటు శోకం మాను. దుఃఖించే కాలం తొలగిపోయింది. మా వానరులంతా గగనంలో వస్తారు. దాశరథులు నా భుజాలపై నెక్కి శశి భాస్కరులవలె నీ ముందు నిలుస్తారు. లంకను నేలమట్టం చేసి, రావణుని పుత్రమిత్ర పరివారంతో తుదముట్టించి, నీ కోరిన ప్రకారం నిన్ను కొనిపోతారు. కాలగతిని పరికించు. నిన్నవమానించిన నీచుడు పదేపాటు చూడు. రావణ మరణానంతరం రోహిణీ చంద్రుల రీతి మీ దంపతులు అయోధ్యలో ప్రవేశిస్తారు. నా మాట నమ్మమ్మా"మని అన్నాడు.

## సీత శ్రీరామునుద్దేశించి హనుమతో చెప్పుట

"తండ్రీ! నా మనశ్శల్యం పెకలించి ఊరట కల్పించావు. నీ ఋణం జన్మలో తీర్చుకోలేను. వాడిన సస్యానికి వర్షోదకంలాగా నీ మధుర భాషణాలు మనస్సును తేలికపరచినై. పతికోసం చిక్కి శల్యావశిష్టమైన నా తనువు తిరిగి ఆయన్ను స్పృశించే అవకాశం కల్పించు. కాకిపై కటాక్షించి ఏకాక్షిచేసిన వార్తయు, అరణ్యంలో స్వేదబిందువులతో తిలకం కరిగి చెక్కిలపై జారగా తుడిచి, మణిసిలతో మరల దిద్దిన ఉపకారం మరవవద్దని చెప్పు. శివధనుర్భంగ యశస్సంపాదివి. అట్టివాని వలె ఊరకుండటం భావ్యం కాదని పలుకు. నీవు పంపిన ఉంగరం నిన్ను చూసినట్లుగా తలచుకొని ప్రాణప్రదంగా భద్రపరచుకుంటానని పల్కు. నీవు వచ్చేవరకు నా దుఃఖోపశమనానికి అదే దిక్కని అను. ఇక ఒక నెల మాత్రం నీకై బ్రదుకుతాను. ఆపై ఆత్మహత్యకు దిగుతాను. నేనొక వేళ బ్రతికినా ఆ దుష్టుడు బ్రదుకనీయడు. ఇంతచెప్పినా నీవు నా పట్ల ఉదాసీనుడవైతే నా దురదృష్టాన్ని నిందించుకుంటూ ఈ జీవితాన్ని చాలిస్తానని వక్కాణించు. నాయనా! నా భారం, కార్య భారం నీ మీద ఉంది. నీ వెంతచెప్పినా నిన్ను మించిన వారు నీ వారిలో లేరంటూ నా మనస్సు చెపుతూంది. నీవు విద్యావంతుడవు, వీర్యవంతుడవు. అన్నిటిని మించిన వినయవంతుడవు. నా సర్వాశలు నీపై వున్నవి."

## హనుమ మరలిపోవుటకు సీతను అనుజ్ఞ కోరుట

అని సకరుణంగా జానకి చెప్పగానే, హనుమ "అమ్మా! నీ పాదాలపై ప్రమాణంచేసి పలుకుతున్నాను. నీవు నాకు తల్లివి. నీ భర్త తండ్రి. మాతా పితరుల సేవచేయటం కన్నబిడ్డ కర్తవ్యం. అంతగా నన్ను శ్లాఘించవలసిన అవసరంలేదు. నా ధర్మం నేను నిర్వర్తిస్తాను. నీతో చెప్పిన మాటలు సత్యమని ఋజువుచేస్తాను. రామచంద్రుడే రావణుని సంహరిస్తాడు. లోకం మెచ్చగా నిన్ను పరిగ్రహిస్తాడు. మీ పరిచర్యలో మేమంతా తరిస్తాం. నేను పోవటం ఎంతకాలమో యుద్ధ సన్నద్ధులమై రావటం అంతకాలమే అని నమ్ము. నీకు కావలసినవి నీవూ నాకు కావలసినవి నేనూ తెలుసుకున్నాం. నీ పతికి ఏదైనా చిహ్నం ప్రసాదించు. అవతల కార్యం నేను చూచుకుంటాను" అని ఆమెను అడిగాడు.

## సీత హనుమ పోకకు సమ్మతి తెలుపుట

ఆ పలుకులకు ముదమంది "తండ్రీ నేనిచ్చిన చూడామణి చాలు. అది చూచి నీపై విశ్వాసంతో నీ వాక్యాలు విని ఆ విధంగా ఆచరిస్తాడు. శుభంగా పోయి లాభంగా రా. దేవతలు నీకు ప్రసన్నులవుదురు గాక" అని ఆశీర్వాదంతో జానకి సెలవిచ్చింది. ఆమె సెలవొసంగగానే పాదాలకు నమస్కరించి లేచి ప్రయాణ భావంతో శరీరంపెంచుతూ చూడామణి నడికట్టులో దాచాడు. అంతకంతకు విజృంభిస్తున్న హనుమ కాయం కోటి సూర్యప్రభలతో మింటినీ, మంటినీ, దిశలనూ వెలిగించ సాగింది. జానకి అప్పుడే తన భర్తవచ్చినట్లు రావణుని వ్రచ్చినట్లు, తన శీలాన్ని మెచ్చి కౌగిట గ్రుచ్చినట్లు తలంచుతూ ఆ మూర్తిని తిలకించసాగింది.

## హనుమ కార్యశేషం ఆలోచించుట

ఆనందంతో, ఆత్మ తృప్తితో అవనీజాత ఆంజనేయునికి అనుమతి ఇచ్చింది. ఆమె ఆశీస్సులను అందుకున్న హనుమ ఉదగ్దిశాగమన తత్పర మానసుడై, "వచ్చిన కార్యం ఆశించిన ఫలితంకంటే అధికం ఇచ్చింది. వక్తవ్యం పూర్తి అయింది. కర్తవ్యం మిగిలింది. ఈ శుభ సందేశం కొని వానరులకలిసి, కిష్కింధానగరం పోవటం సామాన్యదూత

లక్షణం. కేవలం నేను వచ్చింది సీతమ్మ జాడ తెలుసుకొనటానికే అయినా, అనంతర కార్యభారం అంతా నామీదేవుంచింది. కనుక పూర్వాపరాలు ఆలోచించవలసిన అవసరం ఏర్పడింది. ఆమె కోరిక నెరవేరాలంటే రావణవధ జరగాలి. దానికి యుద్ధం తప్పదు. సమరానికి ముందు శత్రువుల గుట్టుమట్టులు తెలియటం ముఖ్యం. అందులో ఒక భాగం నా అన్వేషణలో ముగిసింది. ఎవరెంత బలవంతులో, మూలబలం ఎంతో, యుద్ధంచేసే సైన్యం ఎంతో, సేనాపతులెందరో మొదలైన విషయం తెలుసుకోవాలె. మంత్రుల రాజనీతి, ప్రభువు బుద్ధివిశేషం కూడా ముందుగా తెలిస్తే, శత్రుపరాజయం సులభసాధ్యమవుతుంది. వీళ్ళు రాక్షసులు కావటంచేత సామం పనిచేయదు. స్వర్గం కూడా సిగ్గుపడతగినంత భోగభాగ్యాలూ, ఐశ్వర్యం వుంది కనుక దానానికి లొంగుబాటు కారు. మానవులంటే లక్ష్యంలేదు కనుక, మానవ కల్పిత భేదం కూడ పనిచేయదు. మిగిలింది ఒక దండం. ఇప్పుడు వీరి పట్ల అదే ప్రయోగించాలి. ఎన్ని ముఖాల చూచినా ఇదే ఉత్తమంగా కనుపిస్తూంది. వీళ్ళ శక్తి సామర్థ్యాలు తెలుసుకోటానికి దండం కంటే తగింది మరొకటి లేదు. ఏదో కారణం కల్పించి తగవును పెంచితే, దానితో తీగ లాగితే డొంక కదిలినట్టు లంకంతా కదులుతుంది. అయితే జానకిని చూచి రమ్మని రాముడు చెప్పాడు కాని, రాక్షసులతో గిల్లికజ్జం పెట్టుకొమ్మని చెప్పలేదనుకుంటే, నేను దూత ధర్మాన్ని అతిక్రమించి చేయకూడని పని చేస్తే తప్పు. ధర్మం దాటకుండా అధికంగా కార్యం సాధిస్తే అంతా సంతోషం పొందుతారు కాని, ఆక్షేపించరు. చేసే పని చిన్నదైనా పెద్దదైనా, ఉభయతారకంగా చేస్తే దూతను శ్లాఘిస్తారు. శత్రు దుర్గంలో ప్రవేశం కలిగింది. నిగూఢంగా, లంకా నగరంలో ఎక్కడ ఏంవున్నాయో ఎరుక పడింది. జానకి సౌశీల్యం, రావణుని క్రూరత్వం స్పష్టపడింది. ఆమె ఆంతర్యం ప్రకటమైంది. ఈ అపకారం సాధనంగా వైరుల బలాబలాలు తెలుసుకుంటా. నా శక్తికీ, దైత్యుల శక్తికీ గల తేడా తేటతెల్లమవుతుంది. దానితో దశరథుల ప్రయత్నం ఫలవంతమవుతుంది. అప్పుడు ప్రభువుకు తగిన బంటనిపించుకుంటాను. సులభంగా కలహం

పెట్టుకుని కొందరిని చంపుతాను. ఆ వార్త విని మరి కొందరిని పంపుతాడు. వాళ్ళను కూడ హతమారుస్తాను. అప్పుడు అసలు శక్తి కలవాళ్లు కొందరు వస్తారు. వాళ్ళను మళ్ళీ ఇంటి ముఖం చూడకుండా చేస్తాను. దానితో దశకంఠుని తల తిరుగుతుంది. వస్తే వాడైనా రావాలి. వాడంతటి వాడు ఇంకోడైనా రావాలి. నా శక్తి అప్పుడు నక్తంచరపతి తెలుసుకుంటాడు. దానితో శత్రు బలంలో కొంత తగ్గుతుంది. కారణాంతరంచే కట్టుబడి రావణుని సమక్షంలో నిల్చి ముఖాముఖి భాషించి, మనస్సులోని మర్మం గ్రహిస్తాను. తలపడితే ముష్టాముష్టి పోరి వైరి బలం గ్రహించి అందకుండా ఆకాశ పథంలో అకూపారం ఆవలిగట్టు చేరుతాను. ఈ ఆలోచన సద్యఃఫలితమే కాక అనంతరం చేయబోయే కార్యానికి అన్ని విధాలా దోహదం చేస్తుంది" అని భావించి ఉప్పరానికి లంఘిస్తూంటే హనుమ ఊరు వేగానికి అశోకవనం అల్లకల్లోలమైంది. అది హేతువుగా భావించి, అంతవరకు త్రిజగన్మోహనంగా విశ్వకర్మచే నిర్మితమైన నిష్కుటాన్ని ధ్వంసం చేయాలనీ, అది చూచి, కడుపు మండి రావణుడు తనకై సైన్యాన్ని పంపటం జరుగుతుందనీ, పూర్వం ఆలోచించిందంతా ఆచరణలో పెట్టవచ్చనీ హనుమ తలంచాడు.

## హనుమంతుడు అశోకవనం పాడుచేయుట

ప్రళయ ప్రభంజనం విజృంభించి వీచినట్లు తన లంఘన వేగంతో వృక్షాలు మొదళ్ళతో పెల్లగిలి భూమిపై పడేలాగా చేస్తూ, అటు దూకుతూ, ఇటు దూకుతూ, మనోజ్ఞమైన అశోకవనం మట్టిపాల్చేయసాగాడు. మదించిన మాతంగం పెచ్చురేగి అడవినంతా అల్లకల్లోలం చేసినట్లు భూరుహాలను మొదలంట పెళ్ళగించాడు. లతా గుల్మాలను నామరూపాలులేకుండా చేశాడు. కృత్రిమ జల యంత్రాలు, కృతక విహార పర్వతాలు నేలమట్టం చేశాడు. నిర్మల సరోవరాలను నీరంతా ఎగజిమ్మి కశ్మల భూయిష్ఠం గావించాడు. కేళీ ప్రదేశాలను కూలద్రోశాడు. హనుమ చేస్తున్న ఆ బీభత్సానికి ఆ వనమంతా, పర పురుష బలాత్కృతయై, మాన రక్షణ కోసం మరుగుతున్న సాధ్వి వలె కంపించి పోయింది. వెలవెలపోయింది. అవకాశ రహితమై, ఆత్మహత్యకు దిగినట్లు, క్షణంలో నిర్ధూమధామ

మైంది. కారుచిచ్చు ముట్టిన కారడవిలాగా హృదయ విదారకంగా రూపెంది. ప్రమాదరహితంగా తిరిగే వ్యాళాలు, ప్రాణభీతితో పారిపోయినై. చిత్ర హర్మ్యాలు శిథిలమయినై. పొదరిండ్లు పొలుపుమాసినై. అహో! అప్పటి పావని ఆకారం, ఆ ఉగ్ర చర్య, ఆ వానర లక్షణం వర్ణనాతీతం. ఫల పుష్ప శాఖాభరితమైన వృక్షపాళి నేల కూలింది. లతా సౌందర్యం తూలింది. అంబర చుంబి పతాకాశ్రేణి వ్రాలింది. సుందర మందిర బృందం వ్రీలింది. అంతఃపుర ప్రమదాజన ప్రమద కారణమైన అశోక వనం నాశనం చేసి, బొమ్మలాటకు సిద్ధంగా తోరణాగ్రంమీద "నేనేరా ఈ పని చేసింది. నన్నేం చేస్తారో చేయండి" అన్నట్లుగా భీకరాకారంతో నిల్చున్నాడు.

## రాక్షసకాంతలు హనుమ వృత్తాంతం సీతను అడుగుట

మహాకపికృత ప్రళయ కృత్యానికి పక్షులు దుర్నిమిత్తాలు తెలిపే అరపులతో అంబర మార్గంలో అరుగుతుండటం, మృగాలు శ్రవణ బధిరీకృతంగా ఘోరారావం చేస్తూ చెల్లా చెదరై పరుగు తీయటం విన్న లంకేశులు విస్మయంతో విను వీథిని చూస్తున్నారు. ఆ ఉలివుకు కాపలా కాస్తున్న కాంతలు లేచి కలయ పలుకుకుని ఒకరి మొగం ఒకరు చూచుకుంటూ జానకిని చేర వస్తుంటే, ఆ రాకాసి మూకలు బెదరి చెదరగా అట్టహాసం చేస్తూ భయంకర రూపంతో ఎదురై భయపెట్టాడు. ఆ కాంతలు భీతిల్లక మైథిలిచేరి, "ఒసే నంగనాచీ! ఎవ్వడే ఈ కోతి? ఇందరం ఇక్కడ వుండగా ఎలా వచ్చాడే? ఎవరి కోసం వచ్చాడే? ఆ కోతి నీవూ ముచ్చట లాడుకున్నారుగా. మేం చూడలేదనుకున్నావా? అయినా భయం లేదులే. నిజం చెప్పు. వాడు నీకేం చెప్పాడు? నీవు వాడికేం చెప్పావు? మంచిగా చెప్పు. చెప్పకపోతే ఏం జరుగుతుందో నీకే తెలుసు" అని భయపెడుతూ సీతను అడిగారు. ఆ మాటలకు కోపం తెప్పుకుంటూ, "మాటి మాటికి నన్ను బెదరించటం దేనికి? నాకేం తెలుస్తుంది? మీ మాయలు మీకే తెలియాలి. పాము కాళ్ళు పాముకేకదా తెలిసేది? ఎవరో? ఎందుకు వచ్చాడో? ఏం మాట్లాడాడో మీకు గుండెలు వుంటే ఆ కోతినే అడగండి. నేనిక్కడనే వున్నాను. మీరంతా చుట్టూ చూస్తూనే ఉన్నారు.

ఆ కోతి ఈ చెట్టు పై వున్నప్పుడు చిన్నదిగా వుంది. ఇప్పుడు ఎంతో భీకరంగా, పెద్దదిగా వుంది. ఇది కామరూపులకే సాధ్యం. ఆ విద్యలు మీకే కాని, నాకు తెలియవు. నన్ను బాధ పెట్టకండి. మీకు తోచినట్లు చేసుకోండి" అని సీత కఠినంగా జవాబు చెప్పింది. అనృత దోషం అంటకుండా, గూఢం కాపాడుతూ అసురకాంతలకు అర్థం స్పష్టపడకుండా ఆమె పల్కటంతో, వాళ్ళలో వాళ్ళు కొంతసేపు తికమక పడ్డారు. అంతా తెల్ల మొగాలు వేసి నిల్చున్నారు.

## అసురకాంతలు అశోకవనం పాడైన సంగతి అసురపతికి తెలుపుట

అందులో కొందరు భయపడి తప్పుకున్నారు. కొందరు నిలువు గ్రుడ్లతో నిలుచున్నారు. కొందరు లంకేశుని సముఖానికి పరుగెత్తారు. సీత రక్షణ కోసం కాపుంచిన స్త్రీలు రావటంతో రావణుడు అదరిపడ్డాడు. వచ్చిన వాళ్ళు "దొరా! కేవలం కోతీ కాదు, కేవలం మనిషీ కాదు. వికట వానరాకారుడైన వీరుడొకడు సీతమ్మతో చనువున్న వాళ్ళవలె ముచ్చటలాడాడు. అశోకవన ప్రదేశంలో వున్నాడు. ఇంద్రుడు పంపితే వచ్చాడో, కుబేరుడు పంపితే వచ్చాడో, సీతను వెదకటానికి రాముడు పంపితే వచ్చాడో తెలుసుకోటం దుర్ఘటం. ఎంత బుజగించి అడిగినా ఆమె వనేమీ నాకు తెలియదంటూ, మాయ మాటలు చెప్పి మమ్మల్ని మభ్యపెడుతూంది. ఆ వచ్చిన కోతివాడు ఆమెతో మాటాడిన మీదట అందచందాలకు పుట్టినిల్లైన మీ అభిమానారామం అశోకం సర్వనాశనం చేశాడు. కాని, సీతమ్మ వుండే చెట్టుకానీ, ఆ పరిసరంగానీ తాకలేదు. శ్రమచేత కానీ, ఆమె రక్షణకోసం కానీ ఆ శింశుపావృక్షం మాత్రం ముట్టుకోలేదు. మిగతా వనమంతా పెను తుపానుకు నాశనమైన మహారణ్యం లాగా పాడైపోయింది. ఆ వింత కోతికి శ్రమ ఎక్కడిది? ఆమెను కాపాడటంకోసమే ఆ పని చేశాడు. ఏలినవాడు, ఆమెతో మాట్లాడినందుకు, అశోకవనం నాశనం చేసినందుకు ఆ నూతన ఘాతావికి కావరం అడగేలాగా కఠిన శిక్ష కావించండి" అని మొరపెట్టుకున్నారు. "దొర

కోరి తెచ్చిన కాంతతో ఏకాంతంగా మాట్లాడి ప్రాణంతో తిరిగిపోవటం తీవ్రమైన అవమానంగా మేం భావిస్తున్నాం" అని మండే మంటలో ఆజ్యం పోసినట్లు అదనంగా అన్నారు.

## రావణుడు హనుమపైకి కింకరుల పంపుట

ఆ వార్త వినగానే అసుర సమ్రాట్టు కన్నుల్లో నీరు గిర్రున తిరిగింది. ఏనాడు మూల పురుషుడైన విశ్వకర్మ నిర్మాణం చేశాడో ఆనాటి నుంచీ నందన చైత్ర వనాలను ధిక్కరించి యశస్సు ఆర్జించిన అశోక వనం తాను బ్రతికి వుండగా పాడైనందుకు పట్టరాని ఆగ్రహం పొందాడు. ఆముదంలో ముంచిన వత్తి కాలుతుండే నూనె బొట్లు జారినట్లు వింశతి నేత్రాల్లో నుండి అశ్రువులు నేలపడ్డాయి. వెంటనే ప్రక్కనున్న ఘంట మ్రోగింది. భటుడు అభివాదం చేసి నిలుచున్నాడు. "ప్రతీహారీ ! కింకరు లనే పేరుగల సైన్యాన్ని వానరునిపైకి పంపమని ప్రహస్తునితో చెప్పు" మన్నాడు. ఆజ్ఞానుసారం మహా దర్పాంధులైన కింకరులు ఎనభై వేల మంది దంష్ట్రా కరాళోదర ద్రవిణ సంబంధులై ఏక ముఖంగా పైకి ఎదురు నడిచారు. తోరణాగ్రంపై తోక కదలిస్తూ నిల్చిన కోతిని చూచి కాంచన పరిఘ కృపాణ శూల ముద్గర పట్టిస తోమర శక్తి తాడితాంగుని చేసి ఆర్చారు. పక్షపాతానికి చలించని పర్వతంలాగా నిల్చి హనుమ మేను పెంచి క్రుద్ధుడై వచ్చిన రక్షస్సైన్యాన్ని పార చూచాడు.

## హనుమంతుని జయఘోషం

తన సంకల్పం కార్యరూపం ధరిస్తున్నందుకు హనుమ లోలోపల ఎంతో సంతోషించాడు. వాలాన్ని ఆడించి బలంగా నేలపై కొట్టి, పెనుకేక పెట్టి జబ్బ చరిచాడు. ఆ గర్జకు లంకా నగరం మోత మ్రోగింది. పక్షులు బెదరి ఉప్పరానికి ఎగిరిపోయినై. గుండె అదరి నేల గూలి పడినై. "హర కోదండ ఖండ నయశోభాంచితుడైన రామచంద్రునకు జయముగుగాక. ప్రళయకాల నిర్ఘాత పాత సదృశుడైన సుమిత్ర పట్టి లక్ష్మణునకు జయముగుగాక. వ్యోమగమన కామరూప విద్యా విశారదుడైన కపిలోక ప్రభువు సూర్య సుతుడు సుగ్రీవునకు జయముగుగాక. సమస్త సద్గుణా రామమైన శ్రీరామునకు దూతను. శత్రు కుంజర కంఠీరవుణ్ణి.

వాయు పుత్రుణ్ణి. పేరు హనుమంతుడు. దశకంఠులు పదివేల మందైనా నా సమానులు కారు. సంగ్రామ రంగంలో నిలిచి ప్రాణాలతో పోరు. అస్త్ర శస్త్రాలు లేవని తేలికగా తలపోయవద్దు. మీ బ్రదుకులు బ్రద్దలు కావటానికి అవన్నీ ఎందుకు? రాళ్లు చాలు, చెట్లు చాలు. నా ముష్టి చాలు, వాలం చాలు, నా పాదాలు చాలు. లంకను ధ్వంసంచేసి, మాంసాశనుల మద మణచి, సీతమ్మకు చేతులెత్తి మ్రొక్కి, చావగా మిగిలిన రాక్షసులు ఏడుస్తుండగా సముద్రం తరించి మా ప్రభువులకి వార్త తెలుప పోతాను. నేనెందుకు వచ్చానో తెలిసిందిగదా" అని జయ ఘోష చేశాడు. ఆ భీకరాకారానికీ, ఆ భయంకర ఘోషకూ, వచ్చిన సైన్యంలో కొందరు భయంతో వెను తగ్గారు. కొందరు శస్త్రాస్త్రాలు జార విడిచారు. సేనాపతులు రేకలతో మళ్ళీ గుమిగూడి దాడి వర్షం కురిపించి హనుమను నొప్పించారు. "ఇక ఉపేక్ష చేస్తే ప్రమాదం తప్పదు. కొద్దిగా నా శక్తి చూపిస్తాను" అని ఇంకా తన శరీరం భీకరంగా హనుమ పెంచాడు. తోరణాగ్రంతంగా వున్న ఇనుప లంటాన్ని పెరికి, సర్పాన్ని గోళ్ళతో పట్టుకుని పైన తిరిగే గరుత్మంతునివలె, గిర గిర త్రిప్పుతూ, పైకి దూకి వచ్చిన కింకర సైన్యాన్ని వదలకుండా హత మార్చాడు. అంతటో ఆగక ఆ ఆకారంతోనే మళ్ళీ వచ్చి తోరణాగ్రం మీద నిల్చుని క్రొత్తగా వచ్చే యుద్ధ వీరుల కోసం ఎదురు చూస్తున్నాడు. హత శేషులు కొందరు ప్రాణాలు దక్కించుకుని పంక్తి కంఠుని ఆస్థాన ప్రవేశం చేశారు. చేతులు ముకుళించి జరిగిన కింకర సైన్య నాశనం సంగతి సవివరంగా విని పించారు. ఆ మాటలు పిడుగు పడినట్లయి అసురపతి క్రోధతామ్రాక్షుడూ, ప్రతీకార మూర్ఛిత మనస్కుడైనాడు. వెంటనే అజేయుడైన ప్రహస్త పుత్రుని పావని పైకి పంపించాడు.

## హనుమ అశోకంలోని రావణప్రాసాదాన్ని కూల్చుట

ఈ లోపల తోరణ శిఖరంపై నిల్చిన మారుతి తోకను అటునిటు కదలిస్తూ, నాల్గువైపుల పరికించాడు. "దశాస్య ప్రేరితులై వచ్చిన అపార కింకర సైన్యాన్ని అంతకావాసం చేర్చాను. వార్త తెలిపి మళ్ళీ రాక్షస శ్రేష్ఠుల పంపేలోపల ఎందుకు కాలం వృథా చేయాలి?" అని ఆలోచించటం,

అతిలోక సుందరం, ఆకాశ చుంబితం, అపురూప శిల్ప చిత్ర నిర్మాణ చరితం, నానావిధ వృక్ష లతాగుల్మ సంశోభితం అయిన పంక్తిముఖుని ప్రాసాద శిఖరంపై దూకటం చేశాడు. "నిర్దాక్షిణ్యంగా, క్రూరంగా ఈ అపూర్వమైన అశోక వనాన్ని నిర్మూలం చేశాను. నన్ను పట్ట వచ్చిన కింకరుల అనంత రహితంగా హతం చేశాను. ఇంకా ఈ సుందర మందిరం ఇక్కడ ఎందుకు వుండాలి? దీన్ని కూడ నేలమట్టం చేస్తే, అంతా ఒక తీరుగా వుంటుంది" అని ఊహించి, తను దూకిన దూకుతో మూలం కదలి బీటలు వారిన ఆ హర్మ్య శిఖరాన్ని రెండు బాహువులచే పట్టి అటు ఇటు కదిలించాడు. గగన ప్రదేశాన్ని ముద్దిడుతూవున్న ప్రాసాదం శిఖరాగ్రం మీద స్వీయ తేజః పుంజాన్ని వెదజల్లుతున్న మారుతి ఉదయార్క బింబంవలె గోచరించాడు. అటు దూకి, ఇటు దూకి, ఒక దానితో ఒకటి కొట్టి ఢంకలో విపుల ప్రకాశ చరితమైన నాదం నిర్ఘోషనాదం చేశాడు. ఆ చేష్టలకు అమరలోకం ఆనందించింది. "ఎంత కాలానికి దుర్జయుడై, వర బల గర్వితుడై, స్వర్గాన్ని అనుశాసిస్తున్న రావణుని నగరంలో ఇంత ప్రళయం జరిగిం"దని అంజనా పుత్రుని అనేక విధాల అభినందించారు, ఆశీర్వదించారు, దేవతలంతా ఒకచోట చేరి చూస్తూ. అప్పటికీ హనుమకు తృప్తి కలగలేదు. వజ్రనిభా ముష్టితో సాకిరి శ్రవణ దుర్భరంగా, తన విజయం చాటుతూ పెనుకేక పెట్టాడు. ఆ కేకకు వాయువు నలుదిక్కులు దిరిగింది. సాగరం ఘోషించింది. లంకా నగరం విక్షుబ్ధమైంది. "ఓ రాక్షసులారా! పరశురామ గర్వ నిర్మాపకుడు, తాటకా మారీచ సంహారకుడు, ఖరదూషణ త్రిశిరస్కంధ బంధన ధనుర్విద్యా కుశలుడు, సత్య పరాక్రముడైన శ్రీరామ ప్రభువునకు జయము గాక. త్రిపుర హరవిశ్వ లోక భయంకర దహన శిఖా సంకాశుడైన లక్ష్మణునకు జయము గాక. సంకల్ప మాత్ర సమస్త రూపధారి, సర్వ వానర లోక సమ్రాట్టు జగన్మిత్ర పుత్రుడైన సుగ్రీవునకు జయము గాక! నేను రామ దూతనే కాక దాసుడను. శత్రు నిహంతను. పంక్తిగ్రీవుడు పదివేలమందైనా సంగరంలో నాకు చాలడు. నాకు ఆయుధాలతో పనిలేదు. బాహువులతో, పాదాలతో, లాంగూలంతో, దంతాలతో, ద్రుమ శిలాఖండ పర్వతాలతో పోరాడతాను. నా పేరు

హనుమంతుడు. లంకను నాశం చేస్తాను. రాక్షసులను రూపుమాపుతాను. సీతా మాతకు అంజలిస్తాను. క్షేమంగా వారాశి తరిస్తాను. ఇప్పటికే నా శక్తి మీ ప్రభువుకు కొంత తెలిసి వుండాలి. బ్రదుకతలిస్తే నా పై యుద్ధానికి రావద్దు. సైన్యాన్ని పంపి చేచేతుల నాశనం చేసుకోవద్దని మీ ప్రభువుకు తెలపండి" అని మళ్ళీ హనుమ హెచ్చరించాడు.

## హనుమ అశోకవన పాలకుల హతమార్చుట

ఆ జయఘోషకు అశోకవన పాలకులు ఆశ్చర్యపడ్డారు. ఆగ్రహించారు. అస్త్ర శస్త్రాలు ధరించారు. అప్పటికే నేల కలసిన అశోక విష్కుట శోభకు ఆక్రోశించారు. హనుమ నిల్చిన చోటికి పరుగు పరుగున పరుగెత్తి వచ్చారు. అందరు దొమ్మిగా అస్త్ర శస్త్ర వర్షం ఆంజనేయుని పై కురిశారు. ఆ అస్త్ర శస్త్ర ప్రయోగ ప్రవాహంలో హనుమ గంగా నదిలో సుడిగుండంవలె కానుపించాడు. ఉపేక్షించి కాల హరణం చేయటం కాదనుకున్న కేసరి సుతుడు నేల కూలిన ప్రాసాదంలో ఒంటిగా నిల్చిన పెద్ద స్తంభం మొదలంట పీకి సవ్యాప సవ్యంగా, నిరంతరాయంగా, వేగవంతంగా గిరగిర త్రిప్పసాగాడు. ఆ పరిభ్రమణ వేగానికి స్తంభ సంఘాతమై శిఖి శిఖోత్కరం ప్రాసాదాన్ని కాల్చి, ప్రత్యక్షమైన చైత్య పాలకుల, శతాధిక సంఖ్యల భస్మరాసుల చేసింది. వనపాలకుల ప్రాణ వాయువులు అనంత పథంలో కలియటంతో కొందరు పారిపోసాగారు. వాళ్ళను లక్షించి "ప్రాణాలపై తీపితో పారిపోతున్నారు. నాకిభ్యంతరం ఏమీ లేదు. మిమ్మల్ని చంపను. పోతున్నారు కనుక మీకొక సందేశం ఇస్తున్నాను. అది మీ రాజుకు చెప్పండి. నా వంటివాళ్లు అర్బుద న్యర్బుద సంఖ్యలో సుగ్రీవుని ఆజ్ఞానువర్తులై అవనీ జాతను అన్వేషిస్తున్నారు. వారి సంగతి కొంత మీకు చెపుతా వినండి. పది ఏనుగుల బలం కలవారు కొందరు, వాటికి దశ గుణితంగా బలం కలవారు మరికొందరు, కరిదశ శతయుత బలవంతులు ఇంకా కొందరు, వాళ్ళ శక్తి వాళ్ళకే కాని వాచ్యం చేయటానికి వీలులేని వాళ్ళు వేరే కొందరున్నారు. వాళ్ళంతా కామరూపులు. వాయు వేగులు. గగనచారులు. అప్రమేయ శక్తి సంపన్నులు. దంతనఖాశ్మ సాధనులు. అనిలో అప

జయం తెలియనివాళ్ళు. వాళ్ళసుగాని వానరలోక సార్వభౌముడు లంకలో ప్రవేశిస్తాడు. దైత్య సంహారం చేస్తాడు. జానకీదేవిని శ్రీరామచంద్రునకు చేరుస్తాడు. రామచంద్రునితో వైరం కొని తెచ్చుకున్న రావణుడింకెక్కడ? లంకా నగరం ఎక్కడ?" అని సింహగర్జనంలాగా అరిచాడు.

## జంబుమాలిని హనుమంతుడు సమయించుట

అదేసమయంలో అసురాధినేత ఆజ్ఞకొని ప్రహస్త పుత్రుడు జంబుమాలి సమర సన్నద్ధుడై వచ్చాడు. అతడు ఎర్రని పూల మాలలు ధరించాడు ఎర్రని వస్త్రాలు కట్టాడు. ఎర్రని పద్మరాగాలు పొదిగిన కుండలాలు పెట్టుకున్నాడు. కోపంతో కన్నుదోయికూడా ఎర్రగా వుంది. శరీరం ఎర్ర చందన గంధంతో అలంకరించాడు. వాసవుని శరాసనం వంటి చాపాన్ని చేత పట్టుకున్నాడు. ఉన్నత దేహాలుకల బలమైనగార్దభాలు కట్టినరథంలో హించాడు. అల్లంత దూరాన అంజనా సంజాతుణ్ణి అవలోకించాడు. మండలీకృతంగా ధనుస్సు పరిచాలనం పొందగా, నిరవధికంగా జ్యాటంకారం ధ్వనించగా, జంబుమాలి దుర్నిరీక్షుడై గర్జారసి పారుతున్న ప్రవాహం వలె హనుమంతునిపై అస్త్రధారలు వర్షించాడు. ఆ వచ్చిన దనుజుని ఆకృతికీ, ధనుఃపాటవానికీ కైనరి మెచ్చుకున్నాడు. తను ఇంతగా బాణ ప్రయోగం చేసినా లక్ష్యపెట్టక వికటంగా ఇకిలిస్తున్న మహాకపిని చూచి మండిపడి శరదశకం బాహువులలో నాటి, మొగంమీదా, తలమీదా మరికొన్ని మార్గణాలు గ్రుచ్చి ఆర్చాడు. జంబుమాలిచే ప్రయుక్తమైన శర పంక్తి హనుమ వదనం నాటి రక్త బిందు విసిక్తమై శరత్కాలంలో ఖర కిరణ బింబోదయంలో వికసించిన సరసీరుహ సౌందర్యం ఆపాదించింది. మారుతి శోణ వదనం శోణిత బిందు సంసక్త శోభితమై, వియత్పథంలో శోణిత చందన కణ శోభితమై అలారే కోకనదం వలె కూడా భాసించింది. "వీడెంతపాటి?" అని ఉపేక్షించిన వాతాత్మజునకు వాడి బాణ ఘాతంతో వేడెక్కింది. వెంటనే పెద్ద బండను గురిపెట్టి విసరివేశాడు. జంబుమాలి మార్గ మధ్యంలో దాన్ని తుత్తునియలు చేసి శర సంధానం చేసే లోపల మహా వృక్షాన్ని గిరగిర త్రిప్పి వడిపెల రాయిలాగా విసిరాడు. దాన్ని

కూడా దశ మార్గణ ప్రయోగంతో ఖండించాడు. నాలుగింట ఊరువులు, ఐదింట బాహువులు, ఒకట వక్షం, పదింట స్తనదేశం బాధించాడు. దీప్త బాణ విద్ధ దేహుడైన కపి కుంజరుడు క్రోధ కంపిత గాత్రుడై పరిఘను పట్టి మండల భ్రమణంగా మనుజాశనుని రొమ్ము లక్ష్యంగా విసిరివేశాడు. హనుమ త్ప్రయోగ పరిఘా హతశరీరుడైన జంబుమాలి, తల ఏదో, చేతులేవో, మొల ఏదో, చాపమేదో, శరమేదో, మోకాళ్ళో తెలియకుండ నురి నురియై, నుగ్గు నూచై, నేల వుల్క పడి రాలాడు. ఆ పరిఘా ప్రయోగం ఎట్టిదో కాని, రథంతో, సారథితో, వాహన చతుష్టయంతో, భూషణాలతో, చేతిలోని శర చాపాలతో ఆ రక్కసుడు ముద్ద చేసినట్లు చచ్చాడు. ఆ పాటు చూచి వెరచి హత శేష కింకరులు ముందు చూపే కాని, వెనుక చూపు లేకుండా ప్రభు దర్శనార్థం పారిపోయారు.

## హనుమంతునిచే మంత్రి పుత్ర సప్తకం మరణించుట

అవనత శిరస్కులై కింకరులు చెప్పిన యుద్ధ వార్తకు దనుజపతి కింక హెచ్చగా అమాత్య పుత్రకుల ఏడుగురిని సంగ్రామానికి పంపాడు. దర్ప శౌర్య గర్వధనులైన ఆ సోదర సప్తకం, సప్తార్చి సప్త జిహ్వికల లాగా, సప్త ఋషి మండలం లాగా సప్త ధాతువుల లాగా, సప్త సముద్రాల లాగా శర చాప వివిధ సాధనసంపత్తితో, పరస్పర జయవాంఛమై, ధర్మనిర్మితకేతన భూషణ మాలికాకలితాలైన రథాలు ఆరోహించి, అంబుదధ్వానంలాగా, రథ ఘోషలు దిక్కులు పిక్కటిల్ల చేస్తూ, ధనుర్గుణటంకారరావాలు పిడుగులు పడునప్పుడు గలిగే ధ్వనికి ప్రతిద్వంద్వులుగా నిలువగా, శంపాలతలవలె చూపరు దృష్టికి దుస్సహంగా ఆహవానికి అత్యుత్సాహంతో బయలుదేరింది. అపశకునంగా, వాళ్ళ తల్లులు కింకర జంబుమాలి చైత్ర పాలకులకు పట్టిన గతి విన్నవాళ్ళు కావటంచేత గ్రుడ్ల నీరు కుక్కుకుంటూ రోదించారు. ఆప్త జనుల దుఃఖం అలక్ష్యంచేసి అమాత్య పుత్ర సప్తకం అశోకవనం చేరింది. చేరీచేరగానే స్యందన గరిత స్వనం, సాయక ప్రహరణ జ్యాటంకారం మిన్నుముట్టగా, దేవతావైరిబృందం

పర్వతాన్ని క్రమ్ముకున్న వర్షాభ్రంలాగా, విజయగర్వంతో మధ్యందిన మార్తాండునివలె వెలిగిపోతున్న హనుమను శరసహస్రంతో ముంచింది. విడువక ప్రయోగించే వైరి బాణజాలానికి అందకుండా మారుతి తోరణాగ్రం పైనుంచి అంబరానికి లంఘించాడు. అక్కడనుంచే రాళ్ళూ, రప్పలూ, చెట్లూ, చేమలూ విసరి సముద్రాన్ని మందరనగం కలచినట్లు శత్రుసైన్యాన్ని కలచివేశాడు. క్షణం వ్యర్థం కారాదని కంఠారావం చేస్తూ కపికంఠీరవుడు క్రవ్యాదమదోత్కంఠుడై పద నఖ శిరః కుంఠితం చేసి బలాన్ని నేలపాలు కావించాడు. కొందరిని హస్తంతో కొట్టి చంపాడు. కొందరిని నేలమోది ప్రాణాలు తీశాడు. కొందరిని పిడుగుద్దులతో నెత్తురు క్రక్కించి ఉసిగొన్నాడు. కొందరిని వాడిగోళ్ళతో గుండెలు చీల్చి యమపురికంపాడు. కొందరిని పొట్టేలవలె తలతో ఢీకొట్టి నామరూపాలు లేకుండా చేశాడు. కొందరిని కాళ్ళు ఒడిసిపట్టి గిరగిర త్రిప్పుతూ మరికొందరికేసి కొట్టి మృత్యుముఖంలో పడవేశాడు. కొందరిని సింహనాదంచేసి కూల్చాడు. ఈ విధంగా మారి ముసరినట్లు, కొరవి చూపినట్లు కాగిన పళ్లెం అల్పజల బిందువుల ఆహరించినట్లు అసుర సైన్యాన్ని అంతకనిలయం చేర్చాడు. చావక మిగిలిన వాళ్ళు పోయిందే పోకగా పారిపోయారు. తన్నుకొనివచ్చే గుర్రాలు, మూలుగుతూ నేల దొరలిపడే ఏనుగులు, ఉల్కలవలె రాలే గొడుగులు, పిడుగులవలెపడే చెక్కాలు, పారే నెత్తుటి వరదలు, చేరే కంక గృధ్ర సృగాలాలుగా రణరంగం మహాకపిచే భీతావహంగా మారిపోయింది. శనగలు తిని చేతులు దులుపుకున్నట్లు అసురుల చంపి హనుమ చేతులు దులుపుకుంటూ, తోక ఆడిస్తూ, వచ్చేవాళ్ళకోసం తోరణాగ్రం పైకెగసి చూడసాగాడు. హతశేషులు అమాత్య పుత్రకుల చావువార్త కొని అసురపతి సన్నిధానానికి ఏడుస్తూ పరువెత్తి లంకానగరం చేరుకున్నారు.

## రావణుడు సేనాపతి పంచకాన్ని హనుమ పైకి పంపుట

చావగా మిగిలినవారు తెచ్చిన సందేశం రావణుని కలచి వేసింది. దేవతలతో పోరినప్పుడు కనుగొనని మంత్రి పుత్ర సప్తక మరణం

ఆలోచనా శూన్యుణ్ణి కావించింది. అది లోలోపల దిగమ్రింగి ఆర్భాటం చేస్తూ, విరూపాక్ష, దుర్ధర్ష, భాసకర్ణ, యూపాక్ష, ప్రఘసులనే సైన్య నాయకుల అయిదుగురిని సమక్షానికి పిలిపించాడు. "మీరు మీమీ సర్వ సైన్యంతో పోయి అశోకవనం పాడుచేసిన అగచరుణ్ణి పట్టి బంధించి తీసుకుని రావాలె. పేకువతో, మెలకువతో ప్రవర్తించాలె. దేశకాల విరోధం లేకుండా సాహసంతో కార్యం సాధించాలె. ఇంద్రుడు తన తపోబలంతో తయారు చేసి పంపిన పెద్ద భూతంకాని కోతి మాత్రం కాదు. నన్నెలాగైనా అవమానించి ప్రతీకారం తీర్చుకోవాలని ప్రత్యేక ప్రయత్నంగా పంపినట్లు తోస్తూంది. మీ సహాయ సంపత్తితోనే కదా పూర్వం నాగ యక్ష దైత్య దానవ సురానీకాన్ని రణరంగంలో నిరించింది. సమయం వేచి నా కప్రియాన్ని కలిగించాలని వారంతా ఈ భయంకర వానరాన్ని లంకకు పంపారు. మీరు సర్వ శక్తులు ధారపోసి ఆ కోతిని పట్టికొని వచ్చి నాకు ప్రియం కల్గించండి. మీరు మీ శత్రువును కోతి మాత్రంగా తేలికగా చూడవద్దు. నేను పూర్వం యుద్ధాభిలాషతో కిష్కింధా నగరం వెళ్ళాను. అప్పుడు ఆ రాజ్యాన్ని పాలిస్తున్న వాలినీ, అతని సోదరుడు సుగ్రీవుణ్ణీ, భల్లూకపతి జాంబవంతుణ్ణీ, సేనాపతి నీలుణ్ణీ, మైంద ద్వివిదాదులను చూచాను. వారిలో ఎవరూ ఈతనికి సరి వచ్చే వారు కానరాలేదు. ఆకారం, ఆకారానికి తగిన సాహసం, సాహసానికి తగిన శక్తి, శక్తికి తగినవిచక్షణా అన్నీ ఈ కోతికి వున్నట్లు గ్రహించాను. మీరేమో మహాశూరులు. ముందు చూపే కాని వెనుకచూపు లేనివారు. అందువల్ల కార్యసాధన విషయంలో ఆలోచించాల్సిన అవసరం వచ్చింది. యుద్ధంలో జయాపజయాలు నిర్ణీత పద్ధతిలో వుండవు. కేవలం గత విజయాల పైనా, స్వీయ పరాక్రమం పైన దృష్టి పెట్టక శత్రుపక్షం కూడా యోజించి, సమర్థమైనదైతే ప్రయోగించే వ్యూహాలను పన్ని విజయం సాధించండి. కీర్తి నిలపండి. దేవతలు మాయతో నిర్మించిన ఈ పెనుభూతాన్ని వీలయితే కొనిరండి. కాకపోతే వధించి రండి. శుభంగా పోయిరండి" అని చెప్పవలసిన దానికంటే అధికంగా రావణుడు సేనాపతులకు చెప్పి ఆజ్ఞ ఇచ్చాడు. వాళ్ళు పెండ్లికి వెళ్ళినట్లు, సర్వాభరణ భూషితులై, సర్వాస్త్ర శస్త్ర పాణులై సర్వ లాంఛన సమేతులై, సర్వసన్నద్ధులై,

సముచిత సైన్య పరివార వాద్య విశేష సంరంభులై, ప్రయాణ సూచనగా భేరీ మ్రోగించి, భూమి కంపించే లాగా హనుమ వున్న అశోకవనానికి ఆర్భాటంతో కదలివెళ్లారు.

## అసుర సేనాపతి పంచకాన్ని హనుమ చంపుట

ప్రళయ కాలంలో వార్ధులు పొంగినట్లు వస్తున్న రాక్షస సైన్యాన్ని రామదూత తోరణాగ్రం పైనుండి తేరిపార చూచాడు. ఇంత వరకు జరిగిన కార్యం, దానివల్ల కలిగిన అనుభవం ఒకసారి అవలోకనం చేశాడు. రావణుని రాజనీతి, యుద్ధ తంత్రం గ్రహించాడు. క్రమంగా తనపై వ్యూహ ప్రయోగం బలోపేతం చేస్తున్నాడని తెలుసుకున్నాడు. తాను చేయతగిన ప్రతి కృతికూడా ముందే నిర్ణయించుకున్నాడు. ఇంతలో వారు రానే వచ్చారు. ఆ సైన్య పారావారంలో ఒక్కసారి ఉవ్వెత్తుగా లేచిన తరంగం వలె దుర్ధర్షుడు రథాన్ని ముందుకు దూకించాడు. నఖశిఖ పర్యంతం మహా కపిని చూచాడు. ప్రభువు చెప్పిన విషయం మననం చేసుకున్నాడు. వైరి వగుడకు కాదని గుర్తించాడు. వీరుడూ, ఉదయత్సూర్యుడూ, మహాకారుడూ, ద్విషత్సంహారుడూ, మహామతి, మహాకృతి, మహోత్సాహుడుగా అర్థం చేసుకున్నాడు. తాళవృక్షం వంటి తన చాపాన్ని సగుణం చేశాడు. ఒకసారి లాగి వదిలాడు. ధనుర్గుణ జనిత టంకారం భూతకోటి హృదయ విదారకంగా వెలువడ్డది. అంతే. కను రెప్ప పాటులో హనుమ ముఖంపై అస్త్ర పంచకం వాలింది. నాటింది. భేదించింది. ఆ ఘాతంతో హనుమ కెవ్వున కేక వేస్తూ ఆకాశానికి లంఘించి, అరి లోక భయంకరంగా పెడబొబ్బ పెట్టాడు. ఆ ఘోర గర్జనకు అసుర సైన్యం సర్వం ముందుకు మొగ్గతిల్లింది. ఇంతలో దుర్ధర్షుడు శరశతంతో మహా కపి మర్మాంగాలను నొప్పించాడు. బాణాలు బలంగా తాకటంతో, తోక త్రొక్కిన త్రాచులాగా ఊపిరి రాకపోకలు చేస్తుండగా ఇంకా శరీరం వృద్ధిచేసి ప్రయోగించే అస్త్ర శస్త్రాలను బాహువులు చాచి మధ్య లోనే అందుకుని ప్రొయిలోనికి వంటచెరుకు వలె ఫెళ ఫెళ విరచివేయ సాగాడు. ఆ వింత చూస్తూ అర నిముషం, లక్ష్యం మరచిన ఆ రాతి రథంపై కొండపై పడిన పిడుగులాగా హనుమ అంబరం నుంచి పడ్డాడు.

పడటం, అక్షకూబరాలతో. ఆజానేయాష్టకం, సారథి, రథం, రథి నేలపాలు కావటం అనూహ్యంగా జరిగిపోయింది. మరుక్షణంలో మహాకపి వాయుపథ జలధిలో తిమింగిలంవలె విహరించసాగాడు. దుర్ధరుని పాటు చూచి యూపాక్ష విరూపాక్షులు ఆతనితో ఆకాశానికి లంఘించి ముద్గరాలతో వక్షస్థలంపై మోద పోయారు. అది గమనించిన హనుమ, ముందునకు దూకటానికి వెనుకకు పోయినట్లు చప్పున వెను తగ్గి నేలకు దూకాడు. ఆ హతానికి అందకుండా అవనికి దిగిన హనుమ అవనీజం పెళ్ళగించి, తనతో ధరణికి దూకి, తన్ను తాక వస్తున్న దనుజులను దండధర పురానికి దాసులుగా పంపాడు. ఏనుగు వెలగపండువలె వాహినీ పతిత్రితయాన్ని పొట్టబెట్టుకున్న వానర శ్రేష్ఠునిపై మిగిలిన ప్రఘసుడు పట్టిసాన్ని, భాసకర్ణుడు శూలాన్ని ప్రయోగించారు. ఆ రెండు శస్త్రాలు ఏకముఖమై గుండెలో నాటటంతో రక్తం స్రవించి హనుమ శరీరం మందే సూర్యునివలె వెలిగిపోయింది. హనుమ ఆ చండ తరుణకోపంతో శరీరం మరచి, వాలంపెంచి సమీపస్థ పర్వతాన్ని బంధించి, సమూలంగా పెకలించి, వృక్షలతా మృగవేష్టితమైన దాన్ని ఉద్ధృతలాంగూల పరిభ్రమణంతో విసరివేశాడు. ఆ పర్వతపాతంతో, తిమింగిల పుచ్ఛ స్పర్శకు ఓడ పగిలి మునిగినట్లు ఆ ఇద్దరు చరిత్ర హీనులయ్యారు. మిగిలిన సైన్యాన్ని గుడి మ్రింగిన వారికి లింగంవలె చంపటానికి క్షణం పట్టలేదు. అలసినవాడు విశ్రాంతి కోరినట్లు హనుమ పునఃతోరణాగ్రంపై దూకాడు.

## అసురపతి హనుమపై అక్షయకుమారుని పంపుట

చలువపందిరిపై అగ్నిపడ్డట్లు విజయవార్తకై వేచివున్న రావణుని మనోవీథిపై, సేనాపతి పంచకంతో సర్వసైన్యం యజ్ఞకుండంలో పడిన ఆజ్యంవలె ఆహుతి అయిపోయిందన్న వార్త పడ్డది. ఆ వార్త విన్న అసురనేత ఆలోచనకు అవకాశం ఇవ్వలేదు. అవలోకనాలు తన కుమారుడైన అక్షయ కుమారునిపై వ్రాలినవి. అతడు అసలే ఆహవ పిపాసి. అందుపై శత్రువిజయం. ఆపై తండ్రి ఆలోకనం. ఇకచెప్పేదేముంది? "అసలేకోతి. కల్లుత్రాగింది. నిప్పుత్రొక్కింది. తేలుకుట్టింది"

అన్న సామెతను అక్షరాలా ఋజువు చేశాడు అక్షయకుమారుడు. ఆసనంనుంచి దిగ్గునలేచాడు అభివందనం తండ్రికి చేశాడు. అందరి ఆశీర్వాదాలు పొందాడు. ఆ యుద్ధవీరబాలుడు ఆసనంనుంచి లేస్తుంటే ఆజ్యం హుతంకాగానే అతి కాంతివంతంగా నాలుకలు క్రోలుతూ పైకి ప్రజ్వరిల్లే అగ్నిపలె వున్నాడని అందరికీ తోచింది. ఆజ్ఞానంతరం ఆవాసం చేరాడు. అఖండ తపస్సంపాదితమైనదీ, తప్తకనక జాలసంబంధమైనదీ, రత్నస్థగితహేమ స్తంభకీలిత ఫణిచిహ్న పతాంచలమైనదీ, హోపేత సైంధవాష్టక సంయోజితమైనదీ అయిన అరదాన్ని ఆరోహించాడు. తూణం, అష్టకృపాణికలూ, తోమరభిండివాల గదాద్యాయుధాలు చక్కపరచి, అసుర దానవ దుర్జయమై, నభశ్చరమై, అనుధావిత గమనమైన స్యందనం నడిపించాడు. ఘనఘోంతరాగాలు మారుమ్రోగేలాగా శంఖం పూరించాడు. చతురంగబలం తన్ను కొలిచిరాగా, దేవసైన్యంకొని కుమారుడు శత్రువులపై నడచినట్లు అక్షయకుమారుడు హనుమపైకి నడిచాడు. సూక్ష్మేక్షలతో హనుమంతుని బలం లక్షించి పరీక్షించాడు. తగిన ప్రతిపక్షి లభించాడని సంతసించాడు. పదాతి అనీ, శస్త్రాస్త్రరహితుడనీ శంకించాడు. "ఇతఃపూర్వం వచ్చిన వారంతా అస్త్ర శస్త్రాలతోనే ఆహవం చేశారు. కనుక అసమ యుద్ధంకాదనీ, రణనీతిని అతిక్రమించటం కాదనీ, శంకా రహితంగా, శస్త్రాస్త్రప్రయోగం సలుపవచ్చ"ని నిర్ణయం తీసుకున్నాడు.

## హనుమంతుడు అక్షయకుమారుని చంపుట

ఆ విధంగా నిశ్చయించుకున్న అక్షయ కుమారుడు నిశ్చలంగా, నిర్భయంగా, విరుపమాన తేజోమూర్తిగా తోరణాగ్రం పై నిలిచిఉన్న మారుతిని మూడే మూడైన శరాలతో తాడితాంగుని చేశాడు. ఆ వాడి బాణాల వేడికి కైసరి బాధపడుతూనే కుమారుని మెచ్చుకున్నాడు. చీమ కుట్టగా తీసి పారవేసినట్లు, ఆ మూడు మార్గణాలనూ పీకి విరిచి వేశాడు. తనచే ప్రయోగించబడిన బాణత్రితయాన్ని అంత సులువుగా విరిచి వేసిన ఆంజనేయుని అపారశక్తి సంపదకు అక్షయకుమారుడు ఆశ్చర్యచకితుడైనాడు. "సురాసుర యుద్ధంలో తన చేతి బాణం తగిలి బ్రదికిన శత్రు

వీడుదే కనుపించలేదు. ఈతడు సజీవుడై, అస్త్ర ధ్వంసం చేశాడంటే పోరు ఘోరంగా జరుగుతుందనీ. శత్రు విజయం కష్ట సాధ్యమనీ, ఏమరుపాటు లేకుండా యుద్ధం చేయాలనీ, దివ్యాయుధాలు తప్ప ఇతరాయుధాలు ఈ మహా కపిపై పని చేయవనీ క్షణకాలం భావించి శక్తిమంతమైన శరాలను ధనుర్గుణ టంకారంతో ప్రయోగించాడు. విషం వెదల గ్రక్కుతూ పైకి దూకే భయంకర పన్నగాల్లాగా వస్తున్న కుమారుని బాణ పంక్తిని హనుమ తిలకించాడు. తనువు పులకించింది. క్రోధాన్ని ఒలికించింది. ఐరావత తుండంవంటి తన రెండు చేతులు చాచి వచ్చే బాణాలను ఒడిసి పట్టుకుని పశువుల మేతకై విరిచే చొప్పకట్లవలె విరుస్తుంటే ఆ ధ్వనికి అదరి, బెదరి, చెదరి అక్షయుని సైన్యం తిరోగమించ సాగింది. అక్షక పినాథులకు జరిగే ఆ వింత యుద్ధం వీక్షించటానికి దేవతాగణం ద్యో మార్గం ఆక్రమించింది. పుడమి వణకింది. సూర్యుడు తేజోహీనుడైనాడు. గాలి వీచక స్తంభించింది. కొండలన్నీ క్రక్కదలి పోయినై. ఆకాశం ధ్వనించింది. సముద్రాలు క్షోభించినై. మారుతి కుమార వీరులు ప్రత్యర్థులై, ప్రబలులై, పరస్పర విజిగీషా గ్రీష్మ భీష్మ భావులై, ఘోరంగా పురివిచ్చక, మచ్చరం హెచ్చగ, లోకం మెచ్చగ పోరు సాగించారు. అక్షయుడు బాలుడైనా, అప్రతి హతాస్త్ర విద్యా ప్రసాదితాక్షయబల సంపన్నుడు. దేవ సేనానితో సమానుడు. దేవతలు ప్రశంసించిన దివ్య శక్తి కలవాడు. రథికుడు. చతురంగబల సమేతుడు. ప్లవగపతి పదాతి. తన తనువే వజ్ర పంజరంగా చేయగల మహా యోగి. పిపీలికాది బ్రహ్మ పర్యంతం పరివ్యాప్తమైన బాహ్యాభ్యంతర సృష్టిలోని అణువణువునా గర్భితంగా నిండి వున్న ఈశ్వరాంశతో సర్వ వ్యాపకుడైన వాయు దేవునిచే అంజనా గర్భశుక్తి నుంచి ఆవిష్కరింపబడిన ముక్తామణి. సర్వ దైవత వర ప్రసాది. చిరజీవి. రామనామ స్మరణ మాత్ర సర్వ రూప సర్వశక్తి పరిగృహీత. ఆ ఇద్దరి యుద్ధం, ఆశ్చర్యంగానూ, అద్భుతంగానూ, అమోఘయంగానూ, నిర్ణయ రహిత విజయంగానూ కొంతకాలం సాగింది. అక్షయ ప్రయుక్త శరాలు హనుమ గుండెలో నాటి పోటెత్తించినై. అంతటి హనుమ విలవిల మన్నాడు. వక్షస్థలం సూర్యబింబం అయితే కారే రక్తం కిరణాలైనై. తనువు

విదల్చాడు. వాలం ఝళిపించాడు. ఆగ్రహంతో అక్షులనే అగ్నిహోత్రం చేశాడు. చూపులనే జ్వాలా మాలికలుగా చేసి సురారి సైన్యాన్ని చూరగొన్నాడు. ఆ వహ్నికీలలకు అక్షయుని బలం ఆహుతికాగానే అచలాన్ని అంబుదం గప్పినచందంగా హనుమంతుని అనేక శత సహస్ర శత శిలీముఖాలతో కప్పి సర్వాంగాలను బాణమయం చేశాడు ఒక వంక వైరిని శ్లాఘిస్తూ, ఇంకో వంక దివ్యాస్త్రాలను దిగదుడుపతీస్తూ, చంప మనసురాక, రణ విముఖుణ్ణి చేయాలని ఆ దివ్య మూర్తి యత్నించాడు.

పగగొన్న పాములవలె పైపైకి వస్తూ, మర్మ భేదకాలైన మార్గణాలను పరపుతూ వెంబడించి అక్షయుడు హింసిస్తుంటే హనుమ అంతకంతకు సహనం కోల్పోసాగాడు. అతని అస్త్రాలకు అందకుండా అంబరానికి లంఘించాడు. ఆ వేగానికి అక్షయుని రథం సుడి గాలిలో పగుడాకు వలె కొంత పైకి లేచి వెంటనే భూమిపై కూల పడింది. అది దివ్య రథం కనుక ఛిన్నాభిన్నం కాలేదు. మరుక్షణంలో మనో వేగంతో అరదాన్ని అంబరానికి ఎగిరించి బాణత్రయాన్ని హనుమ బాహువుల్లో బలంగా నాటాడు. ఆ బాధలోనే మహా కపి "అహో! ఈ కుమారుని చూస్తే ముద్దు వస్తుంది. వయసులో చిన్నైనా సంగరంలో శత్రుభయంకరుడు. బాల సూర్యుడంటే అతనిపట్ల అది ఒక ఉపమానం మాత్రమే. ఈతడు ఓడి రణ విముఖుడు కావటం ప్రాణాలుండగా జరిగేపని కాదు. పెదాస్. ఈ పుత్రుని కన్నతల్లి నిజంగా ధన్యురాలు. ఈతని యుద్ధ నైపుణ్యం దేవతలకే నుతిపాత్రం. అప్సరఃకాంతలు ఆలపించే వీర గీతాలలో నాయకుడు వీడే కావచ్చు. ఇటువంటి వాణ్ణి చంపటానికి చేతులూ, సంకల్పానికి మనస్సూ సుముఖంగా లేవు. నన్ను నిశితంగా పరీక్షిస్తాడు. నా ఎదుట నిర్భయంగా నిలుస్తాడు. తెంపూ, పెంపూ అంతకంతకు అధికం కాగా, మిక్కిలి నేర్పూ, ఓర్పూ, తీర్పూ, ఈసూ ముప్పిరిగా పెనగొని దుర్వారమైన ఇషువులు ప్రయోగించి హింసిస్తాడు. మక్కువతో ఉపేక్షిస్తే మానప్రాణాలనే మంటగలిపేస్థితిలో వున్నాడు. భండనంలో సురకోటుల గుండెలు ఈతని అభంగపరాక్రమవేగానికి పిండిపిండిగా అయినవంటే అతిశయోక్తులు కావు. ఈబాల వీరుని కోదండ విజృంభణం, భుజదర్ప

సమగ్రత, కామగమనం, ఖండింపకపోతే, భూమండలంకాదు ఆఖండల మండలంకూడా తలపుమాత్రనే దగ్ధంచేస్తాడు. అగ్ని ప్రజ్వలిస్తూ పైపడుతుంటే ఉపేక్షతో ఊరకుంటామా? పాము పగపట్టికాటు వేయ వస్తే "నీపనికానిచ్చి వెళ్ళిపో" అని కనికరం చూపుతామా? ఈ అప్పృత వీరబాలుకు అన్నివిధాలా అంతటివాడు కనుక ప్రతికృతి చేయకతప్పదు" అని భావిస్తూనే, ఆత్మదేహాన్ని అధికంగా పెంచాడు. అక్షయుణ్ణే చంప నిశ్చయించాడు. రథస్థుడైవున్నంత వరకు అజయ్యుడని తలంచాడు. రథం దివ్యంకనుక భేదింపసాధ్యం కాదనుకున్నాడు. వేగవంతాలై, ఆకాశసంచారానికి అర్హంగావున్న హయాలను కూలిస్తే, అరదం నేల కూలుతుందని నిశ్చయించాడు. వాయువు వేణువనంలో చొచ్చినట్లు గమనఘోషతో అక్షయుని రథంలో ప్రవేశించటం, హయచయాన్ని అంతమొందించటం పూర్తిచేశాడు

వెంటనే ఇంద్రవజ్రాహతి పక్షాలు తెగిపడిన పర్వతంలాగా కుమారుని రథం నేలకూలింది. ఆ పాటునకు అక్షయకుమారుడు అణుమాత్రం అలజడి పొందక, మహాత్ములు యోగశక్తిచే శరీరం వదలి స్వర్గంచేరిన విధంగా, చేత ఖడ్గంధరించి చప్పున ఉప్పరానికి కుప్పించాడు. అంబరంలో పరిభ్రమిస్తున్న హనుమను ఖరకరవాల ప్రహరణాలతో కఠినంగా బాధించాడు. అంతలో మారుతి క్రుద్ధుడై ఆ బాలుని రెండుపాదాలు పట్టుకుని, గరుడుడు పన్నగాన్ని విదిలించినట్లు, విదిలించి విదిలించి, గిర్రున త్రిప్పి భూమికి గురిచేసి విసరికొట్టాడు. పుడమిపడిన వీడునిపై బడి బలంగా ముష్టిఘాతంతో తలబ్రద్దలుకొట్టాడు. కండలూ, నెత్తురూ, ఎముకలూ ధారుణి కప్పగా, తండ్రి గుండెలు తల్లడిల్లగా, దేవతల గుండెలు తేలికపడగా అసురపతి పుత్రుడు, అక్షయకుమారుడు పౌరుషానికి చిహ్నంగా, ప్రధనరంగంలో శాశ్వతంగా శయనించాడు. ఇంద్రాదిదేవతలు, అగస్త్యాది మహాత్ములు, రంభాది అప్సరోవనితలు, నారదాది దేవగాయకులు హనుమంతుని పరమాద్భుత కృత్యానికి పరవశించి, అభినందించి, ఆనందించారు. వీరుడై మరణించిన అక్షయునిపై అమరలోకం విరులవాన కురిసింది. ఆ వికట విషాదదృశ్యానికి వీరాంజనేయుడు విచారంపొందుతూ, తిరిగి తోరణాగ్రస్థానానికి చేరుకున్నాడు.

పావని ప్రదర్శించిన పరాక్రమానికి పవనుడు సర్వోపశమనార్థం ఓషధీ శక్తి సంకలితుడై, కుసుమపరాగ వాసనాభరితుడై, సముద్రా భంగతరంగ ఫేనసీ కరహస్తుడై అమగుబిద్దను ఆలింగనం చేసుకున్నాడు. ఆ శీతల వాత సంస్పర్శతో హనుమ శరీరం పూర్వస్థితి పొందింది.

## రావణుడు ఇంద్రజిత్తును హనుమపైకి పంపుట

తన పుత్రుని విజయం వాయువు దిగ్వలయం నింపిందేమో. రావణాంతఃపురం అంతా శోకదవానలం చుట్టుముట్టింది. లంకానగరం నిస్తేజమైంది. హనుమంతుని పరాక్రమానికి అసురమంత్రి సేనావారం అట్టుడికినట్లయింది. అంతలో హతశేషులు ఆర్తనాదంతో అక్షయుని మరణవార్త, సర్వసైన్యక్షయం పౌలస్త్యునికి నివేదించారు. అక్షయ పరాక్రముడై, అజయ్యుడైన ఆత్మపుత్రుని మరణం అసురపతి ధైర్య కంచుకాన్ని తగులపెట్టింది. ఆలోచన గహనాన్ని ఆహరించింది. అప జయం అంటే తెలియని తనవారు, గుండెలు తీసిన ఛందనపీడలు ఒకరి తర్వాత ఒకరుగా నేలకు ఒరిగారు. సద్యఃఫలితంగా సమీపంలో ఆసనస్థుడైన ఇంద్రజిత్తు, ప్రవాహంలో కొట్టుకునిపోతున్న ప్రాణికి ఆధారందొరికినట్లుగా కనుపించాడు. తేరుకున్నాడు. తెలివితెచ్చుకున్నాడు. కొడుకును సన్నిధికి పిల్చాడు. రోషారుణిత లోచనాలతో, ఆత్మజుని అవలోకించాడు. "నాయనా! ఇంద్రజిత్తూ! ఎవడో వానరుడు లంకలోకి ధూమకేతువుగా వచ్చాడు. అశోకవనం నాశనంచేశాడు. సుందర హర్మ్య బృందాలను నేలమట్టం కావించాడు. కింకరులను, జంబుమాలిని, చైత్య పాలకులను, నీ తమ్ముని అక్షయకుమారుని పొట్టబెట్టుకున్నాడు. ఇక ఉపే క్షకుకానీ, సహనానికికానీ తావులేదు. పరిస్థితి విషమించింది. నీవు అస్త్ర విద్యా విశారదుడవు. నీవు సమస్త నిర్జరావళివ్యసనప్రదాతవు. ఈ సంగతి లోకాలన్నిటికీతెలుసు. నీ అస్త్రవిద్యాపాండిత్యం, భుజాబలం అరివీర భయంకరమైంది. నీవు తపంలో ధాతనుమెప్పించి అనేకములైన దివ్యా స్త్రాలను పొందావు. ఇదంతా లోకానికి, దేవతలకు ఇంతకు పూర్వమే విస్పష్టమైంది. ఇప్పుడు నేను ప్రత్యేకంగా పేర్కొనవలసిన పని లేదు. నీవు ధనుర్ధారివై రణరంగంలో నిలిస్తే ఎదిరించి నిలిచే వీరుడు

ఇప్పటి సృష్టిలో లేడు. సమస్తలోకాలకు ఇంద్రుడు నేత. ఆ ఇంద్రుడు నీచేత విజితుడు. అంటే విశ్వంలో విజయుడెవడంటే నాపుత్రకుడు మేఘనాథుడొక్కడే. నీపూర్వనామం మరుగుపడి "ఇంద్రజి" త్తని ప్రఖ్యాతంగా నిలిచి నీపరాక్రమాన్ని, యశస్సును తెలపటమే ఇందుకునిదర్శనం. మాయామార్గంలో నీకునీవేసాటి. నీవు తలచుకుంటే సాధింపరానికార్యం జగత్త్రితయంలోలేదు. నీవు సమరాంగణంలో సంపాదింపలేని విజయం లేదు. నన్ను తెలియనివారున్నారేమోకాని నిన్నెరుంగనివారు లోకంలో లేనేలేరు. తపంలోకాని, శౌర్యంలోకాని, సాహసంలోకాని, ధారణ మారణ దివ్యాస్త్ర బలంలోకాని, శక్తిలోకాని, మేధా విభవంలోకాని నాకు నీవు ప్రతిరూపు. నీవు యథార్థ విజయుడవు కనుక నేను ఎల్లప్పుడూ హాయిగా నిన్ను చూచుకుని సుఖిస్తున్నాను. యుద్ధంలో నిన్ను గెలిచినవాడూ, నీ శరాసన నిర్గత బాణాహతి తల్లాడనివాడూ, ఇప్పటికిలేడు. నీవు దేశకాల పాత్రాదుల తెలిసి ప్రవర్తించే దిట్టవు. కాల కింకరులవంటి కింకరులు, ధిక్కృత వనమాలి జంబుమాలి, నిర్జిత శాత్రవులు అమాత్యపుత్రులు, దుర్ధర వ్యూహ పంచకం సేనాపతి పంచకం, అరి లోక భీకరుడు అక్షయకుమారుడు ఆ వానరునిచే సకల సైన్య సమేతంగా హతులైనారు. నాకు నీ యందు విశ్వాసం పూర్ణంగా వుంది. అందుకే నీ కీ పని అప్పచెప్పటం. నీ బలాన్ని, వైరి బలాన్ని చింతించి, తగిన విధంగా వ్యూహం పన్ని తత్క్షణం కార్యం సాధించు. నా మనశ్శల్యం పెకలించు. తమ్ముని మరణానికి ప్రతీకారం ప్రయోగించు. అసుర లోకానికి అక్షయ యశస్సు సంపాదించు. నీపై నాకుగల నమ్మకాన్ని మరొకసారి వృద్ధి పొందించు. సేనంతా వానరునిచే చావక ముందే వాణ్ణి హతమార్చు. ఇప్పటికే ఆ మాయా భూతంచేత అసమాన పరాక్రమ సంపన్నులైన అసుర వీరులు అపార సైన్యంతో హతులయినారు. నీవు ఆ వానరుని తాకే ముందు, వాడి శక్తి, నీ శక్తి ముందుగా గుర్తించు. ఇప్పటి యుద్ధ క్రమం పరిశీలిస్తే సేన ఎంత వున్నా వాహినీపతుల రక్షించలేదనీ, అతనితో దూరం నుంచికాక బాహా బాహి, ముష్టాముష్టి పోరాడి జయించలేరనీ స్పష్టమయింది. అందుచేత నీవు వజ్రాది సాధనాలతోగానీ, ముష్టి ప్రహరణాలతోగానీ యుద్ధానికి తలపడవద్దు. ఎంతవరకు అస్త్ర ప్రయో

గంతోనే అని చేయి. దివ్యాస్త్రాలను మాత్రమే ఉపయోగించు. మనస్సూ, దృష్టి, మార్గణపాతం ఏక లక్ష్యంగా ఆహవం చేయి. ఇంకా నీకు ఉచితమైన మార్గాలు ఏవైనా స్ఫురిస్తే ఆ విధంగా చేయి. నీవు చిన్నవాడవు. ఆలం చేయటానికి పంపటం అంత మంచి పని కాదు. ఆ సంగతి నాకు తెలుసు. అయినా క్షత్ర నీతి ప్రకారం బాంధవ్య భావాలు గమనించక నిన్ను పంపుతున్నాను. విషయం నీ ముందుంచాను. విజయం నీ తలపై ఉంచాను. జయలక్ష్మీ కరగ్రహణంతో తిరిగిరా. వెనుకటి వాళ్లు చేసినట్లు స్వపర బల తారతమ్యం తెలియకుండా తలపడవద్దు. నీకు జయం తథ్యం. సంతోషంతో పోయిరా" అంటూ ఆదేశించాడు. జనక హృదయం గ్రహించిన పుత్రుడు చాపం అంటి ప్రమాణం చేశాడు. "వికట వానరుడు మీ సమక్షంలో విధేయుడై నిలుస్తాడు. మీ పుత్రుడు వాచాటుడుకాక క్రియాదక్షుడని మీకు తెలుసుకదా" అని పలికి సెలవు తీసుకున్నాడు.

## ఇంద్రజిత్తు హనుమంతుని పైకి యుద్ధానికి పోవుట

అసుర పతికి అక్షయ కుమారాది శత్రు భయంకర వీర మరణంతో అడుగంటిన ఆశాలత పునః పుష్పితమైంది. ఇంద్రజిత్తు విజయంతో ఇంటికి వస్తాడని విశ్వాసం కుదిరింది. తరిగిన ధైర్యం పుంజుకుంది. జనకుడు సమయోచితంగాపల్కిన పల్కులకు ఇంద్రజిత్తు సంతోషించాడు. బహుకాలానికి తనకు అస్త్ర విద్యా ప్రదర్శనానికి అనుకూల కాలం వచ్చినందుకు ఆనందించాడు. భక్తి గౌరవ పురస్కృతంగా తండ్రికి ప్రదక్షిణించి ఆశీస్సులు పొందాడు. సౌధానికి విజయం చేశాడు. తన సైన్యాధిపతికి సమర సన్నాహం చేయుమని ముదల ఇచ్చాడు. సారథిని రథం ఆయత్తపరచికొని రమ్మని ఆదేశం పంపాడు. స్నాతుడై వచ్చాడు. అస్త్ర దేవతలను అర్చించి ఆవాహనం చేశాడు. బంధుమిత్రామాత్యుల ప్రణతి సత్కారాలు పొందాడు. జయభేరి మ్రోయించాడు. పర్వ సమయంలో పారావారంలాగా పొంగే సైన్యం పరివేష్టించి రాగా, గరుత్మంతుని వేగాన్ని కాదనే హయాలు పూన్చిన స్యందనం ఆరోహించాడు. దర్శన మాత్ర వైరి మనః కవాట విపాటన దక్షమైన ధనువును పాణి పల్లవంలో బంధించాడు. మాయా విద్యాధి దేవతను మనసు లోపల ధ్యానించాడు.

శంఖం పూరించి "జయ లంకేశ పతికి" అంటూ అనుజ్ఞ ఇచ్చాడు. సచైతన్యమై కులాచలాలు కూడి వచ్చినట్లు, అష్టదిగ్గజాలు అవనిలో తిరుగాడ వచ్చినట్లు, సప్తపాథోధులు సకల ధాత్రీ చక్రం ముంచ దలచినట్లు ఇంద్రజిత్తు సేనావారం హనుమపైకి అశోకవనాభి ముఖంగా పయనించింది. కల్పాంత సమయ పుష్కలావర్త మేఘ నిర్ఘోషంలాగా వెలువడుతున్న శంఖారావం, రథ గమన ఘోషం, రాక్షస వీర కంఠ స్వరం తోరణాగ్రంపై నిలిచిన లోకమూకగమిమేటి విన్నాడు. తనువు పొంగింది. వాలం ధూమకేతువులాగా రివ్వున పైకి పైకి లేచి శిరస్సమీపంగా వంకరగా వంగింది. కంఠం అశనిపాత సహస్ర ఘోషణ భీషణంగా ఆర్భటించింది. హనుమ ధరించిన అప్పటి రూపం, హనుమ చేసిన అప్పటి కంఠారావం ఇతఃపూర్వం దేవతలు కనలేదు. వినలేదు. వ్యోమసంచారులైన త్రింశత్కోటి త్రిదశులు, మహా తపస్సంపన్నులైన మహర్షులు ఆ జరగబోయే ఆహవాన్ని తిలకించటానికి ఆకాశ పథంలో విమానాలపై వేంచేసి పరస్పర యుద్ధ విజయ వాంఛాసక్తులైన హనుమదింద్రజిత్తులను హర్షామోదాలతో అభినందించారు.

రోచన భీకర చాప హస్తుడై, దారుణ దివ్య శాత శిలీముఖ ధారియై, బలోద్ధతితో శత్రువుపైకి నడుస్తున్న ఇంద్రజిత్తుని కాంచి క్రూరసత్త్వాలు భయంకరంగా కూయసాగినై. దిక్కులన్నీ తెల్లబారినై. మింటికెగసి విహంగకులం వింత వింతగా అరచింది. హనుమకు అభిముఖంగా నడచిన ఇంద్రజిత్తు జ్యాటంకార విపాటితాపుడై నిర్నిద్ర విక్రమాటోపంతో బాణవర్షం కురుస్తూ వానరవీరుణ్ణి ఎదుర్కొన్నాడు. మారుతి ఉత్పటవైరి భీతికర గర్జాస్ఫోటి తోక్ష్వేంద్రుడై, నిజవేగోద్ధూత జీమూతుడై, ఉర్వీతలం ఊటాడంగా తలపడ్డాడు. వివివడి ఇరువురూ ఒకరినిమించి ఒకరు పోరు ఘోరంగా చేస్తున్నారు. దేవ దానవ యుద్ధాన్ని మరపిస్తూ వీరయుగళం సమరం సల్పుతుంటే జయలక్ష్మి పుష్ప మాలాలంకృత పాణిపల్లవయై మధ్యలో నిల్చి వీక్షించసాగింది. ఎడతెరిపిలేక ఇంద్రజి ప్రయోగించే బాణ పరంపరను నిలువరించి, శరీరం ఇంకా పెంచి వాయుపథానికి లంఘించి, ఆ శరవృష్టికి అందకుండా పావని సంచరించసాగాడు. ఇంద్రజిత్తు హనుమ యుద్ధ

కౌశలానికి అద్భుతపడ్డాడు. రథికులే, దివ్యాస్త్ర సంపన్నులే తనతో నిల్చి పోరలేరు. పదాతి, వానరుడు ఇంతవరకు తన శరాలకు లొంగలేదంటే తల తిరిగినట్లయింది. ఏ స్థితిలోనూ లక్ష్యం తప్పని వాడి బాణాలు సూటిగా వాయుపుత్రుని దేహంపై నాటాడు. వాటిని చెరకుగడపట్టి విరిచినట్లు విరిచి విసరివేశాడు. మేఘనాథుడు భేరీ పటహధ్వంకారాలు శ్రవణ బధిరీకృతంకాగా పావనిపై తీవ్ర శరవర్షణి చేసి అరచాడు. క్షిప్రహస్తుడై ప్రయోగిస్తున్న ఇంద్రజిత్తు శిలీముఖాల మధ్య సంచారం చేస్తూ, నడుమ నడుమ ఎదురై నిలుస్తూ, మింటికెగురుతూ, పైనపడుతూ చేతులు శరాలకు అడ్డంపెడుతూ హనుమ చిత్ర విచిత్రంగా, సవ్యాప సవ్యంగా, అసుర నాయకుని అస్త్రవిద్యాకౌశలం, లక్ష్యం వ్యర్థంచేసి సింహనాదం చేశాడు. అసురేశ్వర వాయునందనులు మత్తమాతంగాలు, మదకంఠీరవాలు పోరుతున్నట్లు పోరుతుంటే, ఏకాకియై ఎదిరించి నిల్చి, నిరాయుధుడై శత్రువును చికాకుపరుస్తున్న ఆంజనేయుని చూచి అమరులు సిగ్గుపడ్డారు. "అమృతపానం చేసి, అజేయులమై, కామవిద్యాశ్రేష్ఠులమై, బహురూప గ్రహణశక్తి సంపన్నులమై యుద్ధంలో ఓడి "ఇంద్రజిత్తు" అని బిరుదు ప్రసాదించి సంధిచేసుకున్నాం. అహో! పావని వంటివాడు పుట్టలేదు. ఇక పుట్టడు" అంటూ స్తోత్రంచేశారు. ఆ యుద్ధంలో హనుమ బలం అసుర పతి సుతునకూ, అతని బలం హనుమకూ ప్రకటితం కాలేదు. ఎన్నడూ వ్యర్థంకాని తన దివ్యాస్త్రాలు మహాయోగ సమాధినిష్ఠుడై పోరుతున్న హనుమపై వ్యర్థం కావటంచూచి, లోలోపల ఇంద్రజి విచారంపొందాడు.

## ఇంద్రజిత్తు హనుమను బ్రహ్మాస్త్రంతో బంధించుట

"ఇంతవరకు నా శరలక్ష్యం తప్పుకుంటూ ప్రత్యక్షిపోతున్నాడే కాని, ప్రతీకార ప్రయత్నం చేయటంలేదు. నా శక్తిసామర్థ్యాలూ, నా అస్త్రవిద్యా రహస్యాలూ, నా దివ్య శరాలూ పరీక్షిస్తూ ప్రతిహతం కావించటమే తలంపుగా పెట్టుకున్నందున, ఆ మహా కపి తన బలం పట్టివ్వటం లేదు. ఇలా ఎంతకాలం పోరినా ఈతని జయించటం సాధ్యం కాదు. ఒక్కొక్కప్పుడు అతని చూస్తే, నన్నూ, నారథాన్నీ, నా సైన్యాన్నీ ఆపోశనం పట్టగల సమర్థుడన్నట్లు

కనపడతాడు. ఒక్కొక్కప్పుడు ఇంత మహాకాయం వుండి కూడ అవ్యవధిగా నేను కురిసే దివ్యాస్త్రాలకు అందకుండా ఆ మధ్యలో తిరిగి శరీరానికి తాకకుండా చేసుకుంటాడు. ఎలా అది సాధ్యమో మాయామర్మ విదుడనైన నాకే బోధపడకుండా వుంది. పోనీ, గతి మార్చి మాయా యుద్ధం చేస్తామనుకుంటే ఈ మాయావిపట్ల ఆ ఆటలు సాగేట్లు లేవు. ఇంత శక్తి కలవాడు కాబట్టే అంతక సన్నిభులైన అక్షయకుమారాది వీరులను బలిగా గ్రహించాడు" అని రావణి ఆలోచించసాగాడు. "ఎంత యత్నించినా దరికి రాకుండా శర పంజరం నిర్మిస్తున్న ఈతని అస్త్ర విద్య ప్రశంసింప దగియున్నది. దివ్య కాయుడనూ, దేవతా ప్రసాదిత వరబల సంపన్నుడనూ, చిరాయుష్మంతుడనూ, వాయువేగ మనోవేగశక్తి సంభరితుడనూ, సీతా రామానుగ్రహ పాత్రుడనూ కనుక ఇంత కాలం ప్రతి ద్వంద్విగా నిల్చాను. వేరొకడైతే ఈపాటికి ఎప్పుడో యమాలయం చేరుకునేవాడు. ఈ లంకా నగరంలో ఈతడే తన మానికం అనుకుంటా. రావణుడు తాను రావలసిన అవసరంలో ఇతని సంపాదంటే, ఇతనికి మించిన వీరులు లేరన్నమాట. ఈతని వధించి పోవటం అనుకున్నంత సులభంకాదు. దివ్యాస్త్ర సంపన్నుడు. ఒడలంతా కన్నులుగా వున్నాడు. ఒకవేళ కార్యం సాధిస్తే రావణునితోనే తలపడవలసి రావచ్చు. అది నే చేయతగిన పనికాదు. కాలాతి క్రమణంతో ఎన్నో అనూహ్య పరిణామాలు రావచ్చు. త్వరలో కార్యం ముగించుకుని తరలిపోయి, శేషించిన కార్యానికి అంకురారోపణం చేయిస్తాను ఈతనికి లొంగిపోతాను. పంక్తి కంఠునితో భాషిస్తాను" అని వితర్కించాడు హనుమంతుడు. ఈ విధంగా ఒకరి శక్తి ఒకరు గ్రహించే యత్నం చేసి విఫలులైనారు. ఇంద్రజిత్తు మాత్రం తన దివ్య బాణాలు చేయవలసినంత పని చేయలేక పోవటం, శరీరాన్ని తాకి కూడా భేదించలేకపోవటం చూచి అంత రంగంలో అపజయాన్ని శంకించాడు. అయినా అధైర్యం పొందలేదు. "ఇంకా ఈ విధంగా యుద్ధం చేస్తే తన సైన్యం సర్వనాశనం అవటం, తనకు అపకీర్తి రావటం తథ్యం" అని తలపోశాడు. వెంటనే బ్రహ్మాస్త్రాన్ని భావించాడు. ధనుర్గుణంలో సంధించాడు. పవమాన పుత్రునిపై ప్రయోగించాడు. అంబరచరుడై, స్వేచ్ఛా విహారం చేస్తూ, శత్రు క్షయా

నిశ్చై ఆలోచిస్తున్న హనుమ శరీరం మంత్రబద్ధ పన్నగంవలె బంధింపబడింది. నిశ్చేష్టుడై సోలిపోయాడు. అణువణువూ ప్రకాశించే దీపం పై పాత్ర బోర్లించినట్లు లోలోపల కుంచించుకొనసాగింది. వెంటనే కారణం తెలుసుకున్నాడు. "ఎప్పుడైనా ఒకసారి మాత్రం బ్రహ్మాస్త్రానికి లొంగవలసి వుంటుందనీ, అది నీ ఇష్టానుసారం చేయవచ్చనీ విధాత ఇచ్చిన వరం గుర్తు తెచ్చుకున్నాడు. "ఆ పితామహుని ఆనతి ఇప్పుడే పాటిస్తాను. ముందు జరిగే మహా యుద్ధంలో తాను స్వేచ్ఛగా వ్యవహరించవచ్చుననీ, ఈ కారణంగా దైత్యపతి దర్శనం కలుగుతుందనీ, నా తండ్రి వాయువూ, ఇంద్రుడూ, పరమేష్ఠి నన్ను రక్షిస్తుంటే శత్రువులు ఏమీ చేయలేరనీ, ఇది కూడ మన మంచికే వచ్చిందనీ", పితామహుని మనసారా ధ్యానించి స్వాగతించాడు. చైతన్యంలేనివాని వలె చేష్టలుడిగి రాబోయే ఘటనకు ఎదురు చూస్తున్నాడు. ఆ సమీక్షకారి నిజంగానే పితామహాస్త్ర బద్ధుడైనాడని రక్కసులంతా కోలాహలం చేశారు.

## హనుమను త్రాళ్ళగట్టి రాక్షసులు రావణుని వద్దకు కొనిపోవుట

ఇంద్రజిత్తు తాను ప్రయోగించిన బ్రహ్మాస్త్రానికి బంధితుడైనాడనీ, తను వచ్చిన కార్యం తగిన రీతిగా ఫలప్రదం అయిందనీ సంతసించాడు. సంతోషం పట్టలేక సైన్యం గోలచేస్తున్నదని భావించాడు. కాని, త్రాళ్ళతో, చెట్ల నారతో, ఇతంతో కడతారని భావించలేదు. సరిగా అదే జరిగింది. ఆ రాత్రించరులు సర్వ నాశనం చేసిన పాడు కోతి పడిపోయిందని తలచి మళ్ళీ లౌకికంగా పాశాలు తెచ్చి బంధించటంతో పర మంత్ర ప్రయుక్త బంధాలు మాయమయినై. అది తెలిసినా హనుమ వాళ్ళు చేసే వికార చేష్టలకు కట్టుబడి వున్నాడు. బ్రహ్మాస్త్ర పాశ బంధం పైకి కనపించదు. అది తెలియక అసుర సైన్యం అవకతవక పని చేసింది. ఎప్పుడైనా హనుమ గుర్తిస్తే మళ్ళీ ఆ అస్త్రం తోనూనీ, వేరే దానితోగానీ బంధించటం సాధ్యం కాదు. ఇది ఇంద్రజి గ్రహించాడు. "అయ్యో! వీళ్ళు తెలియక ఎంత పాడుపని చేశారు? నా ప్రయత్నమంతా

బూడిదలో పోసిన పన్నీరు లాగా వ్యర్థం చేశారు. ఏ దివ్యాస్త్రానికీ లొంగని శత్రువుపై ఇది తుదిసారిగా ప్రయోగించాలి. ఇది ఉపయోగించిన పిదప మరే అస్త్రం మళ్ళీ ప్రయోగిస్తే పనిచేయదు. ఈ వానరుడు ఇంకా స్మృతిహీనుడైనట్లే కనుపిస్తున్నాడు. ఏం జరిగితే అదే జరుగుతుంది. ఇప్పటి కింతకంటె చేయగలిగింది లేదని చింతించాడు. పట్టుబడి, కట్టబడియున్న పావనిని మొరకు రక్కసులు, కర్రలతో బాదుతూ, పిడికిళ్ళతో గ్రుద్దుతూ, కాళ్ళచే తన్నుతూ, భరించరాని హింసలపాలు గావిస్తూ, మహా మర్కటుణ్ణి ఊరేగింపుగా కువలయ భయంకరుడైన రావణుని కొలువు కూటానికి కొనిపోయారు. సర్వశక్తిమంతుడైనా, స్వామి కార్యార్థం మహా కపి అసుర వికట తాండవాన్ని సహించుకున్నాడు. మొగసాల నున్న కావలి వాళ్ళతో "వచ్చాం విజయంతో. తెచ్చాం కోతిని పట్టుకుని. ప్రభువులకు నివేదించు"మని భటులు పల్కగా, ఆజ్ఞకోసం వాళ్ళు సభలోకి వెళ్ళారు. చూడవచ్చినవాళ్లూ, పట్టి తెచ్చినవాళ్ళూ, కోపావిష్టులై "కొట్టండి, తిట్టండి, కాల్చండి, చంపండి. ఎన్నో కొంపలు కూల్చిన ఈ పాడుకోతి ఇక్కడికి ఎందుకు వచ్చింది? వచ్చినవాడు వచ్చినట్లుపోక అశోకవనం పాడుచేసి, అసుర వీరులనందర్నీ హతంచేశాడు. కడుపుమంటతీర గుటుకున మ్రింగేస్తే పీడ విరగడైపోతుంది" అంటూ నానాదుర్భాషలాడారు. అయినా హనుమ ఆగ్రహం తెచ్చుకోలేదు. అన్నిబాధలతోపాటు ఆ తిట్లూ ఓర్చుకున్నాడు. ఇంతలో రాజాజ్ఞవచ్చింది. "అటుగాదు ఇటురా, ఇటుకాదు అటుపో" అంటూ అంజనాపుత్రుణ్ణి అటుఇటు లాగుతూ, పరిహాసంచేస్తూ పంక్తిముఖుని ఆస్థానంలో ప్రవేశపెట్టారు. చుక్కలచుంబిస్తున్న ఉన్నతాసనంపై, పొడుపుకొండపై తోచే పొడుపులాగా కూర్చుని కొలువు సాగిస్తున్న నిశాచరపతిని విలోకించాడు. మంత్రులు, సేనానాయకులు, చారులు, సోదరులు నిండి నిబిడీకృతమై కన్నులపండువు కావిస్తున్న సభను కలయచూచాడు. ఊహకందని ఉద్రేకం, ఉత్సాహం, ఉప్పొంగివస్తున్న ఉద్విగ్న తేజంతో అతి నిశ్చలంగా నిలిచివున్న హనుమను దశాస్యుడు వింశతినేత్రాలు విస్తృతిపొందగా విలోకించాడు. పరస్పరావలోకనాలు పరిపూర్తి కాగానే పౌలస్త్యుడు సమీపవర్తులైన మంత్రి చమూనాయక

సత్కారశీల వృద్ధమనీషులను కాంచి "ఈతడు ఇక్కడికి ఎందుకు వచ్చాడో, ఏంచేయతలచాడో, ఎందుకు మనతో విరోధం పెట్టుకున్నాడో మొదలైన, ముఖ్యవిషయాలను ప్రశ్నించి తెలుసుకోమని అనుమతిచ్చాడు. అందులో కొందరు హనుమంతుని అనేక ప్రశ్నలువేసి ఉత్తరంకోసం ఆగారు. అందుకు మారుతి సద్బుద్ధితో సంభాషణకుపక్రమించాడు. సభ నిశ్శబ్దమైంది.

## సభలో కొలువున్న రావణుని సామీరి చూచుట

అట్లు తన్ను అనాదరించి ప్రశ్నించిన అసురశ్రేష్ఠులకు అనాదరణ సూచకంగా హనుమ ప్రత్యుత్తరం ఇచ్చాడు. "హరిలోక సార్వభౌముడై, హరిపుత్రుడైన సుగ్రీవుడు పంపగా రామకార్యార్థం దూతగా వచ్చాను" అని క్లుప్తంగా సమాధానం ఇచ్చిన హనుమకు పలయపీడకుడైన కలహోత్కంఠుని పంక్తికంఠుని నిర్లక్ష్యంగా చూచాడు. సప్తసముద్ర సంపాదిత ముక్తామణులచే ధగధగ మెరుస్తున్న హేమ కిరీటం ధరించిన వాణ్ణి, సంకల్ప సంభూత కనకాభరణాంచితమైన దేహం కలవాణ్ణి, బంగారుజరీ పనితనంగల క్షౌమవస్త్రం కట్టినవాణ్ణి. రక్తచందనంపై పూతగా వలపులు క్రుమ్మరిస్తున్నవాణ్ణి, దర్శనీయాలై, సుందరాలై, పెద్దలై, మెరమెరున్న కన్నులు కలవాణ్ణి, మెరసిపోతున్న నునుకోరలతో ప్రేలుతున్న వాతెరగల వదనదశకంతో, సర్వాంగసుందర నగశిఖరానికి సాదృశ్యమైనవాణ్ని, మన్మథస్వాంతానికి మనశ్శల్యమైనవాణ్ని, కాటుక గుట్టలాగా తనువొప్పగా, విశాలవక్షంపై తారహారాలు చెంగలింపగా, నిండు నెలను నవ్వేముఖంతో, బెగ్గురుపక్షుల బారులతోనిండిన నీలాంబుదంవలె నీటుగా వున్నవాణ్ణి, స్ఫాటికరత్న ఖచిత స్వర్ణ పీఠిపై సొంపు వెదజల్లుతున్నవాణ్ణి, అంగద కేయూరాదిక సంగతాలై, పీవరములై, చందన గంధ లిప్తములై పంచ ఫణ ఫణులట్లు తేజరిల్లే భుజాలు కలవాణ్ణి, కంకణ ఝణత్కారం తోరంగా వింజామరలు పూని విసిరే వనరుహాక్షులతోనూ, మంత్రాంగ విశారదులైన మంత్రివర్యులు దుర్ధరుడు, ప్రహస్తుడు నికుంభుడు, మహాపార్శ్వుడు, చతుస్సాగరాలు భువనాన్ని చుట్టుకున్నట్లు చుట్టి సేవింగా, ఇతర మహామాత్యులు ఇంద్రుణ్ణి దేవతలవలె భజిస్తుం

డగా, జలధర జలధరం చుట్టుకున్న మేరు శిఖరాగ్రంలాగా వెలిగిపోతున్న ఆకారంతోనూ, ప్రమోద ప్రమాద ప్రసాద సమర్థాలైన వింశతి నేత్రాలతో ఒప్పారుతున్న రాక్షసేశ్వరుని మూర్తిని పరమ విస్మయంతో పావని వీక్షించాడు. "అహో! ఏమి రూపం? ఏమి బలం? ఏమి ధృతి? ఏమి తేజం? ఏమి రాజసం? ఏమి సమస్త రాజ చిహ్న సంకలనం? అయ్యో! ఈతడు అధర్మ క్రియారంభుడు కాకపోతే, ఇంద్ర యుక్త స్వర్గాన్ని శాశ్వతంగా శాసించక పోయాడా? క్రూరుడై, ఘాతదయాదూరుడై, లోక నిందకు పాలయ్యే పాడు పనులు చేస్తూ లోక కంటకుడెందుకైనాడో? తెలియకుండా వుంది. లోకాలోకాలను కినుక వహించి ఏ కార్యం చేయ తలిస్తే అడ్డుపడే వాడెవ్వడు? ఆక్షేపించే వాడెవ్వడు?" అని సాలోచనుడైనాడు.

## రావణుడు హనుమని చూసి ఆలోచించుట

బందీ కృతుడై కూడ తన ఎదుట భయరహితంగా నిలుచున్న ప్లవగ పుంగవుని పంక్తి ముఖుడు ముహుర్ముహు రాలోకనంతో ముంచి ఎత్తాడు. "ఈతడా అశోకవనం పాడుచేసి, అసుర స్త్రీలను భయపెట్టి అక్షయకుమారాదుల వధించిన వానరాకారుడు? ఏమి గుండె నిబ్బరం? ఎంత వెదకినా ఈతనిలో తబ్బిబ్బు లేదే? నేను కైలాసం పట్టి కదలించిన నాడు శాపం ఇవ్వటానికి సాక్షాత్కరించిన నందీశ్వరుడా? బాణుడా? ఇది ఏమి రూపం? ఈతడు వానర మాత్రుడేనా? వీడు ఇంద్రజిత్తుకి చిక్కటం శక్తి లేక కాదనిపిస్తూంది. ఇందరు మహావీరులు ప్రయోగించిన అస్త్ర శస్త్రాలు నాటినట్లు చిహ్నాలు కూడ లేవే? ఇది లౌకిక శరీరమా? అలౌకిక శరీరమా? యోచించినకొద్దీ ఈతడు కారణజన్ముడుగా కనుపట్టుతున్నాడు. ఇతనికి ఈ లంకలో ప్రవేశం ఎలా కలిగింది?" అని కొంత కాలం చింతించి, సరోష తామ్ర నేత్రుడై, ప్రహస్తుని వంక చూసి, "మంత్రీ! ప్రహస్తా! ఈ దుష్టుడెవ్వడు? ఏ పనికై ఇక్కడకు వచ్చాడు? ఎవ్వరు పంపగా వచ్చాడు? ఉద్యాన భంగం ఎందుకు చేశాడు? రక్ష స్త్రీల ఎందుకు తర్జించాడు? ఎందుకు యుద్ధం చేయవలసి వచ్చింది? ఈ సంగతు లన్నీ కోతి రూపంలో వున్న వెనుకాలాన్ని నీవే అడిగి తెలుసుకో"అని

సెలవిచ్చాడు. ప్రభుని ఆజ్ఞ గొన్న ప్రహస్తుడు తామరాకుపై జల బిందువులాగా అంటీ అంటకున్న ఆంజనాసుతుని వంక తిరిగి "ఓ వానరుడా! విన్నావు కదా మా ప్రభువు నాతో చెప్పిన వాక్యాలు? నీకేమీ భయం లేదు. భద్రం కలుగుగాక. గతం మరచి, కృతం స్మరించి ఊరడిల్లు. చెప్పే సమాధానం అనుమానానికి ఆస్కారం కాకుండా చెప్పు.

## ప్రహస్తుడు ప్లవగ నాయకుని ప్రశ్నించుట

నీ రాకను గూర్చి నిజం మాత్రమే మాకు తెలుపు. అబద్ధం చెపితే అనంతర పరిణామం నీవు అనుభవించక తప్పదు. సరిగా చెప్పి మా శిక్ష నుంచి విముక్తుడవై గమ్య స్థానానికి తిరిగిపో. లేనిపోని కథలు, గాథలు కల్పించి చెప్పి కఠిన దండనలకు గురికాకు. లంకలో ప్రవేశించి, మా లక్ష్యానికి అంది, మా అనుగ్రహం పొందక ప్రాణంతో భద్రంగా బయట పడటం నీకు సాధ్యం కాదు. విష్ణు ఇంద్రుడు మా పైకి పంపాడా? పాత పగ మనసులో ఉంచుకుని కుబేరుడు దూతగా పంపితే ఇక్కడకు వచ్చావా? యమ వరుణుల మాటపై మా లంకా నగరంలో ప్రవేశించావా? వీకై నీవే వచ్చావా? నీ అసమాన తేజం, బలం చూస్తుంటే అసుర కుల వధార్థం అమరనాథుడు పంపితే వచ్చినట్లు మాకు అనుమానం కలుగుతూంది. నీవు రూపం చేతనే వానరుడవు కాని, చేతలందు మాత్రం నర, సుర, దానవులకు సిగ్గు కల్పిస్తావని చెప్పకుండానే మేం గ్రహించాం. ఇంతవరకు మేం సామంగానే ప్రవర్తించాం. నీవు చేసిన క్రూర కర్మకు విచారణ లేకుండా మరణ దండనం విధించవచ్చు. మా ప్రభువు దయామూర్తి. తన ఆత్మీయులు నీ చేత నిహతులైనా ఓర్మి వహించి సమక్షానికి రప్పించారు. ఇక్కడ న్యాయం జరుగుతుంది. కాని అన్యాయం జరగదు" అని యుక్తి యుక్తంగా ప్రశ్నించి ఆసనాసీనుడయ్యాడు.

## అసురేశ్వరునకు హనుమ తన వృత్తాంతం తెలుపుట

ప్రహస్తుని ప్రసంగం విన్న పావని రావణుని లక్షిస్తూ, "ఓ లంకేశ్వరా! నీ మంత్రి ముఖంగా నీవు వినతలచి అడిగించిన ప్రశ్నలకు

సమాధానం చెపుతున్నాను. నేను సత్యం చెప్పటానికే వచ్చాను. అసత్యంతో నాకవసరంలేదు. ఇంద్రుడూ, యమ వరుణులూ, కుబేరుడూ పంపితే నేను రాలేదు. వారితో నాకు చెలిమిలేదు. వారెవ్వరో నాకు తెలియదు. నన్ను విష్ణువు పంపలేదు. నా జాతి లక్షణంగా ఇదే. నేను వానరుడనే. రాజ దర్శనమే లోకంలో దుర్లభం. అందులో లంకేశ్వరుడవైన నిన్ను చూడటం దుర్లభాతి దుర్లభం. నేను వచ్చినపని స్వయంగా నీకే చెప్పాలనుకున్నాను. నీ సమ్ముఖానికి రావటానికే అశోకవనం విధ్వంసం చేశాను. ఆ కారణంగా నన్ను పిలిపిస్తావనుకున్నాను. అందుకు భిన్నంగా యుద్ధకాంక్షతో నీ వారంతా వచ్చారు. ఆత్మరక్షణకోసం వధరం పలిపాను కాని ఎవ్వరినీ చంపాలనికాదు. నాకా అవసరం మీ యుద్ధ వీరులు కల్పించారు. అందుకు ఫలంగా హతులైనారు. ఇందులో నేను బుద్ధిపూర్వకంగా పాల్గొనలేదు. ఇందాక నీవు పేర్కొన్న ఇంద్రాది దేవతలుకూడ సంగరంలో నన్ను జయించలేరు. పాశబద్ధుని అసలే చేయలేరు. నీ కుమారుడు నన్ను జయించలేక బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. అది నాయిష్టంలేక బంధించదు. దేవతలచే, బ్రహ్మచే చావు లేని వరం సంపాదించాను. అస్త్రశస్త్రాలు నామీద పనిచేయలేవు. నేనే నిన్ను చూడాలనీ, నీకు కొన్ని సంగతులు ముఖాముఖి చెప్పాలనీ, ఐచ్ఛికంగా కట్టుబడ్డాను. మీవాళ్ళు ఇతర పాశాలతో నన్ను బంధించినపుడే పితామహాస్త్ర ప్రభావం తనంతతానే ఉపసంహరించుకుంది. విషయం తెలిసిన నీ పుత్రుడు విధిలేక ఊరకున్నాడు. నీతో నాకు ఒక రాచకార్యం వుంది. నేను పాశబద్ధుడనైనా స్వేచ్ఛాజీవినని ఎరిగి, నా చెప్పేవాక్యాలు శ్రద్ధగా విను.

## హనుమ రావణునకు తాను వచ్చిన కార్యం వివరించుట

నేను రవిపుత్రుడైన సుగ్రీవుని ఆజ్ఞకొనివచ్చాను. నీకు సోదర సదృశుడైన మావిలిక నీ కుశలం గూర్చి ప్రశ్నించి తెలుసుకోమన్నాడు. నీ తమ్ముడు చెప్పిన హితవు నీకు ఇహపరసాధనం అని విశ్వసించు. మర్త్యలోకంలో దశరథుడనే మహీపతి చతురంగబల సమృద్ధి కలవాడై

ధర్మంగా పాలిస్తున్నాడు. ఆయన పెద్దకొడుకు సర్వజనమనోభిరాముడు. పేరు శ్రీరాముడు. ఆయన జనకుని సత్యవ్రతునిగా చేయ సంకల్పించి, భార్యా సోదరులతో దండకారణ్యం వనవాసం నిమిత్తం వచ్చాడు. కొన్ని ఇతర కారణాలవల్ల ఆయన సతి అపహృత అయింది. ఆమెను అన్వేషిస్తూ ఋశ్యమూక పర్వతం చేరుకున్నాడు. ఆ సమయంలో రామ చంద్రునకూ, రవిపుత్రునకూ అగ్నిసాక్షిగా చెలిమి సిద్ధించింది. మిత్రుని బాధానివృత్తికోసం, నీకు బాగా తెలిసిన వాలిని ఒక్కబాణంతో నేల కూల్చి కిష్కింధా నగరం ధారపోశాడు. మిత్రుడు చేసిన ఉపకృతికి ప్రత్యుపకృతిగా సీతాన్వేషణార్థం అప్పుదన్యర్బుద సంఖ్యలో వానర వీరు లను అన్ని దిక్కులకూ పంపాడు. వారంతా గరుడానిల సమవేగులు. కామరూపధారులు. గగనచరులు. వారిలో నేను ఒక వానరుణ్ణి. మారుతు నకు ఔరసుడను. హనుమంతుడనే పేరుగలవాణ్ని. జానకమ్మను వెదకుతూ నీ లంకానగరం ప్రవేశించాను. నా రహస్యాన్వేషణలో నీ పురంలోనే ఆమె దర్శనం లభించింది. దుస్తరమైన శతయోజన విస్తీర్ణా యత సాగరం తరించి వచ్చిన ఫలం నాకు దొరికింది. ఆమె ఇక్కడ వున్నందున అధిపతివైన నిన్ను కలిసి కొన్ని సంగతులు చెప్పిపోదా మని తలంచాను. అందుకు కారణంగా అశోకవనచ్ఛేదం చేయటం జరి గింది. అనుకున్న ప్రకారం నీ సముఖానికి కొనిరాబడ్డాను. నేను చెప్పదల చిన నాల్గుమాటలు నీకు చెప్పి తిరిగి పోతాను. ఇప్పటికి ఇంతే నా కార్య క్రమం. ఇకపై నీవు తీసుకునే చర్యలను పట్టి చేయవలసిందేదో నిర్ణ యించుకుంటాను. నేను సంక్షిప్తంగా చెప్పిందంతా సత్యమేకాని అసత్యం లేదు.

## హనుమ పౌలస్త్యునకు బుద్ధులు చెప్పుట

ఓ లంకేశ్వరా! నీవు వేదాన్ని పారం ముట్టావు. శాస్త్ర బద్ధంగా సర్వ ధర్మాలు గ్రహించావు. ఎన్నడూ ఎవ్వరూ చేయని ఘోర తపం చేశావు. పరమేష్ఠిని మెప్పించావు. పడయరాని అమోఘవరాలు పడశావు. విజిగీషతో లోకాలను గెల్చావు. దేవాసురులను బంట్లుగా పనిగొన్నావు. అతిలోక వీరుడవనిపించుకున్నావు. ఇది లోకం మెచ్చింది. నాకూ

నచ్చింది. అనన్యలూ, పతి శరణ్యలూ అయిన ఆడువారిపై దురాచారానికి దిగటం నీకు ఏమి న్యాయం? నీ అంతఃపురం చూచాను. అనుకూలవతులైన అందగత్తెలు ఎందరో నిన్ను వరించి వచ్చారు. సాక్షాత్ పార్వతివంటి మహా పతివ్రత, సాధ్వీమణి నీకు ఇల్లాలుగా వుంది. ఇటువంటి నీవు ఏం ఆశించి రామ పత్నిని ఇక్కడ వుంచావు? సమూల వినాశన హేతువూ, నిరంతరాపదాస్పద కారణం, ధర్మ దూరం అయిన ఈ కార్యం నీ వంటి ప్రాజ్ఞుడు చేయ తగిందేనా? నేను రాత్రి నీవు రావటం చూచాను. నీ అభీష్టం, ఆమె అనిష్టం తెలుసుకున్నాను. మగనాలిని మాయతో కొనివచ్చి మనసు తిప్పుకోతలచిన నీవు ధర్మదండం ధరించి న్యాయాన్ని, నీతిని కాపాడే ప్రభువుగా ఉండటానికి అర్హుడవెలా అవుతావు? ఆమెను సామాన్య మానవిగా భావించావు. ఆమె భర్తనూ, మరదినీ కేవలం మానవ క్షత్రియులుగానే మనసులో తలంచావు. కాని, నీ నగరం, నీవు సబాంధవంగా ఇంతవరకు క్షేమంగా ఎందుకు వున్నారో ఊహించలేక పోయావు. ఆ కారణం నేను చెపుతా విను. ఆ తల్లి నీపై ఆగ్రహించలేదు. దాశరథులకు ఇక్కడ వున్న వార్త ఇంతవరకూ తెలియదు. ఇక తెలుస్తుంది. నీవు నన్నేం చేయతలచావో అది నీకూ, నీ పురానికీ, నీ బంధువులకూ, నీ అనుయాయులకూ పడుతుంది. రామానుగ్రహానువర్తులు, సౌమిత్రి ధనోజ్ఝితాలైన శరాలు నిన్ను క్షేమంగా ఇక బ్రదుకనీయవు. ఆయనకు కీడు తలపెడితే మూడు లోకాలూ భస్మపటలం కాకుండా నిలవవంటే నీ వెంత? నీ లంకా నగరం ఎంత? నీ పరివారం ఎంత? మా అందరలో చివర వాడినైన నన్ను నీవు చూచావుకదా? ఇక దీన్ని పట్టి నీ శత్రుపక్షం ఎంతటిదో, నీ పక్షం ఎంతటిదో తూకం వేసి చూచుకో. ఉన్నది ఉన్నట్లు చెప్పాను. అతిశయంలేదు. అత్యుక్తి కాదు. కనుక ధర్మ యుక్తం, త్రికాలాబాధితం, సార్థం అయిన మా వానర నేత సుగ్రీవుని వాక్యాలు విని శ్రీరామచంద్రునకు సీతాదేవిని సమర్పించు. ఆ పని నీకు అన్నివిధాలా యోగ్యమైంది. ఏ సమయంలో నేను సీతామాతను చూచానో, అదే నీ ఆయుః క్షీణానికి ప్రారంభం. మళ్ళీ మా మాతను సీతాదేవిని కూర్చి హెచ్చరిస్తున్నాను. ఆమె మానవి మాత్రం కాదు. పగ పట్టియున్న పంచవక్త్రియైన కాలభుజంగిగా తెలుసుకో. పరసతిని తాకటం, పన్నగంతో ఆడటం

చేశావు. అందుచే నిన్ను చంపక వైరం వహించాను. నీవు సీతా మాత కిచ్చిన రెండు మాసముల గడువు నీ మరణానికి గడువు. అవి నీ నోటి నుంచే రావటం నీ పాప ఫలం తెలుపుతూంది. నీవు చేసిన ద్రోహం సీతా రాములకు, వారి అన్యోన్య ప్రణయానికి విఘాతం కల్పించి మరణంతోగాని పోని మహా పాప ఫలాన్ని నీ నెత్తి కెత్తింది. నీ పురంలో, నీ బంధంలో వున్నదని పొంగుతున్న సీత నీ కామవాంఛకు గురికాదు సరికదా, నీ పాలిటి కాళరాత్రి. నీ గళానికి చుట్టుకున్న కాలపాశం. మెడలో వ్రేలాడే మహా కాలవ్యాళం. ఆకర్షణీయంగా, మధురంగా కనుపించే అందాలు చిందిస్తున్న మృత్యు దేవత. నీ శిరస్సు పై పడబోతున్న నిర్ఘాతం. ఇదివరకే ధరణీసుత తపోనలంచేతా, దాశరథి తీవ్ర కోపాగ్ని చేతా సర్వం దగ్ధమైంది. నివురు కప్పిన నిప్పువలె నీకు గోచరించటం లేదు. నీకు దృశ్యం రావటానికి నేను పోయి రవిపుత్ర రాఘవులకు ఈ వార్త తెలపటం అనే ప్రళయ ప్రభంజనం సృష్టించుతాను. ఆచ్ఛాదనం తొలగుతుంది. అప్పుడు చూడటానికీ, పశ్చాత్తాపం పొందటానికీ నీవుండవు లంక ఒక్క హాహాకారంమాత్రమే మిగులుతుంది. నా తల్లి సీతమ్మ నీ క్షేమం కోరినట్లే నేనూ నీ క్షేమం కోరి ఇంత దీర్ఘంగా మార్గాలు చెప్పి నీ మరణ కారణాలూ, నీవు ముందు పొందబోయే ఫలితాలూ వివరంగా వివరించాను. నీవు రాక్షసుడవు. రాముడు కేవలం మానవుడు. నేను ఈ రెండూ కాను. వానరుడను. పాక్షికంగా కేవల సాక్షి మాత్రంగా నీ శుభం కోరి చెప్పాను. శ్రీరాముడు నీ కోసం మానవ రూపం పొందాడు. కాని, నిజంగా జగత్సృష్టి వృద్ధి క్షయాలు ఆయన చేతనే జరుగుతున్నై అని నీకు తెలియదు. అందుకే వైరం పెట్టుకున్నావు. రామచంద్రుడు చంప తలిస్తే త్రిమూర్తులు ప్రతిఘటించి ప్రాణ ప్రదానం చేయలేరు. లోక జనని సీతామాత నిన్ను పుత్రుడుగా గుర్తించింది. తన పతికి నాచే సందేశం పంపుతూంది. కనుక నిన్ను నీవే కాక ఎవరూ రక్షించలేరు. ఇదే నా ప్రభు సందేశం. ఇదే నా స్వామి సందేశం. ఇదే నా సందేశం కూడ. నే వచ్చిన పని సిద్ధించింది. నీకు

చెప్పతలచింది చెప్పాను. ఇక నేను పోతున్నాను. శత్రు వాహిని లంకా నగరం ముంచక ముందే యోచించుకో" అని కఠినంగా వున్నా హితవైన మాటలు విస్పష్టంగా చెప్పాడు.

## విభీషణుడు రావణునితో దూతను చంపటం దోషమని చెప్పుట

మహా జలపాతంవలె ముక్కుటమై వచ్చిన పల్కులు దశాస్యుని అంతరాంతరాలను దూసుకుని పోయినై. వెంటనే వింశతి నేత్రాలు విస్ఫులింగాలను విరజిమ్మినై. కంఠస్వనం కర్కశంగా మారింది. ఏక క్షణా ధామం విడిచిపోయింది. ప్రతీకార చిచ్చు ప్రబుద్ధమైంది. "ఆహ. ప్రాణంతో ఎక్కడికి పోతావు? నీవు పోలేకదా నీవు చెప్పింది జరిగేది? ఏది ఎవరికి సంప్రాప్తిస్తుందో ఇప్పుడే చూస్తావు. నీకు మరణ శిక్ష విధిస్తున్నాను" అని దశవదనాలు ఏకధాటిగా, ఏక వాక్యంగా ఘోషించినై. ఆ అసురపతి ఆజ్ఞతో పంచభూతాలు నిశ్చలత్వం పొందినై. సురలు దుఃఖించారు. అసురులు ఆనందించారు. కాని ప్లవగేశుడు చిరునవ్వు నవ్వాడు. అంతలో సత్పురుషుడూ, నీతిజ్ఞుడూ, గుణదోష వివేచకుడూ అయిన విభీషణుడు లేచి నిల్చున్నాడు. అన్నకు అభిముఖుడై అంజలించాడు. వినయ వినమిత గాత్రుడై మంద్ర మధుర స్వరంతో మాటలాడ సాగాడు. "అన్నా! నన్ను మన్నించు. నీ ఆజ్ఞకు అడ్డం వస్తున్నానని ఆగ్రహించకు. ఇందాక మహామాత్యుడు ప్రహస్తుడు "ఇది రాజ సభ. ఇక్కడ న్యాయమే కాని అన్యాయం జరుగదు. నిజం చెపితే నిన్ను విముక్తి చేస్తాం" అని నీ సముఖంలోనే పలికాడు. అతడు తనకు తెలిసింది దాచకుండా చెప్పాడు. దానికి ప్రతిక్రియ ఆలోచించాలె కాని స్వవచన విఘాతంగా చంపుమని శిక్ష వేయటం సరికాదు. నీవు రోషాన్ని విడిచి, దోషాన్ని తెలిసి న్యాయం ప్రసాదించు. అతడు నాకేమీ కాడు. అతని పక్షం వహించిన ఉపయోగం నాకు లేదు. అయినా రాజ ధర్మం నన్ను పురికొల్పింది. రాజు చెప్పినా సభ విజ్ఞులు దోషంవున్నా దూతను వధించరు. అతడు దూతగా వచ్చానని చెప్పాడు. కనుక కపిని చంపటం లోక గర్హితం. రాజ ధర్మ విరుద్ధం. నీవు క్షత్ర ధర్మంలో

సాటిలేని మేటివి. మేలు మరువని వాడవు. ధర్మజ్ఞులలో తలమానికానివి. తప్పొప్పులు తెలిసి తగిన విధంగా మంత్రం నెరపే వాడివి. సర్వ శాస్త్ర విదుడవు. సర్వ వేద సంపూర్ణ స్వరూపుడవు. అల్పుల వలె అప మార్గంలో నీవే ప్రయాణిస్తే ఇంత చదివిన దానికి మిగిలే ఫలం శ్రమ మాత్రమే. కావున యుక్తమైన రీతిగా ఇతని దండించు" అని విన్న వించాడు. తమ్ముని మాటలు తలకెక్కనీయక "పాపాత్ముల వధించటం పాపం ఎలా అవుతుంది? పుణ్యాత్ముల నెవరైనా వధించరా? వీడు పాప కర్ముడు. కాబట్టి మరణదండనమే తగిన దండనం" అంటూ మండి పడుతూ మాటలాడాడు మాంసాశి ప్రభువు. అధిక దోషయుక్తం, అర్యనీతి జుష్టం, అనార్యసమ్మతం అయిన అన్న పలుకులకు, ప్రాజ్ఞుడూ, పరతత్త్వ వీచణుడూ, ధర్మపథగామీ అయిన విభీషణుడు ఎంతో బాధ పడ్డాడు. "అన్నా! ధర్మబద్ధమైన నా హితం పాటించు. అన్ని కాల ల్లోనూ, అన్ని సంఘాలలోనూ, అన్ని దేశాల్లోనూ దూతను చంపటం దోషంగా పరిగణించారు. ఈతడు మనకు ముమ్మాటికీ శాత్రవుడే. సందేహంలేదు. శిక్షకు పాత్రుడే. ఇది కూడ యథార్థమే. మనకు మహాప కారం చేశాడు. అయినా ఇతడు దూత. ఇతనికి విధించే శిక్షలు రాజ నీతిలో ఇలా పేర్కొనబడినై. శిరోముండనం, అంగవైకల్యం, కశా ఘాతం, శాశ్వత శిక్షా చిహ్నం. ఇందులో నీకు ఏది ఉచితమని తోస్తే ఆ దండనం విధించు. నా కది సమ్మతం. నీవంటి లోకైక వీరుడూ, దేవా సుర శాసకుడూ, రాజనీతి ధర్మశాస్త్ర పారంగతుడు ధర్మాతిక్రమణం చేయటం నాకు ఎంతమాత్రం ఇష్టంలేదు. కొంచెం లోతుగా విచారిస్తే ఈ కోతిని చంపితే వచ్చే లాభం ఏముంది? ఎవడు వీడిని పంపాడో వాణ్ణి శిక్షిస్తే లోకం హర్షిస్తుంది. ఆచంద్రార్కం యశస్సు నిలుస్తుంది. మంచి వాడైనా, చెడ్డవాడైనా పరుని కొలువులోచేరి బ్రతికేవాడు యజమాని చెప్పినట్లు చేసేవాడే కాని తనకోసం చేసేవాడు కాడు. అందుకే అతనిని చంపకు. యుద్ధంలో చావగా మిగిలిన సైన్యం లొంగిపోతే చంపుతామా? అదుపులో వుంచుతాం. అలాగే దూత వ్యవహారం. ధర్మ వాదంలోకాని, లోకాచారంలోకాని దూత అవధ్యుడనే చెప్పబడింది. మరొక విషయం మనవి చేస్తాను. నీ వన్నట్లు ఇతని చంపుతాం. ఈవార్త

పరిపంథులకు తెలియదు. ఈతడు ఎన్ని చెప్పినా, ఇతడొక్కడే జంపతి తరించి రాగల దర్పం గలవాడు. ఇంతతో కథ ముగుస్తుంది. ఎన్నటికైనా రణశేషం, ఋణశేషం, శత్రు శేషం మిగల్చరాదు. వీనిని ఒక్క మాత్రంగా శిక్షించి వదలివేస్తే, ఈ వృత్తాంతం రాజ పుత్రులకు తెలిపి రణ సన్నద్ధుల చేసికొని వస్తాడు. నీవు రణ ప్రియుడవు. యుద్ధ సముత్సుకులు నీ భటులు, సేనానులు, చమూపతులు. శాత్రవులను సమరంలో జయించి శాశ్వత యశస్సు సాధించటం నీ వంటి ఏకైకశూరునకు తగిన పని. ఇన్ని బలవత్తర కారణాలచేత దూతను వధించటం దూష్యం అన్నాను. హితులూ, సహోదరులూ, సమాహితులూ అస్త్ర శస్త్రాగ్ర వరులూ వెంబడించగా దాటివేసి నీ సేనా నాయకులు విజయేందిరను గ్రహించి తెచ్చి నీ కర్పించటం పౌరుష లక్షణం. చిన్నవాణ్ణి. స్వాతంత్రించి పలికినందుకు నన్ను క్షమించుమని ప్రార్థిస్తున్నాను" అని పల్కి విభీషణుడు ఆసనంలో కూర్చున్నాడు. అందరూ ఆ మాటలకు హర్షం ప్రకటించారు.

## రావణుడు హనుమ తోక కాల్చమని ఆజ్ఞాపించుట

దశగ్రీవుడు తన సోదరుడు చేసిన ధర్మ నిర్ణయానికి తల పంకించాడు. కొంతకాలం గంభీర ముద్ర వహించాడు "సోదరా! నీ హితవు సమయోచితంగా వుంది. దూతను వధించటం వదలి, శిక్ష శాశ్వతంగా నిలిచేలాగా విధిస్తాను. ఈతని శిక్షించక విడువరాదు. ఈతని మాటలవల్ల ఆ రాజ పుత్రులకు అండగా నిలిచింది సుగ్రీవుడు. అతని పరివారం కోతులూ, కొండముచ్చులూ, ఎలుగుబంట్లూ. వీటిని సముద్రం దాటించి లంకను ముట్టడించటం వాళ్ళ తరంకాదు. వచ్చినా మన వాళ్ళకు పోటీగా చాలరు. నీవన్నట్లు వాళ్ళలో వీడే సమర్థుడు. వీనిని దండించి విడిచి పెడితే పోయి మన శక్తి యుక్తులు వివరిస్తాడు. తెలియక చేసేదేదన్నాడు. తెలిసి ఏం చేస్తారో చూద్దాం. మనం ప్రభు ధర్మం పాటించిన వాళ్ళం అవుతాం. పరిపంథులకు అవకాశం ఇచ్చిన వాళ్ళం అవుతాం. భటులారా! కోతి జాతికి భూషణం, ప్రాణపద్యం అయింది వాలం. దాన్ని మొదలంట కాల్చి విడిచి పెట్టండి" అని ఆజ్ఞ ఇచ్చాడు. "అంగ వైరూప్యం కల్గిన

ఈ కోతిని చూచి స్నేహితులూ, చుట్టాలూ, యజమానులూ అవహసించుసుగాక. తోక కాల్చి మన నగరమంతా తిప్పండి. మనవారంతా తప్పుకు తగిన దండనం లభించిందని సంతోషిస్తూ ఈ వింత కోతిని చూస్తారు" అని కూడా అన్నాడు. ప్రభువు మదలకాగానే రాక్షసభటులు జీర్ణ వస్త్రాలు తెచ్చి గుట్టలుగా పడవేశారు. నూనెతో తొట్లు నింపారు. కట్టెలు పేర్చి మంటను రగుల్కొల్పారు. కొందరు తెచ్చిన పాతగుడ్డలను అందిస్తుంటే, కొందరు తైలంలో తడిపి ఇచ్చారు. కొందరు తలపడి తోకకు చుట్టసాగారు. ఇదంతా చూస్తున్న హనుమ ఆ భటులను అల్లరిపాలు చేయాలని కొద్ది కొద్దిగా వాలం పెంచసాగాడు. ఎంతిన కట్టెలు వేసినకొద్దీ వృద్ధిపొందే అగ్ని లాగా ఎడతెగక పెరుగుతున్న హనుమంతుని తోకను రక్షోభటులు, విసుగు లేకుండా, శ్రమ అనుకోకుండా గుంపులుగా మూగి గుడ్డలతో చుట్టి అగ్ని రగిల్చారు. ఆ హారవహుని జ్వాలకు హనుమ నిష్ఠురామర్ష పరీతుడై, వాలాన్ని ఒకసారి పైకెత్తాడు. దానితో కొందరు తగులబడ్డారు. కొందరిని పట్టి గట్టిగా కొట్టి చంపాడు. ఇంతలో తైల వస్త్ర సంస్పర్శగల దహనుడు క్షణంలో వాల ప్రదేశం అంతా వ్యాపించాడు. ఆ మంటలు చూస్తూ అసుర స్త్రీ బాల వృద్ధులు ఆనందంతో పొంగిపోయారు. అరుణకాంతులు చిమ్ముతూ ఉదయించే అరుణగభస్తి మండలం లాగా అంజనాసుతుడు ప్రకాశించాడు.

## ఆంజనేయుడు వాల దహన సమయంలో ఆలోచించుట

అంతకంతకు అగ్ని ప్రజ్వరిల్లటంతో శరీరం రక్తభావం పొందసాగింది. మారుతి ఆలోచనామగ్నుడైనాడు. "దేవతలిచ్చిన వరాలతో, నిరంతర బ్రహ్మచర్య యోగ నిష్ఠతో దివ్యత్వాన్ని పొందిన నా శరీరం అనలుడు అపాయకరంగా దహించను. ఈ తెలివితేని రాక్షసులు కట్టిన కట్లు నేతలచుకుంటే తమంతతామే విడిపోతై. ఏవీ నాకు విశ్వంలో ఎదురాగలేవు. ఇప్పుడు నా కర్తవ్యం ఏమిటి? కట్లు త్రెంచి వీళ్ళను కాళ్ళరాచనా? తిరిగిపోతూ సముద్రంలో వాలాగ్ని చల్లార్చనా? నా ప్రభువు లొసంగిన అవకాశం చాలా పరిమితం. అందుచే నా చేతలు

అపకీర్తికరం, అధర్మం కూడా. ఇప్పటికి సహించి వెళ్ళటమే యుక్తంగా వుంటుంది. కాదు కాదు. ఆ ఊహ సరి అయినది కాదు. వీళ్ళ నన్ను లంకా నగరం అంతా త్రిప్పుతారు. అర్ధరాత్రివేళ నేను నగరం చూశాను. కాని, ఇంకా ఇప్పుడు స్పష్టంగా చూడవచ్చు. దుర్గ రహస్యాలు ఎంతగా తెలిస్తే అంత మంచిది. అప్పుడు వైరులకు నా పనికి తెలియకూడదని సూక్ష్మరూపంతో చూశాను. నా లక్ష్యం కూడా వేరు. సీతమ్మను గుర్తించటమే ప్రధానంగా పెట్టుకున్నాను. ఇప్పుడు సీతాదర్శన మైంది. వాళ్ళే ఇప్పుడంతా చూపిస్తున్నారు. నేను స్వేచ్ఛగా గ్రహించ వలసినవన్నీ గ్రహిస్తాను. ఇందువల్ల కొంతకాలం వ్యర్థమైనా సార్థకంగా ముగించవచ్చు. పని పూర్తి అయ్యేవరకూ వీళ్లు పెట్టే బాధలు, తిట్టే తిట్లు, కొట్టే దెబ్బలు సహిస్తాను. తెలియ వలసినదంతా తెలుసుకున్న పిమ్మట, నాకేదో అపకారం కల్పిస్తామనుకున్న రాక్షసరాజుకు తగిన శాస్తి చేసి మరీ పోతాను. అంతేకుండా పెరుగుతున్న నా ప్రతీకారభావానికి సీతారామ సుగ్రీవుల ఆదేశం అడ్డు వస్తుంది. లేకపోతే నేనే సర్వం క్షణంలో ముగించి సీతామాతను గైకొని శ్రీరామచంద్రుని చేర్చిపోయేవాణ్ణి. ముందు ఈ అయ్యల సంకల్పానుసారం కొంత సహించి వీళ్ళ వెంట వెళ్తాను. ఆ తర్వాత వడ్డీతో అసలు అప్పు తీరుస్తాను" అని నిశ్చయించుకుని నిప్పుకు నీరెత్తినట్లుగా హనుమ నిశ్చలంగా ఉన్నాడు. మండుతున్న తోకతో మారుతిని ఈడుస్తూ, కొట్టి తిట్టుతూ, శంఖభేరీ ఢాంకారాలు పట్టణం ప్రతిధ్వనించగా నక్తంచర భటులు నానా కోలాహలం చేస్తూ, సందు సందూ, గొంది గొందీ, వాడ వాడా, త్రిక త్రికం, వీధి వీధీ విడవకుండా త్రిప్పారు. వాళ్ళ సందడిలో వాకిండ్లు పావని పంక్తి ముఖాని పత్తిన నర్వం హారం ముట్టారు. "ఇదే మాత. ఇదే కోతి. ఇదే వనం పాడు చేసిన కోతి. దీనికి ప్రభువు తగినట్లు దండన విధించాడు. అందరూ చూడండహో" అంటూ దప్పులు కొట్టి హెచ్చరిక చేస్తూ కాలిపోతుంటే దేహం వెర్రిగా ఉబ్బి అంతా విరగబడి చూడ సాగారు. అందులో కొందరు అంగనలు పరుగు పరుగున పోయి దివిష్య చ్ఛింతనం చేస్తున్న జానకిని చేరారు. "ఓ మారీ! ఎర్రని ముఖంతో నీతో రాత్రి గుర్రు గుర్రని మాట లాడిన కోతిని మా ఏలిక తోక కాల్పించింది

వీపుల వెంట త్రిప్పుతున్నా"డని చెప్పారు. ఆ మాటలు మైథిలి మనస్సుపై కశాఘాతాలైనై. ఆమె కనుకొలకుల వెంట ఆణిముత్యాలవంటి అశ్రువులు రాలి అంకప్రదేశం తడిపినై.

## జానకి జ్వలనుని ప్రార్థించుట

కేరింతలు కొడుతూ నిశాచరకాంతలు చెప్పిన విషయం విన్న జనకపుత్రి, "అయ్యో! ఇంతటి పిడుగులాంటి వార్త వస్తుందని తలపోసుకోను. ఎందుకు హనుమా ఈ అశోకవన నాశనం. రాక్షసవీర సంహారం చేశావు? ఎందుకు పట్టుబడ్డావు? ఇతరులకు పట్టుబడితే నా గతి ఏం కావాలి? నా నాథుని కీర్తి చెప్పేదెవరు? ఆయన గతి ఏం కావాలి? సుగ్రీవుడేమై పోతాడు? ఇది తెలిసి చేసింవా? జాతి లక్షణమా? పండి పడి పోయే ఫలం వాయు వశంచే ప్రవాహంలో పడినట్లు సర్వం సాధించి సాధించి ఇలా ఎందుకు చేశావు? ఏమో? ఇందులో ఏమైనా యుక్తి, రాజ్యతంత్రం వుందేమో? ఎంత నిశితంగా చూచినా హనుమలో జాతి లక్షణమైన చపల స్వభావం గోచరించలేదు. మహా మనిషి. గంభీరుడు. కార్యవాది. కార్యశూరుడు. మితభాషి. వినయ వివేక విశారదుడు. ఓహో తెలిసింది. చేయ తగింది, చేయవలసింది చేశాడు. అతని నెవ్వరూ అడ్డలేరు. అజేయుడై, అస్త్రబంధ్యుడైన హనుమ వాలాన్ని అగ్ని దహించలేదు. అయినా, అతడు నా బిడ్డ. తల్లిగా నా కర్తవ్యం నేను నెరవేర్చాలి. ఓ జాతవేదా! నేను నిరంతరం భర్తృశుశ్రూష సలిపే పతివ్రతనైనట్లయితే, ధర్మబద్ధమైన తపస్సు చేస్తున్న తపస్వినైతే, నేను పతివ్రతనైతే నీవు నా పుత్రుడు హనుమపట్ల శీతలత్వం పొందు. ఓ మారుతమా! సూర్య వంశ జలధి సోముడైన శ్రీరామునకు నా మీద నిశ్చలమైన ప్రేమ వుంటే, ఆయన దివ్య దర్శనం పొందే భాగ్యశేషం నాకు మిగిలి వుంటే, నా కొడుకు మారుతి పట్ల శైత్యాన్ని పొందు. ఓ అగ్నిదేవా! సంకల్పంలో వికల్పం లేని సుగ్రీవుడు సత్య సంగరుడైతే, నేనీ శోక సముద్రం తరించి భర్తను పూజించే సత్ఫలం కలిగి వుంటే, అవమానప

భర్తదూతయైన ఆంజనేయుని, నా కూరిమి మనిషిపట్ల సుప్రసన్నుడవు కమ్ము. నీకివే నా నమస్కారాలు" అని ధ్యానించింది. భర్తృస్మరణ సలిపింది. తల్లిని తలచింది.

## అగ్ని చల్లబడినందుకు హనుమ ఆశ్చర్యపడుట

ఆమె ప్రార్థనకు అగ్నిదేవుడు సంతృప్తుడైనాడు. "హనుమ క్షేమంగానే వున్నాడు. నీవు దుఃఖించకు. ఆశించిన ఫలితం అందు కుంటావు" అన్నట్లు ప్రదక్షిణశిఖుడై సుప్రసన్నుడై ఆమెకి గోచరిం చాడు. ఆమె పట్టరాని సంతోషంతో నిశ్వాసం వదలింది. అతః పూర్వం తగుమాత్రం వేడి ఇస్తున్న దహనుడు పన్నీరు కలిపిన మంచి గంధం వలె చల్లనైనాడు. అనలునకు అనుంగు చెలికాడైన అనిలుడు అంతకుముందు తీక్ష్ణంగా వీస్తున్నవాడు ఒక్కసారి శతకోటి ప్రాలేయ పర్వతప్రాయుడై వీచసాగాడు. ఈ హఠాత్సంఘటనకు హనుమ ఆశ్చర్య పడ్డాడు. భగభగ మండే తోకను కల్పిస్తున్న దహనుడు ఇంతలో ఇంత శీతలుడు కావటానికి హేతువేమి? మర్దిస్తూ వీచే నా తండ్రి ఇంత హాయిగా, సుగంధ బంధురంగా, మంద మందంగా ఎందుకు వీస్తున్నాడు? నేను కోరకుండా నా క్షేమాన్ని ఎవరు కోరి వీరిని ప్రార్థించారు? అవును. స్ఫురణకు వచ్చింది. ఇది శ్రీరామచంద్రుని ప్రభావం. పర్వతరంపిడ నన్ను, సముద్ర మధ్యంలో మైనాకుడూ ఎవరి అనుగ్రహం చేత నాకు దర్శనం ఇచ్చి కర్తవ్యబోధ చేశారో ఆ రామచంద్రుని అను గ్రహం చేతనే అగ్ని వాయువులు ప్రసన్నులైనారు. అంతకంటే అమృత మూర్తి నా తల్లి జానకమ్మ. ఆమె సంకల్పమే ఇది. అందుకే ఆమె కోరిక మన్నించి, తన మిత్రుని పుత్రుడనని కూడా భావించి జ్వలనుడు శాంతించి చల్లనైనాడు. ఇక నా కార్యం నేను పూర్తి చేస్తాను. నేనెవరో ఇంకోసారి రాక్షసులకు తెలుపుతాను" అని ఆకాశం పగిలేలాగా ఆర్భటించి తీవ్రమైన అవ్వాయి చువ్వ వలె అంబరానికి పాటాడు. మందర శిఖరంలాగా వుండి, రాక్షస భట సంచార రహితమైన పుర ప్రవేశ ద్వారాగ్రంపై దూకాడు. వెంటనే తన దీర్ఘ శరీరాన్ని హ్రస్వం చేశాడు. బంధనాలన్నీ పర సహాయం లేకుండా ఊడిపోతా

లైనై. శ్రీమంతుడూ, ఆత్మవంతుడూ, శక్తిమంతుడూ, ప్రభావంతుడూ అయిన హనుమంతుడు అహార్య సన్నిభమైన భీమాకారాన్ని మళ్ళీ ధరించి అన్ని దిక్కుల ఒక్కసారి కలయచూచాడు. ఆ తోరణాన్ని ఒక్క తాపు తన్నాడు. ఆ తన్నుకు అది సహస్ర శకలీకృతంగా ఆకారాన్ని మార్చుకుంది. ఆచ్ఛాదనా రహితంగా నిల్చిన తోరణ స్తంభాన్ని పీకి చేతిలో ధరించి, కావలి వాళ్ళను కాలుని పురానికి పంపి, ప్రజ్వలద్వాలుడై, అంశుమాలిని పోలి అర్ధ నిమేషకాలం ఆలోచనలో పడ్డాడు.

## హనుమంతుడు లంక కాల్చుట
## (లంకా దహనం)

“రామ రవిపుత్రుల ఆజ్ఞ నాకు లేకపోవచ్చు. అయినా సీతమ్మ అనుమతి నాకు వుంది. భవిష్యత్కార్య భారం సంపూర్ణంగా ఆమె నాపై పెట్టింది. రావణ వధ తప్ప అవసరం అనుకున్న అన్ని కార్యాలూ నేను చేయవచ్చు ఆమె అసురపతితో పల్కిన పల్కులు పల్కులుకావు. శాపాక్షరాలు. అసలు ఆమె అంతఃక్షోభమే అసురపతికుల క్షయానికి నాందీ వాచకం. ఆమె ప్రత్యేకించి నాతో చెప్పిన మాటల సారాంశం జాగ్రత్తగా పరిశీలిస్తే “నేను వీర్య శుల్కగా నీ పాణిగ్రహించి అర్ధాంగినై సతీ ధర్మం నెరవేర్చుకున్నాను. విధి వక్రించి మనలను విడదీసింది. మళ్ళీ నేను నీ సన్నిధి చేరాలంటే వీరపత్నినై చేరాలి” అని బోధ పడుతుంది. ఇంతవరకు శ్రీరామచంద్రుడు ప్రధాన భూమిక. ఇకపై సీతామాత ప్రధాన భూమిక. నా యత్నానికి అర్ధభాగం ఆమోద ముద్ర పడింది. మిగిలిన అర్ధం సఫలీకృత మనోరథుడనై నేను తిరిగిపోవటంలో వుంది. ఇప్పటి నా చేయబోయే పని రెండువిధాలుగా వుపయోగపడాలి. కాంక్షించిన నన్ను రెచ్చగొట్టి శిక్షించిన మూర్ఖునకు దుఃఖపీడా, సలుపబోయే సమరంలో సీతాపతికి కార్యం సుకరం కావాలి. అశోకవనాన్ని ఖండించాను. రాత్రించర బృందాన్ని తుంపించాను. సేనాపతి తండాన్ని చెండాను. ఈ కార్యాలవల్ల బలమైన శత్రువుల పక్షంలో కొంత వెలితి ఏర్పడ్డది. ఇప్పుడు దుర్గాలూ, హర్మ్యాలూ, ఆయుధాలూ మండిస్తే, పునః పూర్తి చేసే లోపల సర్వ వానర సైన్య సమేతంగా రవిపుత్ర రాఘవులతో

జైత్రయాత్ర జరిపితే ఏండ్లు పట్టే పని పూటల్లో ముగుస్తుంది. కొంచెం ప్రయత్నం చేసి లంకా దహనం చేస్తే నా సంకల్పిత క్రియా సంచయమంతా నెరవేరుతుంది. నా శ్రమ సార్థకమవుతుంది. ఏ అగ్నితో నా వాలం కాల్చారో ఆ అగ్నితోనే లంకను దహిస్తాను. ఇది సురాధిపతికి కనువిప్పు కావాలి. కాకపోతే మరణానికి మార్గమైనా కావాలి" అని ఆలోచన ముగించటం, హర్మ్యాల పైకి లంఘించటం చేశాడు. శంపాలతాయుతమైన జలదంవలె మేడలు, మిద్దెలు, సౌధాలు, హర్మ్యాలు, విమానాలు, ఆయుధాగారాలు, ఒకటేమిటి, రెండేమిటి? అది ఇది ఏమిటి? ఆ మహా లంకా నగరంలో అన్నింటికీ అగ్ని రగుల్కొల్పాడు. మహా పార్శ్వ, ప్రహస్త, వజ్రనాభ, శుక, సారణ, మేఘనాద, జంబుమాలి, సుమాలి, రశ్మికేతు, రవి విరోధి, హ్రస్వకర్ణ, దంష్ట్రరోమశ, ధ్వజగ్రీవ, ఘోరహస్తి, విద్యుజ్జిహ్వ, కరాళ, పిశాచ, శోణితాక్ష, కుంభకర్ణ, మకరాక్ష, కుంభ, నికుంభ, బ్రహ్మశత్రు, యజ్ఞశత్రు సుందర మందిరాలన్నీ తగులపెట్టాడు. విభీషణ వాసాన్ని మాత్రం విడిచి పెట్టాడు. అప్పటికీ ఆ మహా కపికి ఆగ్రహం చల్లారలేదు. అనర్ఘ రత్నాలతో, బంగారంతో అతిలోక రమ్యంగా నిర్మించిన అమరలోక సమ్రాట్టు అంతఃపురంపైకి దూకి అగ్నిని అంటించాడు. కల్పాంత జలద గర్జాసన్నిభంగా సింహనాదం చేశాడు. అంతవరకు హనుమ వాలంలో బద్ధీకంగా అణగించి ఉన్న దహన శక్తిని దహనుడు అంతా ఒక్కసారి అందుకున్నాడు. పుత్రుని ప్రీతికోసం ఉపసంహరించుకున్న వేగం తిరిగి గ్రహించి పవనుడు భీకరంగా వీవసాగాడు. ఆ అనలానిల విజృంభణంలో, చిటిలి, పెటిలి, పటపటమని, పెళీలని మణి నిర్మిత ద్వారాలు, కిటికీలు, చప్పరాలు నేల కూలినై. మహోన్నత విమానాలు కాలి కూలుతుంటే, పుణ్యం క్షీణించగా భూమిపై పడే సిద్ధ భవనాలలాగా కనబడినై. మండిపోతున్న గృహాలను చూచి కడుపు మండగా దండ చేరబోయి మండిపోయేవాళ్లూ, కాలిపోతున్న విలువగల వస్తువుల వెలికి తెచ్చే తొందరలో కాలిన కప్పులు పైనబడి కాలిపోయే వాళ్లూ, బయటకు రాలేక ఇండ్లలోనే మరణించిన భార్యా పుత్రులకై, జననీ జనకులకై గోలు గోలున ఏడ్చే వాళ్లూ, ప్రాణ రక్షణకు పారిపోతూ పొగ క్రమ్మటంతో దారి తెలియక

అగ్నికి ఆహుతి అయ్యేవాళ్ళూ, రక్షించబోయి రామా వహ్నిచే భక్షించబడే వాళ్ళూ నిండి, అప్పటి వరకు ఆనందధామంగా వున్న లంకానగరం శ్మశానానికి ప్రతిరూపమైంది. "అయ్యో! కపి రూపంతో పూర్వ వైరం తీర్చుకోటానికి అగ్నికి అవకాశం దొరికింది. అవను దొరికిందని అనిలుడు ప్రకాశ ప్రభంజనుడవుతున్నాడు. ఈ ఆనందం ఏ లోకంలో దొరుకుతుంది? ఎన్నాళ్ళకు మళ్ళీ నగరం యథాస్థితికి వస్తుంది? అనుకోకుండా ఈ అకాల మృత్యు తాండవం ఎందుకు వచ్చింది? ప్రభువు ఆలోచించక తోక కాల్పించాడు ఈ కోతి లంకంతా కాల్చింది" అంటూ రోదించేవాళ్ళూ, అగ్ని కీలలు చుట్టుముట్టి వస్తుంటే ప్రాణ భయంతో ముడి సడలి వ్రేలాడే తలవెండ్రుకలతో, చంటిపాపలను గుండెలకు హత్తుకొని హాహాకారంతో రోదించే ఆడవాళ్ళూ, మేడలు పైనుంచి క్రిందపడుతుంటే మేఘాల్లోనుంచి మెరుపులు తెగిపడుతున్నట్లున్న లంకానగరం కరుణ దేవత జ్యేష్ఠాదేవితో చెప్పుకుని దురపిల్లిన చందంగా మారిపోయింది. మసై పోయింది. వజ్ర విద్రుమ వైడూర్య వర్గం, రజతహేమ ముక్తారాజి కరిగి నీరై పారుతుంటే అంజనా నందనుడు ఆనందంతో తిలకించాడు. ఆ దుస్సంఘటన సమయంలో ఎంత కాల్చినా హనుమకు తృప్తి కల్గలేదు. ఎంత దహించినా జ్వలనుడు తృప్తిపొందలేదు. ఎన్ని శవాలు ఆక్రమిస్తున్నా ధరణి తృప్తి చెందలేదు. ఎంత వీస్తున్నా వాయువునకు శ్రమలేదు. తృప్తి లేదు. లంకా నగరం తగులబడుతుంటే ఒకచోట కింశుక వర్ణంతోనూ, వేరొకచోట శాల్మలీ పుష్ప వర్ణంతోనూ, మరోచోట కుంకుమ లోహిత వర్ణంతోనూ అగ్ని జ్వాలలు శోభను వెదజల్లినై. ఆనాడు ఈశ్వరుడు త్రిపురాలను దహించాడు. ఈనాడు హనుమ లంకను దహించాడు. క్రమంగా ఆ జ్వాలలు త్రికూట పర్వతానికి కూడా ప్రాకినై. రక్షశ్శరీరాలు ఘృతంకాగా, అభ్రం విహారభ్ర విభ్రమోదగ్రుడై, నాలుకలు క్రోయుచూ, నలువంకల క్రమ్ముతూ, వాయువు సహకరింపగా రేగి, బ్రహ్మాండాలను లోగొనే పోలికగా, కోటి దినేశుల ప్రకాశాన్ని గోటమీటి, తనకు సాటి తానే అన్నట్లు, పిడుగులు పడుతున్నట్లు ధ్వనిస్తూ, "సర్వం అగ్ని మయం" అన్న రీతిగా వైశ్వానరుడు విశ్వరూపం ప్రదర్శించాడు. మింటనంటే మంటలు మోమగు

పొగ మల్లాగా వున్నై. శమించిన స్థలాల్లో సుళ్ళు తిరుగుతూ, దట్టంగా పైకి లేచే ధూమం వల్ల కలుషంగా వుంది. హనుమ వాలానికి అందని చోటూ, హనుమ పాదాలు స్పృశించని ప్రదేశం ఆ లంకా నగరం అంతా ఏమీ మిగుల్చుకోలేదు.

## రాక్షస విలాపం

ఆ బీభత్స దృశ్యాన్ని చూసి "తానొకటి తలిస్తే దైవం వేరొకటి తలచిందన్నట్లు పంక్తి ముఖుని దండ ప్రయోగం భిన్న పరివర్తనం, భిన్న పరిణామం పొందిందే" అని రాక్షసులంతా గగ్గోలు పడ్డారు. "ఈ కోతి నిజంగా కోతి కాదు. ఇంద్రుడో, చంద్రుడో, ధనదుడో, రుద్రుడో సముద్రుడో, అనిలుడో, అనలుడో, యముడో, వరుణుడో కావాలి. ప్రాకృత వానరానికి ఈ శక్తి ఎక్కడిది? ఇంత మహానగరం దహించిన అగ్ని ఈ కోతి తోక కాల్చదేమి? సర్వ సృష్టికర్త, సర్వ పితామహుడు చతుర్ముఖుడు తన వర బలంతో లోక కంటకులుగా తయారైన రాక్షస లోకాన్ని నాశనం చేయటానికి కపి రూపం ధరించి వచ్చి వుంటాడు. కాకపోతే అగ్ని ఎందుకు తోక కాల్చదు?" అని శిష్టులైనవారు విలపించారు. "అయ్యో! అవ్యక్తం, ఏకం, అనంతం, అచింత్యం, అప్రమేయం అయిన విష్ణు తేజం స్వీయ మాయా ప్రభావంతో వానరాకృతితో అఖిల రాక్షస క్షయానికి అవతరించిందేమో" అని హనుమత్ప్రేరిత హుతభుక్కులా దగ్ధమైన సాశ్వరథ గజ తురంగ మృగ వృక్ష లతా హర్మ్యం మైన లంకానగరాన్ని చూసి అభిరాములు, అభిమతులు గుండెలదర శోకించారు. "అయ్యో! తండ్రీ! బిడ్డా! నాథా! తల్లీ! చెల్లెలా! మమ్మల్ని ఏం చేసి పోయారు? మీరు లేక మేం బ్రతికి వున్నా చచ్చిన వాళ్ళక్రిందే జమ" అంటూ హత శేషమైన అసురగణం ఆక్రోశించింది. సంభ్రమ త్రస్తం సవిషణ్ణం అయిన పుర విరోధి పాణి చేతా, ఉజ్జ్వల జ్వాలా ధీర మాలా కలితమైన కాష్ఠాలు కల్పించిన బూడిద రాసులచేతా, లంక విశ్వ సృష్ట్యుప సంహృతమైన విశ్వం లాగా చూపట్టింది. హనుమ కూడా సంకల్పించిన కార్యం సర్వం ద్విగుణీకృతంగా ముగిసినందున త్రికూట పర్వత శిఖరం చేరాడు. క్షణకాలం, కష్టం కిచ్చిన గమనం, సముద్ర

తరణం, సీతాన్వేషణం, సంభాషణం, ముద్రికా ప్రదానం, చూడామణి గ్రహణం, అశోకవన నాశనం, అసుర వధ, రావణ దర్శనం, హితోపదేశం, పునః లంకా మర్మభేదనం, లంకా దహనం సంయమంతో చింతించి సంతృప్తి నంది శ్రీరామ దర్శనార్థం మరలిపోవటానికి నిర్ణయం తీసుకున్నాడు. ఆ అద్భుత కర్మను అవలోకించి దేవ ముని నాగ గంధర్వాది దివ్యులు పరమ హర్షాన్ని ప్రకటించారు. జ్వాలా మాలావృత లాంగూలుడై పర్వతాగ్రంపై నిల్చిన హనుమంతుని చూచి గంధర్వ కిన్నర సిద్ధులు విస్మయ విలోచనులై వీక్షిస్తుండే, కాలానలుడై లోకాన్నే కాలుస్తాడేమో యని భూతకోటి కంపించసాగింది. ముని సుర పన్నగ ముఖ్యులు హనుమను "మేలు! భళి! అహో!" అంటూ శ్లాఘించారు.

## పావని సీత దగ్ధమైనదని పరితాపాన్ని పొందుట

త్రికూట పర్వతం చేరి శాంతించిన హనుమ వాలాగ్నిని వనధి జలంలో ముంచి చల్లార్చుకున్నాడు. ఒక్కసారి పట్టణం అంతా కలయ చూచాడు. గతదిన రాత్రి కన్నుల పండువుగా కనుపించిన అసురపతి నిలయం శూన్యమై, శోక సముద్రమై కనుపించింది. పత్రిరాజ వాంఛా స్థానంలో విచక్షణా భావం ప్రవేశించి దుస్సహచింతాదంతురిత మానసుణ్ణి చేసింది. "అయ్యయ్యో! ఎంత అకార్యం చేశాను? కొంచెమైనా చింతించక లంకను కాల్చాను. ఇది ఎంత మంచి పని అని సంతోషించేది? ప్రజ్వరిల్లుతున్న వహ్ని అప్పు జలాన్ని రూపుమాపినట్లు, పెరిగిన కోపంతో నా తెలివి నశించింది. ఎవడు సంయమంతో కోపాన్ని నిగ్రహిస్తాడో వాడే మహా పురుషుడు. మనిషి శ్రేష్ఠుడు. ధన్యుడు. కోపం కలవాడు సర్పదష్టుడై విషం తలకెక్కగా లోకం మరచినట్లు, గుణావగుణ విచక్షణ చేయడు. గురువుల చంపుతాడు. గుణవంతుల కరకు మాటలచే నొప్పిస్తాడు. సంఘం మర్యాదను నశియిస్తాడు. కోపి చేయలేని పాపం ఏమీలేదు. వాచ్యావాచ్య విచారం లేదు. అవాచ్య ప్రసంగాలకు హద్దులేదు. అనవశ్య ప్రవర్తనకు అవధులేవు. పాము తన శరీరంపై వృద్ధిపొందిన కుబుసం ప్రమాదం లేకుండా పరిహరించి స్వేచ్ఛంగా మెలగినట్లు వివేకులు కోపాన్ని జయించి చింతిత కార్యసిద్ధి పొందుతారు. ఛీ ఛీ!

నేను ఎంతటి అహంకారిణ్ణి? ఎంతటి దుర్బుద్ధిని? ఎంత పాపిని? శత్రు ప్రతీకారమే చింతించాను. కాని సీతామాత పరిరక్షణం చింతించలేదుకదా? నాపై నాకే రోత పుట్టుతూంది. నా చేత నాకే గర్హ్యంగా కనుపిస్తూంది. ఎవరి దుఃఖోపశమనార్థం ఇంత మహాకార్యం సాధించానో ఆ శ్రీరామునికే అంతులేని దుఃఖం సంతరించాను. స్వామి ఘాతుకుడనైనాను" అని తన్ను తానే నిరసించుకున్నాడు. నిందించుకున్నాడు. "హనుమా! ఇంత తెలివి తక్కువ పని ఎందుకు చేశావు? ఇంత ఒడలు తెలియని దురాగ్రహం ఎందుకు పొందావు. ఇప్పుడు నీ స్థితి ఏమిటి? శంకా తంకాలు లేకుండా లంకా నగరం మాడి మసైపోయింది. ఈ లంకలోనే నీ తల్లి సీతమ్మ వున్నదనీ, ఆమె రక్షణం అవసరమనీ ఆలోచించావా? అందుకు తగినట్లు ఆచరించావా? ఒక్క విభీషణ గృహం తప్ప లంకంతా శ్మశానమై పోయిందికదా! ఆ మంటల్లో జానకమ్మ దహనం కాలేదా" అయ్యో! ఆ పాపాన్ని పొందలేను. మంచిది పోయి నక్కల పాలుచేశాను. పతికార్యం భగ్నం చేశాను. లంక కాల్చటం ఫలం పట్టలేదు. నా బుద్ధి హీనతవే కల్గిన అనర్థం బాపుకోవటానికి ఎంత కాలం పడుతుంది? కాలం పట్టినా గతం వర్తమానమవుతుందా? నా ఆత్రం ఎంత దుర్విపాకానికి దారి తీసింది? రోష మూర్ఛిత స్వాంతంతో మాడగట్టుకున్న కొంప కూల్చాను. ఆప్తులందరికీ తీరని వ్యథ తెచ్చి పెట్టాను. నా పాపానికి ప్రాయశ్చిత్తం లేదు. నేనింక జీవించటం భూమికి భారం. ఆ మండుతున్న మంటల్లో పడి మరణించనా? ఈ సముద్రంలో దూకి తిమింగిలాలకు ఆహారంకానా? లేక వడవానలానికి దేహం హవ్యం చేయనా? ఛీ ఛీ! ఏమి చేస్తే ఏముంది? నా తల్లి సీతమ్మ నాకు కనుపిస్తుందా? ఆమె ఆదరణవాక్యాలు విని చెవులు తృప్తి పడగలవా? ఇంత దుష్ట కార్యంచేసి, ఏ మొగంతో వానరభటులను దర్శిస్తాను? ఇంతకాలం నన్నేలిన రామభద్రుని సమీపిస్తాను? అనేవాటికాని, అనుకునే వాటికాని లేకపోవటంతో అతిచంచలమైన కపి భావం ఆత్మ వినాశనానికే సహకరించింది. కాని, ఆత్మ దర్శనానికి సహకరించలేదు. ఇంద్రియ నిగ్రహం ఎంత చేసినా, తపస్సెంత చేసినా, ఎంత అంతర్ముఖుడనైనా జాతిలక్షణం నాలో ఏం పోయింది? సహజంగా జన్మతో వచ్చిన గుణం జయించలేదేమో? శక్తి కలిగి కూడా

జానకమ్మను కాపాడుకోలేక పోయాను. ఆమె మంటలు తాకి మరణిస్తే, అమంగళం ప్రతిహతం అగుగాక. రామలక్ష్మణులు జీవిస్తారా? కృతఘ్నుడైన మిత్ర ద్రుహుడు మిత్రుల సిరికాంచి రాజ్యభోగాలలో మునుకురాడా? ఇటు వానరపతి మరణం, అటు రామలక్ష్మణుల మరణం చూచి, విని భరత శత్రుఘ్నులు? తమ బంధువులతో వానరులూ, తమ్మునితో భరతుడూ బ్రతికి బట్ట కడతారా? ఈ విలయాన్ని చూచి అమాత్యులైన పౌరులుంటారా? ఇంత చేటుకు ధర్మార్థ జ్ఞానహీనుడనూ, అభాగ్యుడనూ అయిన నేనే కారణం. నేను ద్రోహిని. దుర్మదుణ్ణి. చపలుడను. ప్రభుకార్య భంగకారిని. నేను మరణిస్తే నా శవం కాకగృధ్ర సృగాల శ్వానాలు కూడా ముట్టవు" అంటూ హీనరాని విచారంతో విహ్వలుడై, మరణోన్ముఖుడైన మారుతికి పూర్వంవలె శుభ శకునాలు శరీరంపై కనుపించినై. అంతలో మరణ ప్రయత్నం మాని ఆలోచనలో పడ్డాడు.

## జ్వలనుడు జానకిని కాల్చలేదని హనుమంతుడు నిశ్చయించుట

తాను చేసిన దంతా అజ్ఞాన జనిత కార్యంగా భావించి ఆత్మార్పణానికి సిద్ధపడిన ఆంజనేయునకు, సీతా దర్శనం కాక వెనుక దేహ త్యాగానికి సిద్ధమైనప్పుడు కలిగిన శుభ శకునాలే మళ్ళీ ఇప్పుడు కలగటంతో మనస్సులో ఏదో శక్తి మార్పు యోజించసాగింది. "కోపం ఎంత పాపహేతువు అవుతుందో ఆత్మహత్య కూడా అంత పాపహేతువే అవుతుంది. నా తల్లిని జ్వలనుడు తాకగలడా? అది సాధ్యమా? అగ్నిని అగ్ని ఎన్నడైనా కాల్చిందా? నేను వదలిన విభీషణుని గృహం ముట్టి దహించని పావకుడు పరమ పతివ్రతా శిరోమణి, పరమపావని, శీలవతి, సీమంతినీ మకుట మాణిక్యం, పుణ్యచరిత్ర, అయోనిజ, రామపత్ని అయిన సీతామాతను నేను సంకల్పించకుండా ఎలా సమీపిస్తాడు? అంత అవసరంవస్తే ఆమె సౌశీల్యం హుతవహుణ్ణే హోమం చేయదా? ఎవరి అనుగ్రహంతో నా తోక నంటి కూడా నన్ను కాల్చని అగ్నిదేవుడు ముగ్గురు సోదరులకు ఆశ్రిత దైవమై, రఘుకుల క్షీరాబ్ధికి రత్నమైన రామపత్నిని ఆ సీతారాముల అనుగ్రహం లేకుండా ఆమె దరిచేరగలడా?

వుంటున్నే? సకాలంగా వచ్చి నిన్ను మళ్ళీ కన్నుల కరవుదీరా కనుగొన గల్గాను. నా తెలివి తక్కువ తనంచే చేసిన పనివల్ల నీ కపకారం జరిగిందేమోనని ఆత్మహత్యకు పాల్పడ్డాను. గగనచరులు నీ క్షేమవార్తలు చెప్పుకుంటుండే ప్రాకట పొంది పరిహారంగా నా కాయం నీ పవిత్ర హస్త స్పర్శతో పావనం చేసుకోతలచి వచ్చాను. అమ్మా! నీ బిడ్డ వానరుడు. చపలుడు. తెలిసి తెలియక చేసిన దోషాలు క్షమించు. ఏలిన వాని కార్యం విఘ్నరహితంగా ముగిసింది. నీవు ఆశీర్వదించి అనుజ్ఞ ఇస్తే తరవ కార్యానికి కదంగుతాను" అంటూ రెప్ప వేసిన బిడ్డ తల్లివద్ద నిలిచి నట్లు నిలుచున్నాడు. ఆ మాటలు వింటున్న మైథిలి నేత్రాలనుంచి ఆగకుండా అశ్రువులు నేల రాలినై. ఆమె హనుమవంక పుత్ర వాత్సల్యంతో తనివిదీరక చూస్తూ, "నాయనా! హనుమా! నీవుకాదురా అదృష్టవంతుడవు. నిక్కంగా నేనురా. నీ వంటివాడు, స్వర్గ మర్త్య పాతాళాలను శాసించే శక్తి కలవాడు, చిరంజీవి, అమృతమూర్తి, స్వామికార్య ధురంధరుడు అవ్యాజంగా నన్ను "అమ్మా" అని అమాయకంగా నోరార పిలుస్తుంటే ఏవే యోగం నాకు కల్గినందుకు. నిన్ను బంధించారనీ, నీ వాలం తగుల బెట్టి హింసించారనీ రాక్షస స్త్రీలు చెప్పారు. నేనెంత బాధ పడ్డానో నీకు తెలియదు. ఇప్పటివరకు నీ క్షేమం తెలియక శరీరధారణ మాత్ర స్పృహతో నున్నాను. నిన్ను చూశాను. పోయిన ప్రాణం తిరిగి వచ్చి నట్లయింది. రవిపుత్ర మంత్రివి. రఘుకుల తిలకుని దూతవు. అనిలుని వరప్రసాదంతో అంజనాదేవికి అవతరించిన కారణజన్ముడవు. వేద మూర్తివి. గీర్వాణ భాషా భూషణుడవు. నిశ్చల బ్రహ్మ చర్య వ్రత నిష్ఠుడవు. నీవెందుకు తప్పు చేస్తావు? నీవు చేసే పని తప్పంటానికి నేనే కాదు నా భర్త సత్యధర్మ ప్రతిష్ఠాపకుడు దాశరథి కూడ తగదంటే అతిశయోక్తి ఏమీ కాదు. నీవు మాకు మేలు చేశావని మెచ్చుకుని అంటున్న మాటలు కావివి. నీవు ఎవరి పని చేసినా, లేక నీకై నీవు ఏ పని చేసినా ప్రశంసా పాత్రుడవే. మళ్ళీ ఇప్పుడంటున్నాను. నిన్ను కన్న వారు సృష్టిలో సార్థకతలు కన్నవారు. విధి వైపరీత్యంచే విడిపడిన మా దాంపత్యం అనుసంధానించిన కీర్తి నీకే దక్కింది. లంకా దహనంకానీ, సముద్ర తరణంగానీ, శత్రు దుర్గంలో రహస్య రక్షణం చేస్తూ అన్వే

గించటం కాని నీ వొక్కడవే చేయకలిగావు. నీ అండదండలతోనే నా భర్తా, మరదీ, రవి సుతుడూ, ప్లవగ పుంగవులూ లంకా ప్రవేశం చేయాలి. నా పతి సర్వశక్తి సంపన్నుడైనా శాంతమూర్తి. శరణాగత రక్షణుడు. అందుకే నీ కింతగా చెప్తున్నాను. దూతగా నీవెంత శ్లాఘనీయంగా నీ వంతు కార్యం నెరవేర్చావో, నేతగా నా నాథుడు లంకా నగర మర్మ చ్ఛేదం చేసి, రావణుని సబాంధవంగా సంగరంలో సంహరించి నన్ను కొనిపోవటం అంత శ్లాఘనీయ కార్యం. అందుకు తగిన మంత్రాంగం నీవల్లనే జరగాలి. నేను నిన్ను కోరిన దానికంటే వేయి మడుంగులు నా తృప్తికై నీవు చేయగలవనీ, చేస్తావనీ నమ్మకం నాకు వుంది. నిర్విఘ్నంగా నీ ప్రయాణం కొనసాగుతుంది" అని జానకి హనుమంతుని దీవించింది. ఆ తల్లి ఆశీస్సుల అందుకున్న హనుమ "అమ్మా! ఇంకా శంక ఎందుకు? అన్నీ నీవు కోరుకున్నట్లే జరుగుతై. సాగరం తరించ లేరని సందేహించకు. తప్పక సర్వ వానర సమేతుడై, సుగ్రీవుడు వెంట నడవగా, రామభద్రుడు సోదరునితో కూడి లంకా ద్వీపంలో దండు విడుస్తాడు. దైత్యపతిని సమూలంగా సమర క్షోణిలో చంపుతాడు. అగ్నివలె పవిత్రమైన నీ పాణిని ప్రణయభావంతో గ్రహిస్తాడు. నామాట నమ్ము. అంతా శుభాంతం అవుతుంది. ఇక నేను రామ దర్శనార్థం పోతాను. తల్లీ! నాకు సెలవు దయచేయి" అని సాష్టాంగ నమస్కారం చేస్తుంటే పరమ పూతమైన పాణి తలంతో హనుమ శిరస్సు స్పృశిస్తూ, ఆనందాశ్రువులు పొరలగా అనుజ్ఞ ఇచ్చింది.

## సీతాదేవి సెలవుగొని హనుమంతుడు అరిష్టాద్రి అధిరోహించుట

జానకీ పరమాదరణ పాత్రుడైన పావని, భూమిజకు పునరభివాదం చేసి, వచ్చిన కార్యం ఫలించిందన్న సంతోషం హెచ్చుగా అశోకవన సమీపంలో వున్న అరిష్టాద్రిని చూచాడు. అది వృక్ష రాజ వ్రాతమై, పంచాననస్వన గంభీర గుహాంతరాభోగమై, యక్ష గంధర్వ ముని ఫణి వ్యూహ నిషేవితమై, స్వాదు ఫల సమాకీర్ణమై, పద్మ కుముద పరివృత రంగన్నీలోద్యానమాలా హృద్యమై, శృంగాగ్ర లంబమాన పయో

దోత్తరీయమై, ఖర కర కర సంతప్త సమున్మిషద్ధాతు రాగరోచిష ద్దామమై, ఉకద్భంగా భంగ తరంగ ప్రభవన్నాద మేదుర జలపాతమై, దరీగమన జాత మంద్ర స్వనాధ్యయన ఘోషా పూరితమై, ప్రస్రవణ ధ్వాన విస్పష్ట రమ్యగీతమై, పతత్ జల శీకరాకులమై కనిపించింది. పద ముద్రలు పడుతుండగా పావని పర్వతం వద్దకు నడిచాడు. చక్కగా పుష్పించి, శరత్కాల మేఘంచే, వార్ధకంలో వచ్చే వణకే దాన్ని, వెదురు బొంగుల పగుళ్లలో దూరబడి వెడలి వచ్చే గాలి సవ్వడి కూజితంగా కల దాన్ని, పాములు బుసకొట్టినట్లు హనుమపై నిశ్వాసం విడిచేదాన్ని, ఎలెదల మంచు నింపి గంభీరమై, ధ్యానముద్రలో వున్నట్లు భ్రమ కల్పించే గుహలున్నదాన్ని, కదలి దంగల పాదాలతో కదలి వస్తున్నట్లు కనబడే సాల తాలాశ్వ కర్ణ వంశ ప్రకీర్ణమైనదాన్ని, అరిష్ట నగాన్ని హనుమ ఆరోహించాడు. ఒక వంక చక్కగా పూచిన పెక్కు పూ లతికలచే అలంకృతమై, వింత వింత రంగులతో విచిత్రంగా వున్న మృగ సమూహంతో, మరో వంక అభివ్యాప్తమై, రకరకాల వర్ణాలతో వన్నెలు చిమ్మే ధాతువులతో, శీతల జలంతో ఇంకో వంక భాసితమై, వేరొక వంక బండలతోనూ, గుండులతోనూ, ప్రస్రవణాలతోనూ దుర్గమై యక్ష రాక్షస గంధర్వ ఋషి కిన్నరాహి సేవ్యమై, సింహవ్యాఘ్ర కలిత గహ్వరమైన పర్వతంపైన నిల్చి పార చూచాడు. దక్షిణ దిశన సముద్రాహంలో తిమి తిమింగిల ఝష కుళీర మకర కచ్ఛప మహాహికుల సంకులమై, భయంకరమైన సముద్రాన్ని దాట తలచి ఉత్తరాభిముఖంగా నిలుచున్నాడు. "జయ జయ జానకీ మాతకు. జయ జయ కౌశల్యా నంద వర్ధనునకు. జయ జయ సమస్త కీశ లోకేశునకు. జయ జయ మరుద్వహ్ని విభాలకు" అని అంటూ ఒక్కసారి రెండు పాదాలను ఒక్కచోట చేర్చి ఒత్తాడు. ఆ ఒత్తిడికి శైలరాజం తత్తరపడింది. తత్ప్రదేశ సంచరత్సత్వాలు స్థాన భ్రంశం పొంది ధరణి దొరలిపడినై. వికసిత ప్రసూన సంపత్తిలో ద్రుమ సంతానం, కందరస్థ సింహ శార్దూల చయం బిత్తరపాటుతో లేచి ఘోరారావం చేస్తూ పరుగు తీసింది. వాయువు కుంభించి చరణ యుగళ పీడనంతో బాహువులు చాచి అంబ రానికి ఉద్గమిస్తుండే ఊరు సంచాలనంతో ఉద్భవించిన ఝంఝానిలానికి

చెట్లు, చేపలు, గండశిలలు, కొండ చిలువలు, కులిశాహతి చే కూలిన పర్వత పంక్తి వలె భగ్నమై పారావారంలో పడినై. ఆ పర్వత కంపనానికి భయపడి వణికింది. పక్షి మృగ కులం విరామ రహితంగా ఘోషించింది. చీరెలు జారంగా, పైటలు ప్రేలగా, వేణీ భారం వీడగా, వదనంపై రేగిన కురులు కూడగా, ఆభరణాలు జారగా, అలసత మీరగా విద్యాధర కాంతలు వియత్తలానికి ఎగిరిపోయారు. అధిక ప్రమాణంగల అహికులం మణి మండిత ఫణాలు బద్ధలై విషం వెడల గ్రక్కింది. కిన్నరోరగ యక్ష కింపురుషులు నగం వదలి గగన చరులైనారు. దశ యోజన విస్తీర్ణం, త్రింశద్యోజన సమున్నతం అయిన అరిష్టనగం త్రుటి కాలంలో హనుమత్పదఘట్టన శక్తికి అధో లోకానికి క్రుంగింది. ఈ విధంగా ప్రయత్న కార్య ఫలసిద్ధి, అభీష్ట జన దర్శనోత్సాహానందం హనుమకు ఎనలేని జవం చేకూర్చగా, అవలీలగా అంబుధిపై అంబరంలో పోసాగాడు.

## మారుతి మరల ఉత్తర తీరాన్ని చేరుట

అర్కాకారంపదమూ, ఉడుతారకసంచయమూ, తిష్యశ్రవణహంస శిబిరమూ, జలధర శైవాల శాద్వలమూ, పునర్వసు మీన విరాజితమూ, అంగారక గ్రహ గ్రాహమూ, ఐరావత ద్వీపమూ, స్వాతి హంసాపచితమూ, వాత సంఘాత వీచీ చంద్రాంశు శిశిరాంబుమంతమూ, సిద్ధ యక్ష గరుడ గంధర్వ భుజగ ప్రఫుల్ల నీరజమూ, అయిన అంతరిక్షార్ణవంలో జలనిధిని నౌక తరించిన చందాన నవ నవ విన్యాసంతో హనుమంతుడు అశ్రమమై పయనించాడు. ఆకాశాన్నే మ్రింగుతాడో, అబ్ధైనే హృదం కొరతాడో, తారార్క సహితంగా అంబరాన్నే ఆహరిస్తాడో అనే భయం అమరులకు అడుగడుగున కలిగిస్తూ, మేఘాలను చీలుస్తూ, తెలుపు నలుపు పసుపు ఎరుపు కాంతులతో, కృష్ణ లోహితవర్ణంతో తేజస్వి అయిన హనుమ దేహ రుచి తోచి మేఘమాల తేజరిల్లింది. ఇంకా ఇంకా మబ్బుల్లోకిపోతూ, ఇంకా ఇంకా క్రిందికి దిగుతూ, మెరపులాగా మెరుస్తూ, శంకర జటా జూటంలో వెలిగే చంద్రరేఖవలె పావని పయనం సాగించాడు. విశద వస్త్రాన్ని ధరించి, వివిధ మేఘ సమూహ సంవృతమై,

కనుపించీ కనుపించక తోయజ వైరిలాగా మింట హనుమ గమనం దోబూచులాడింది. ముహుర్ముహుర్విచ్ఛేదిత మేఘ మాలాకలితుడై, అమృతం గ్రహించి పోతున్న అండజ శ్రేష్ఠునివలె వ్యోమగతుడై పోతున్న సామీరి చూడ్కులకు శోభనం కూర్చాడు. తనవారికి ధైర్యం కల్పించి, జలధితరించి, సీతను పొడగాంచి, అశోకాన్ని భంగించి, అసురులద్రుంచి, తన నామం అందరి నోళ్ళలో నానించి, లంకను దహించి, మహిత తేజంతో మరలి వస్తున్న మారుతి జలధి మధ్యానికి చేరుకున్నాడు. అంతవరకు తన రాకకై నిరీక్షిస్తున్న మైనాకుని మర్యాద పూర్వకంగా స్పృశించాడు. ధనుర్గుణ నిర్గత మార్గణంవలె రివ్వుపోతూ కనుచూపు మేరలో మహేంద్ర పర్వతాన్ని కాంచాడు. పుష్కలావర్త జలధరం ఘోషించినట్లు దశదిశలు భేదిల్లగా సింహనాదం చేశాడు. ఆభీకరారావానికి ప్రకృతి ప్రతిధ్వనించింది. త్రోసుకుని వస్తున్న సంతోషంతో తోక విదిల్చాడు. కులాచల యుక్తంగా కువలయం, సూర్యచంద్రగ్రహ తారకా సంయుక్తంగా గగనం క్షోభించింది.

## హనుమ సింహనాదం విని అగచరులు హర్షం పొందుట

అంగద జాంబవంతుల అనుజ్ఞతో అవని జాత అన్వేషణార్థం హనుమ పోయింతే ఆతనికి శుభం చింతిస్తూ ఏకపాదులై, ఉపరై నిల్చిన అగచరులు, ప్రళయ నిర్ఘోషం, అవిరళావర్తంగా వస్తున్న ప్రభంజనం పరికించి ధ్వనిదిక్కు దృష్టులు మరలించారు. ఆ సింహనాదం, ఆ వాయు వేగం హనుమంతునిగా గుర్తించారు. ఆ సమయంలో ఋక్ష రాజైన జాంబవంతుడు కపుల సమీపించి, "పడిన శ్రమ ఫలించింది. విజయసిద్ధి పొంది వాయుజుడు వస్తున్నాడు. పావని పోయిన కార్యం పండైంది. సంశయానికి తావులేదు. ఆ ధ్వనే చెప్తున్నది. మన హర్షం కోసం మారుతి తన రాక తెలుపటానికి సింహ ధ్వానం చేశాడు. సంకల్ప సిద్ధులకు లోకంలో అసాధ్యం అన్నది ఏమీ లేదు" అని ఆ వాయు ధ్వనుల రహస్యం ప్రకటించాడు. వృద్ధుడైన జాంబవంతుని మాటలకు సంతోష సమృద్ధులైన కపులంతా గంతులు వేశారు. కొందరు కొండ శిఖరం చేరారు.

అనేవులు కందని పల్కి రామకూడ సుఖాసీనుడైనాడు. “రాక్షసస్త్రీ రక్షితమైన రామపత్నిని అశోకవనంలో అవలోకించాను. ఆమె, భర్త దర్శనాకాంక్షతో సంస్కారం లేక జడలు కట్టిన కురులతో, ఉపవాసాలతో క్రుంగి కృశించి పోయింది. గుర్తింపరానంతగా మారిపోయింది” అని ఆమె కుశలవార్త కొద్దిగా వినిపించాడు. ఆ మాటలకు అంగదాదులంతా అమృతాస్వాదనం చేసినట్లు ఆనందంతో కొందరు కుప్పించారు. కొందరు దూకారు. కొందరు గంతులు వేశారు. కొందరు కిలకిల ధ్వనితో లోని సంతోషం వెలిబుచ్చారు. కొందరు తమ వాలాలను వేళ్ళపై గట్టిగా కొట్టి అరమోడ్పు కనులతో హనుమకు నమస్కారం చేశారు. కొందరు కొండపై నుండి దూకి హఠాత్తుగా ఆంజనేయుని ఆలింగనం చేసుకున్నారు. కొందరు పారవశ్యంతో పావని పాదాలపై పడ్డారు. అవని పృష్ఠంలోని ఆనందమంతా అగచర సంతానరూపం దాల్చిందా అన్నట్లున్న ఆ పవిత్రసమయంలో అంగదుడు లేచి అంజలిబంధంతో హనుమకు అభిముఖంగా నిల్చి, “వానరేశ్వర ప్రధానామాత్యా! పక్షిరాట్పవన జవ బంధురా! పావనీ! నా హార్దికమైన అభివాదం స్వీకరించు. నిస్తుల్యము, విస్తారమైన నీరధి నిస్తరణ మొనర్చి శస్త్రంగా మరలిరాగల ప్రశస్త జవసత్త్వాలుగల నీతో సమానులేరీ? నీ ప్రభుభక్తి, నిరుపమానమైన నీ శక్తి ఎన్నని నేనేమని ప్రశంసించగలను? మా అందరి అదృష్టం నీ మూర్తిదాల్చి శ్రీరామ సతిని సీతాదేవిని దర్శించి వచ్చావు. నిరంతర సీతా వియోగదుఃఖితుడై శ్రీరామచంద్రుడు నీ సేవలో ఇపుడు ధైర్యం సంతరించు కున్నాడు. నీ పోకా, తిరిగిరాకా విడువకుండా యథాతథంగా వివరించి మా వీనులకు విందు గావించు” అని ప్రార్థించాడు. అంగదుని అభ్యర్థనం విన్న కపులంతా కర్ణాలు రిక్కించి సమీపంగానున్న ఎత్తైన బండలపై కూచున్నారు. అంత సముద్రాన్ని ఎలా దాటాడో, అభేద్యమైన లంకాదుర్గంలో ఎలా ప్రవేశించాడో, మాయామారి మాంసాశనుల కనులు కప్పి సీతాన్వేషణం ఎలాచేశాడో, లోకవిద్రావణుడైన రావణునితో ఎలా సంభాషించాడో వినాలనే కుతూహలం కపులందరిలో సందడించింది. వానరులు హస్తన్యస్తమస్తకులై, ఆకాంక్షాపరులై, హనుమ ముఖోద్గ

తమై వచ్చే అవనీజాత సందర్శన వార్తామృత పానార్థం ఆసక్తులై చూస్తున్నారు.

## జరిగిన విషయమంతా సామీరి కపులకు చెప్పుట

కపిశ్రేష్ఠుడైన మారుతి గంభీర కంఠంతో సహజమైన వనచరులను సమీక్షించి "పూజ్యులారా! మీరంతా నాపై చూపించిన అపరిమాన గౌరవాలకు కృతజ్ఞతతో ప్రణామం చేస్తున్నాను. ఈ శుభవార్త కొనిరావటంలో నా ఆధిక్యం ఏమీలేదు. నిశ్చల ధ్యాననిష్ఠులై మీరంతా ధ్యానం చేయటంవల్లనే జరిగింది. పవిత్ర రాఘవుడు సంకల్ప సిద్ధుడు కావటంచేతా, సీతామాత పతివ్రత కావటంచేతా సాధ్యమైంది. నేను కార్యంలో నిమిత్తమాత్రుణ్ణి. జరిగిన సంగతులు యథాతథంగా మీ కిష్టమైనా మీ తృప్తికోసం చెపుతాను" అని అనగానే జాంబవంతుడు లేచి "అంజనానందనా, పవమానీ! ముందు ఆ విషయాలు చెప్పు. ఆమెను ఎలా చూశావు? ఆమె ఇంతకీ ఎలా వున్నది? ఆ తల్లిని దశముఖుడు ఎలా చూస్తున్నాడు? తరువాత చేసే కార్యం రాఘవుల సమక్షంలో చెప్పుదువు గాని. ఇప్పుడు అక్కడ చెప్పరాని రహస్యాలుంటే విప్పి చెప్పి మమ్మల్ని సంతోషపెట్టు" అని కోరాడు. అందుకు హనుమ సంతుష్టుడై, ప్రహృష్టుడై, జానకీదేవిని మనసారా ధ్యానించి మ్రొక్కి ఈ విధంగా చెప్పసాగాడు. "అవతలి దక్షిణతీరం చేరేందుకు ఈ పర్వతాగ్రంనుంచి లంఘించటం మీరంతా కన్నార కన్నారు. జలమధ్యంలో మైనాకుడనే పేరుగల పర్వతరాజు నా గమనానికి అడ్డంగా నిల్చాడు. మొదటనే విఘ్నం మొదలైనదే అన్న కోపంతో తలతో ఢీకొట్టి, తోకతో చరిచాను. ఆ పర్వత శిఖరం వేయి ముక్కలై పోయింది. ఆ ఘట్టానికి నిల్చి, నా కార్యం తెలిసి, నేను నీ తండ్రిచే కాపాడబడిన వాడను. వజ్రాహతి నా పక్షాలు పోకుండా ఈ పారావారంలో పడేసి రక్షించటంచేత, రామ కార్యార్థం పోయే నీవు కొంతకాలం విశ్రాంతి తీసుకుని వెళ్ళమని ప్రార్థించాడు. గగన మధ్యంలో నిల్వనని చెప్పి అతని సమ్మతితో ముందుకుపోతుంటే, నాగాంబ వేగంతో అడ్డు నిల్చి నా ఆహారం కమ్మని నిరోధించింది. ఆమె నా మాటలు వినలేదు. జానకి వార్త తెలిసి వచ్చిన

మీదట నీ కోర్కె తీరుస్తానన్నాను. నన్ను మోసగించక వెంటనే నాకి చిక్కుమంది. నే శరీరం పెంచాను. ఆమె కూడా నాకంటే హెచ్చుగా నోరు తెరిచింది. వెంటనే హ్రస్వరూపంతో గర్భంలో ప్రవేశించి కర్ణం గుండా వెలుపలికి వచ్చి సెలవడిగాను. ఆమె మెచ్చి, నన్నాశీర్వదించి తన లోకానికి పోయింది. భూతకోటి నన్ను శ్లాఘించింది. శరవేగంతో పోతున్న నన్నెవరో కానరాకుండ నిరోధించింది. నలువంకల చూచి, కారణం తెలుసుకోలేక జలధిలో చూచాను. ఒక పెనురాకాసి మున్నీటిపై వుండి నా ఛాయను మ్రింగుతూంది. దానితో నా వేగం కుంఠితం కావటానికి కారణం తెలుసుకున్నాను. నేను దాన్ని చూడగానే పెద్దగా గర్జించి, తర్జించి నన్ను అపహసించింది. నా ఆకలి తీరకుండా నీ వెక్కడికి పోతావని నిలిపింది. దాని వక్త్రం కంటె ద్విగుణంగా శరీరం పెంచాను. నాకంటే అది దశగుణితంగా తెరచింది. వెంటనే గుజ్జు రూపంతో కడుపులో చొచ్చి ప్రేవులు బయల్పడగా చీల్చి మింటి కెగిరాను. అది చచ్చి అంబుధిలో మునిగింది. నభశ్చరులైన చారణులు సింహిక చచ్చిందని చెప్పుకుంటుంటే విన్నాను. పిమ్మట వృక్ష సంకీర్ణంగా వున్న అవలి తీరాన్ని చూచాను. అదే లంకగా ఎంచి, చీకటిపడేదాకా అక్కడ నిలిచి రాక్షసులు చూడకుండా సూక్ష్మ రూపంతో లంకలో ప్రవేశించాను. ఆ వేళ కల్పాంత ఘారా ధర శరీర ఘోరంగా అట్టహాసం చేస్తూ ఒక భీకర మూర్తి నాపై కురికింది. ఎడంచేత బలంగా చెంపపై చరిచాను. ఆ దెబ్బకు నేల కూలి, తెలివి తెచ్చుకుని, "హనుమా! నేను లంకను. నా రక్షణ వల్లనే దీనికి ఇంతా నామం వచ్చింది. నన్ను జయించిన వాడి చేతిలోనే లంక జయింపబడుతుంది. నిన్నెవరు అడ్డుకోలేరు. స్వేచ్ఛగా ప్రవేశించు" మంటూ మాయమైంది.

ఆ వెనువెంటనే లంకలో చొచ్చి రాత్రంతా సీతామాతను అక్కడ వెదకాను. నా శ్రమంతా వమ్మైంది. నేను దుఃఖంలో ఎగిరి ప్రాకారందాటి చూచాను. సుందరంగా వున్న తోట కనుపించింది. ఆ తోట మధ్యలో వున్న శింశుపావృక్షంపై దిగాను. దానిపైనుండి, నీరేజ పత్రాంబకను, నిత్యోపవాసాలలో నీరసించిన దేహంకలదాన్ని, ఏకాంశుకను, ధూళిధూసర కేశాంతను, శోకసంతాప దీనాంగిని, భర్తృ ధ్యానైకచిత్తను, ఖలులనడుమ

వున్న లేడివలె రాక్షస స్త్రీలమధ్యలో వుండగా ఒక శీలవతిని చూశాను. ఆమె, 'రామరామా' అంటూ ఆక్రందనంచేసి భూమిపైపడి, మంచులో శోభచెడిన తమ్మిపూవులాగా, విషణ్ణయై, దానవభీతితో మృతిచెందటానికి ఉద్యుక్తురాలైంది. "ఆమే సీతయేమో" అని అనుమానంతో వుండగా, నాశంకాని వారకార్యం అన్నట్లుగా రావణుడు అంతఃపుర స్త్రీలతో అక్కడికి వచ్చాడు. నేనింకా సంక్షిప్త శరీరంలో చెట్టులో దాక్కున్నాను. వాడు ఆమెను కామవశంలో కఠినవాక్కులు పలికి కష్టపెట్టాడు. "రెండు నెలలే గడువిస్తున్నాను. నీ బుద్ధి మారకపోతే నీ రక్తం త్రాగుతా"నని తర్జించాడు. ఆ మాటలకు అదురుచెంది, తన పుట్టినవారినీ, మెట్టినవారినీ పేర్కొని, తను ఎవరో చెప్పి, వాడి భీరుత్వాన్ని దెప్పి, "నన్నప్పగించి, నా పతి పాదాలపై పడితే నిన్ను క్షమిస్తాడు. లేకపోతే లంకతో కలిసి నీవూ లేకుండా పోతావు" అని కర్కశంగా పలికింది. ఆమె పలుకులు ఆలించి, కోపించి, గ్రుడ్లు పెద్దవిచేసి గుద్ది చంపటానికి యత్నిస్తాడు. అంతఃపురాంగనలంతా ఆక్రోశించారు. అంతలో (ఇక్కడ పూర్వం ధాన్యమాలి అనిచెప్పబడింది. ఈపేరుకూడ ఆమెకు వున్నదేమో) మందోదరి పేరుగల కాంత అడ్డంవచ్చి కోపం చల్లార్చి వెంటబెట్టుకుని అక్కడ వున్న విశ్రాంతి మందిరానికి కొనిపోయింది. దశాస్యుడేగగానే దానవ కాంతలు ఆమె చుట్టూచేరి గద్దించి, బెదిరించి, తర్జించి కఠినంగా కొన్ని నీచ వాక్యాలు పలికారు. వాళ్ళ మాటలను ఆమె లెక్కగానలేదు. కొందరు పోయి ఆమె నీతు స్వీకరించదని చెప్పి వచ్చారు. కాలం మించుకుండే అంతా కన్నుమూసి నిద్రించారు.

ఒంటిగా ఆమె "రామ రామా! రామా! రక్షింపవా?" అంటూ కన్నీరు మున్నీరుగా ఏడుస్తుంటే, త్రిజట అనే పేరుగల అసురకాంత త్రుళ్ళిపడి లేచి, తక్కినవాళ్ళను కూడా లేపి తనకు వచ్చిన కలంతా చెప్పింది. "మన ప్రభువుకు నాశనం, మైథిలి భర్తకు విజయం తథ్యం. ఈమెను శరణువేడుదాం. ఆమె తప్పక మనల్ని కాపాడుతుంది" అని చెప్పింది. ఆ సమయంలో ఆమె పొందుతున్న బాధలనుచూచి, లంకంతా నాశనంచేసి, ఆ తల్లిని కాని తిరిగి వస్తాననుకున్నాను. మళ్ళీ విచారించమని, కర్తవ్యం నిర్ణయించమని ఇక్ష్వాకుచరితం, రామలక్ష్మణుల ప్రతాపప్రభావాలూ గానం

చేరాను. అనానందిని, తలపైకెత్తి నన్ను చూసి, "ఓ వానరశ్రేష్ఠా! నీవెవ్వడవు? ఎవరు పంపారు? శ్రీరామునితో స్నేహం నీకెట్లా లభించింది? సత్యం చెప్పు" మంటూ కన్నీరు కురిసింది. నేను నా పేరు చెప్పి, రామ రవిపుత్రుల చెలిమి వర్ణించి, వాలివధ, సీతాన్వేషణకై వనప్రభువు అనతి ఇవ్వటం మొదలైనవన్నీ చెప్పాను. "అమ్మా! నిన్ను చూచిన తర్వాత గుర్తుగా అంగుళీయం ఇమ్మని నీ పతి నాకు అందించాడు. ఇదిగో తీసుకుని నాకు ఆజ్ఞ ఇస్తే, నిన్ను తోడుకుని నీ పతి సన్నిధి చేరుస్తాను" అని చెప్పాను. ఆ అమ్మ అందుకు అంగీకరించలేదు. "నా భర్త వచ్చి రావణుని చంపి నన్ను కొనిపోవలసిందే కాని, అన్యుల వెంట రాతలచలేదు. నీవు ఆప్తుడవే కాక ఆత్మజునివంటి వాడవైనా, శ్రీరాముడే విజయుడై నన్ను గ్రహించాలి" అని చెప్పి చూడామణి నా కోరికపై ప్రతిగా ఇచ్చి అనుజ్ఞ ఇచ్చింది. దాని భద్రపరచి ప్రయాణోన్ముఖుడను కాగానే, "నాయనా! హనుమా! నాకు రావణుడు పెట్టిన గడువు మాసద్వయం. నేను మాత్రం ఒక నెల మాత్రమే మీకై వేచి వుంటాను. ఆపైన చరిత్ర ముగుస్తుంది. భవిష్యత్కార్య భారమంతా నీపై పెట్టి పంపుతున్నా"నని కన్నీళ్లు పల్కింది. ఆమె ధైర్యంగా వుండేందుకు నా శరీరం పెంచి అశోకవనం అధ్వాన్నం చేసి పెనుబొబ్బ పెట్టాను. ఆ కేకకు అదలిన అసురవనితలు పరుగున పోయి పతికి చెప్పారు. అశోకభంగం అంతశ్శల్యమై అసురుల కింకరులనే వారిని డెబ్బైవేల మందిని నాపై యుద్ధానికి పంపాడు. వారంతా నా చేత చచ్చారు. మళ్ళీ శత్రువులు వచ్చే లోపల అక్కడి మందిరాన్ని, అడ్డగించిన చైత్యపాలకుల నూర్గని ధ్వంసం చేసి అరిచాను. ఆ తర్వాత క్రమంగా జంబుమాలి, అమాత్య పుత్రాష్టకం, అసుర సేనా నాయక పంచకం వచ్చింది. వెంటనే అంతకపురం చొచ్చింది. అక్షయుడనే రాక్షస పతి పుత్రుడు వచ్చాడు. వచ్చిన రెండు గడియల్లోనే చచ్చాడు. ఆపై పెద్ద కుమారుని రావణుడు ఇంద్రజిత్తును పంపాడు. వాడు నన్ను జయించలేక లోపల సిగ్గిల్లి బ్రహ్మాస్త్రంతో బంధించాడు. దైత్యులంతా త్రాళ్ళతో నా దేహాన్ని కట్టారు. వాళ్ళ వెంటపోయి దైత్యపతిని చూచాను. వాడు కాలరుద్రుడై, కన్నులెర్రచేసి నా రాకను ప్రశ్నించాడు. నేను దాచకుండా వచ్చిన కార్యం చెప్పాను. "నా పేరు హను

మంటుని. నా ఏలిక సుగ్రీవుడు. నా దైవం రామచంద్రుడు. నేను రామదూతనై వచ్చాను. నీకు హితోపదేశం చేసిపోదామని ఈ మార్గం త్రొక్కాను. ఇక పోతున్నా"నంటూ లేచాను. వాడు నా మాటలకు ఉగ్రుడై భగ్గుమంటూ మరణశిక్ష విధించాడు. వెంటనే వాడి తమ్ముడు బుద్ధిమంతుడు విభీషణుడు లేచి వారించి దూతను చంపటం దోషమని చెప్పాడు. అది విని నా తోక కాల్చి పురమంతా త్రిప్పమన్నాడు. రక్కసులు గుంపుగా వచ్చి, పాత గుడ్డలను నూనెలో ముంచి నా తోకను చుట్టి నిప్పంటించి వీధుల వెంట త్రిప్పసాగారు. అదను వచ్చినందున లంకా మర్మమంతా గ్రహించి, వాళ్ళను చంపి, కట్లు త్రెంపి లంకను దుంప నాశనంగా తగుల పెట్టాను. ఆ మంటలో మైథిలికి విపత్తు కలిగిందేమో అని చింతిస్తుంటే, అశ్రవాదులు నా చేతనూ, జానకమ్మ క్షేమ వార్తనూ చెప్పుకుంటుంటే విన్నాను. ఆ వెంటనే ఆ తల్లి కడకు పోయి నమస్కరించి సెలవుగొని, దగ్గరలో వున్న అరిష్టాద్రి నెక్కి, మిమ్మల్ని చూడాలనే ఉత్సాహంతో చంద్రార్క తారాగణ సంసేవ్యమైన జలధర మార్గంలో ఇక్కడికి చేరుకున్నాను. నా వాళ్ళందరినీ కనుగొన్నాను. శ్రీరామానుగ్రహంవల్లా, సీతామాత ప్రసాదంవల్లా, మీ తపస్సువల్లా వానరపతి ఇచ్చిన ఆజ్ఞను ఇంతవరకు చేశాను. ఈ పైన చేసే కార్యం అవశ్యంగా చేయటానికి మీరున్నారు" అని ముగించాడు.

## సీతను గొని వచ్చి శ్రీరాముని దర్శించుట యుక్తమని హనుమ చెప్పుట

అంగద జాంబవంతాదులు హనుమ జరిగిన విషయం చెప్తుంటే, ఉత్సాహ సంతోష భయాలు ఒక్కసారే పొందారు. "ఇంతటి కార్యం హనుమ దక్క ఇంకొకరు చేయలేరు. వానర ప్రపంచంలో మేటులని చెప్పబడే వనాటులంతా ఇటే వచ్చారు. వారంతా హనుమ రక్షణచేతనే బ్రతికారు. రిక్తులుగాపోతే ప్రభువుచేతా, పోకపోతే ప్రాయోపవేశంచేతా ప్రాణాలు పోగొట్టుకునే ప్లవంగ లోకం, బుద్ధిమంతుడూ, శక్తిమంతుడూ, బలవంతుడూ అయిన హనుమంతునిచే ఉద్ధరింపబడింది. ప్రాజ్ఞుడు ప్రభువైతే పౌరులు సుఖించినట్లు మారుతి సాధించిన విజయంతో కపి

మలానికే పేరు వచ్చింది. నరులు చేయలేని పని వానరులు చేశారన్న కీర్తి ఆచంద్రతారార్కం నిలిచిపోయింది" అని ఎవరికి వారు మహా మూర్తియైన మారుతిని మనస్సుల్లో ప్రస్తుతిస్తూ కపులంతా "జయ వీర హనుమా! జయ బాహుబలధామా! జయ రామ దూతా! జయ కపిలోక నేతా" అని నృత్యం చేశారు. వారిని కూర్చుండ సంజ్ఞచేసి మారుతి ఇలా అన్నాడు. "జానకీ సతీత్వంతో వానరపతి చేసిన ప్రతిజ్ఞ, రామచంద్రుడు చేసిన ప్రయత్నం సిద్ధించింది. నా చిత్తం మాత్రం సీతామాత విముక్తిని చింతిస్తోంది. మన అరాతి అలతిగా పోయేవాడు కాడు. తపోబలంతో లోకాలను దగ్ధం చేయగల సాహసి. బలాత్కారంగా జానకమ్మను తాకినా చెడక నిల్చాడంటే అతడెంత తపశ్శక్తి కలవాడో ఊహించండి. ఐనా సీతమ్మ పాతివ్రత్యం ముందు పనికిరాదు. ఆమెకు అతనిపై కోపం రాలేదు. జాలి మాత్రం వుంది. అందుకే అతడు ఇంకా సజీవుడుగా వున్నాడు. వాణ్ణి ఆ తల్లి ఆగ్రహంతో చూస్తే అగ్ని కూడా దహించ లేని అతని తపోబలం దగ్ధమయ్యేది. ఇది నా అభిప్రాయం. ఆమెను వెంటపెట్టుకుని రామ దర్శనం చేస్తే అందరికీ ప్రమోదం కలుగుతుంది. అందుకు వృద్ధుడైన భల్లూకపతీ, సేనాపతి అయిన అంగదుడూ అంగీకరిస్తే ఆమెను కొనిరాగలను. నేనొక్కణ్ణే లంకను బూడిద చేయగలనంటే మీరంతా కలిస్తే చెప్పవలసిందేముంది? శూరులూ, కృతాస్త్రులూ, వీరులూ, దుర్వారబలులూ, గగనచారులూ మీరంతా. నాకు సాయంగా నిలిస్తే లంకను నాశనంచేసి, దైత్యులద్రుంచి, విజయ లక్ష్మీసమేతంగా జానకీమాతను తెచ్చి రఘునందనున కర్పిస్తాను. లేదా! నన్నే ఈ కార్యం చేయమంటే చేస్తాను. ఇంద్రజి ఐంద్రం, బ్రాహ్మం, రౌద్రం, వారుణం మొదలైన దివ్యాస్త్రాలు నామీద ఏమీ శక్తి చూపలేవు. వాళ్ళు అస్త్రశస్త్రాలతో నన్ను ప్రహరిస్తుంటే, నేను శైలధారవలె శిలా వృష్టి కురుస్తాను. ఆధాటికి ఎదురులేదు. అసురులుకూడ నిల్వలేరు. వనధినేల దాటివచ్చినా రావచ్చు. మందరం సమూలంగా వణకినా వణక వచ్చు. కాని, జాంబవంతుని సంగ్రామంలో శత్రుసమితి కదలించలేదు. అసురుల్లో పేరువాసిగల పెద్దలనందరినీ అంగదుడొక్కడే హతమారు స్తాడు. పనస నీలుర వసకు వింధ్యాద్రికే దిక్కులేదనగా, తుచ్ఛ రాక్ష

ఎలా నిగ్రహించేది? మైందద్వివిదులతో మాట్లాడిని మరణదేవత కరుణ పొందని ఋషులలో గంధర్వాదులలో ఒక్కణ్ణి ప్రేరేపించి చూపండి. వీరంతా బ్రహ్మవరం పొందిన వరబలాధికులు. అశ్వినేయ గౌరవార్థం అమృతపానం చేశారు. అవధ్యులు. వరగర్వంతో సురలనే గెలిచారు. ఇక మన లెక్కేముంది? అశోకవన విధ్వంసం చేసినప్పుడూ, లంకాదహనం చేసినప్పుడూ మనవారి శక్తిసామర్థ్యాలు విస్తృతంగా చెప్పాని, ఈ విధంగా జయఘోష చేశాను. “రామచంద్రునకు జయమగుగాక. విద్విషద్ఘటాపటల చండకేసరి సుమిత్రా సూతికి జయమగుగాక. రామభుజా రక్షిత ప్లవంగమాన విక్రమోపేతుడగు రవిపుత్రునకు జయమగుగాక. రామచంద్రునకు దాసుడను. దూతను. హనుమంతుడనే పేరుగలవాడను. ప్రభంజనునకు కుమారుడను. నన్నెవ్వడు జయించలేడు” అని.

## సీత దురవస్థ కపులకు హనుమ చెప్పుట

ఆ మాటలు వింటూ శాఖాచరులు ఇంకా అంతగా పెరిగారు. తాను పోకున్నా తన శక్తియుక్తుల శత్రువుల సభలో ప్రకటించిన పావని పవిత్ర భావాన్ని ప్రశంసించారు. ఉత్సాహవంతులుగా వున్న కపులతో, “సోదరులారా! శీలవతీమణి, పద్మనేత్ర, క్రూర రావణుని నిర్బంధంలో చిక్కి, ప్రాణమాత్రావశేషయై జీవించియున్న జానకమ్మను తలచుకుంటే నా గుండె తరుక్కుపోతూంది. ముక్కిడి రక్కసి గుంపు నడుమ చిక్కి మేఘావృతనంతో మరుగైన చంద్రరేఖవలె ఉంది. పౌలోమి ఇంద్రునివలె అనురక్త భావంతో ఆత్మనాథుని నామోచ్చారణం చేస్తూ అయోధ్యా నగర సింహాసనలక్ష్మి క్షణాలు లెక్కిస్తూంది. ఒకే చీర. అది మాసి వుంది. కేశ సంస్కారం లేదు. జడలు కట్టుకున్నవి. ఆమె జీవిస్తుందో లేదో? మన దండయాత్ర ఎంత కాలం పడుతుందో? అంతవరకు ఆమె నిగ్రహంతో బ్రతుక లేదు. ఒక్క నెల మాత్రమే మన రాక కోసం చూస్తానన్నది. మొరటు రాకాసిమూక కరకు మాటలు వినలేక మాటిమాటికీ మూర్ఛపోతూంది. లోకవృత్తం తెలియని నాకే ఆ స్థితిలో ఆమెను చూచి గుండె బ్రద్దలైంది. కడుపు

మండింది. ఆమెకోసం లోకాలోకాలను పీడించి శోకమయం చేయాలని పించింది. నిమిష నిమిషానికీ ఆ తల్లి హేమంతంలో తామర తూడు లాగా వాడువారుతూంది. "నా పతి ఇప్పటికి రాలేదు. ఇక ముందు వస్తాడన్న ఆశ లేదు. ఈ రాక్షసాంగనలు అసహ్య భాషణాలతో అంతు లేకుండా ధ్యానంలోవున్న నా పతి రూపాన్ని పాడుచేస్తున్నారు. ఇంత కాలం సహించాను, కాని రావణుడు ఇక సహించలేడు. నన్ను బలాత్క-రించటమో, చంపటమో చేస్తాడు. నా శీలంతో వాణ్ణి దగ్ధంచేసినా నాభర్త సన్నిధికి నేను పోలేను. ఆయన సత్య పరాక్రమానికీ, అప్రతిహత ధనుర్విద్యా కౌశలానికీ, పురుషత్వానికీ మచ్చ తేవటానికి మనసురాదు. ఈ జన్మకు ఆ దివ్య మంగళ విగ్రహాని సాహచర్యం ఇంతవరకేయని తృప్తితో నా శీలంచే నన్నే కాల్చుకుంటే మంచి"దని మరణోద్యుక్తురాలైంది. నేను రామచరిత గానం చేయకపోతే ఆమె ఆత్మహత్యకుపాల్పడి వుండేది. శిశిరంలో శోభ తరిగిన ప్రకృతి వసంతాగమనంతో పునః పరిపుష్టమైనట్లు నే నిచ్చిన ఆశతో, నాపై విశ్వాసంతో, కార్యభారం నాపై పెట్టి మాసం వరకు బ్రతుకుతానని మాట ఇచ్చింది. నేను చంపిన వారంతా ఇదివరకే జానకీ పతివ్రతా తాపాగ్ని సోకి మృతప్రాయులై యున్నారు. నేను కాల్చిన లంక ఆమె తీవ్రకోపానలావలోకనంతో కాలే వుంది. అంతంత కఠినోక్తులాడినా, దుర్మోహగుణ సన్నిపాతంలో ప్రలాపించినా, ఆ తల్లికి ఆగ్రహం రాలేదంటే, అఖండంగా ఆర్జించిన అతని తపోబలమే కారణం. దేవతా సంబంధమైన శస్త్రాలు వరబలంతో ఉద్దీపన పొందవేమో. అయినా అంత ర్గతంగా ఘర్షింపకపోవు. నిజంగా రావణ వధకు రాముడు నిమిత్త మాత్రుడే కాగలడు. కరుణాకరా! ఇంత ఎందుకు మీకు చెప్తున్నానంటే, జన్మ సహజంగా జానకమ్మ తనువు లత వంటిది. అది పతి వియోగ తాపార్దితమై పాడ్యమినాడు పరించే వాని చందురులాగా క్షీణించి ప్రభ కోల్పోతూంది. ఆమెను మీరు చూడలేరు కనుక, మన బ్రతుకంతా ఆమె పైనే ఆధారపడి వుంది కనుక కర్తవ్య నిర్ణయం కోసం కలవరపడి తెలిపాను" అని పావమాని ధరణిజ వృత్తాంతం హృదయవిదారకంగా వెల్లడించాడు.

# అంగదుడు సీతను తోడ్కొని వచ్చుటకు అంగీకరించుట

కపులంతా హనుమ వాక్శక్తితో సృజించిన జానకి రూపం హృదయ దర్పణాల్లో దర్శించి అశ్రుజలావరోధాన్ని అధికంగా పొందారు. కాలహరణం చేయటం కార్యం కాదనుకున్నారు. సామీరి సైన్య నాయకుడుగా సముద్రందాటి లంకలో ప్రవేశించి కొందరు రావణునితో పోరుతుంటే, అంగదుడో, లేక హనుమంతుడో, అవనిజాతను సురక్షిత స్థానానికి చేర్చటం అవశ్య కర్తవ్యమని భావించారు. అగచరనాయకుల అంతఃకరణ నిర్ణయం గుర్తించిన అంగదుడు లేచి "కపులారా! పరమ పూజ్యుడైన పావని చెప్పినదంతా విన్నాం. అతని అభిమతం కూడా తెలుసుకున్నాం. ఇంత జగదానందకరమైన కార్యంచేసిన హనుమ అభిప్రాయం మనకు శిరోధార్యం. చేయవలసిన కార్యంలో మూడింట నాలుగు వంతుల దుష్కరమైన కార్యం సామీరే సాధించాడు. శేష భాగం మనమంతా కలసి పూర్తిచేద్దాం. మీరంతా దివ్యశక్తిసంపదతో దేవతలనే నిరోధించగలరు. ఇంతచేసి "జానకమ్మను చూచివచ్చా"మనీ, కానరాలేదనీ రామచంద్రునితో చెప్పటం ఏమంత సామరస్యంగా వుంటుంది? మనకు ఆ విధంగా చెప్పటం లజ్జాకరం కాదా? కనుక మరున్నందనుని మనకు పెద్దగాచేసి, మైథిలిని రావణ విముక్తం చేయటం, కాని రావణం, ప్రభు సముఖానికి కొనిపోవటం యుక్తం. ఇదే నా అభిమతం" అని పలికాడు. ఆ పలుకులువిని వృద్ధ భల్లూకం జాంబవంతుడు లేచి "సహచరులారా! అంగదుని మంత్రాంగం, కార్య నిర్ణయం విన్నాను. ఇందులో దోషం ఏమీలేదు. చేయబోయేపని సాధ్యాసాధ్యాల విషయం ఆలోచించి, పూర్వాపరాలను సమన్వయించి చూద్దాం. హనుమ పల్కులు అందరం విన్నాం. అసలు రహస్యం మనం పసికట్టలేదు. ఆమె రాదలచుకుంటే హనుమ కోరినప్పుడే వచ్చేది. ఇప్పుడు మనంపోతే మాత్రం వస్తుందా? రాదు. ఆమె కోరింది రామచంద్రుని లంకా ప్రవేశం. రావ

ణుని వధించటం, తన పాణి గ్రహించటం. అంతవరకు ఎన్ని బాధలైనా ఓప్పుకుంటానని చెప్పింది. అమృతమూర్తి కనుక హనుమ ఆమె విముక్తికి ఆతురత చూపాడు. అవమానింపబడినా ఆమె ఆత్మశక్తిని అపరాధిపై ప్రయోగించలేదంటే, రావణుని చావు, ఆమె చేతిలోకాదు, మన చేతిలో కాని లేక శ్రీరామునిచేతిలో వున్నదని తేలింది. అది కూడా కేవలం ఆయన చేతిలో అంతా లేదనీ, కొంత కేశవుని కూకికలో వుందనీ స్పష్టమైంది. నాకు రావణుడు పొందిన వరాలూ తెలుసు. ఆతడు లోకవిద్రావణుడెందుకైనాడో తెలుసు. మనవాళ్ళ శక్తులన్నీ తెలుసు. ఆ తల్లి చెప్పిన గడువు నెలరోజులు. అంటే రావణుని జీవితం అంతవరకు శేషంగా వుంటుందని అర్థం. ఈ లోపల మనం పోయినా చేసేది ఏమీ లేదు. వృథా కాలక్షేపం. జరుగవలసింది సమరం. అందులో దేవతల జయించిన అసురగణంతో. అది అనుకున్నంత సులభం కాదు. మన వాళ్ళంతా జలధిదాటలేరు. మనం యుద్ధానికి సన్నద్ధులమై రాలేదు. అన్వేషణార్థం వచ్చాం. దాన్ని మన హృదయం వంటివాడు హనుమ ద్విగుణీతంగా, విజయవంతంగా సాధించాడు. నాకు ఎన్నివిధాల ఆలోచించినా మన రాజానుమతీ, రామ లక్ష్మణుల అంగీకారం పొంది కార్యశేషం పూర్తిచేయటం ధర్మసహంగా వుంటుందని తోస్తుంది. ఆ పైన మీ అందరి ఇష్టం" అని చెప్పి కూర్చున్నాడు.

## మర్కటశ్రేష్ఠులు మార్గమధ్యంలో మధువనాన్ని చూచుట

అంగదాదులంతా జాంబవంతుని తర్కసహం అయిన నీతిని విన్నారు. హనుమ వదనంవైపు అందరూ చూపులు త్రిప్పారు. "తన ప్రతిపాదన హేతుబద్ధం కాక అనురాగంతో కూడింది, అభిమానంతో నిండింది" అని హనుమ గ్రహించాడు. "తాతా! నీ మాటలు సత్య సమ్మతాలు. ఆచరణ యోగ్యాలు. రాజనీతి రత్నాలు. నేను ఆ తల్లి పడుతున్న బాధను కళ్ళారా చూచాను. ఆమెవున్న వునికిని అర్థం చేసుకున్నాను. అందువల్ల ముందువెనుకలు పరిశీలించక, ఆమె రక్షణమే అవశ్య కర్త

ష్యంగా భావించి పలికాను. చిరజీవి అంగదుడు నన్ను బలపరచటంలో నా శ్రమనూ, నా పైగల భక్తి విశ్వాసాలూ, ఆమె దైన్యస్థితీ కలసి ప్రముఖ స్థానం పొందాయి. మేమిద్దరం లోతుగా కార్యానుశీలనం గట్టిగా చేయని మాట నిజం. నీ వుపదేశం నాకు సర్వథా సమ్మతం. అందుకే మన పెద్దలు "పెద్దలు చెప్పేమాట పెరుగు కలిపిన చద్దిమూట" అన్నారు. గడువుకాలం గడచినా, సీతామాత ఇచ్చిన గడువు దాటకుండా లంక చేరాలి. కనుక మనం కాలినడకన కాకుండా గగనచారులమై కపిసార్వభౌముని కడకు పోదాం. యుద్ధతంత్రం, ప్రయాణ ప్రయత్నం కాలహరణం కాకుండా రేపే నిర్ణయించుదాం. లోకంమెచ్చే ధర్మబద్ధమైన నీ వుపదేశాన్ని నేను శిరసావహిస్తున్నాను" అని హనుమ చెప్పాడు. అందరూ హనుమ విజ్ఞతకూ, వినయ విధేయతకూ, బుద్ధి సూక్ష్మతకూ, పరేంగిత సహిష్ణుతకూ పరమ హర్షం ప్రకటించారు. "జయ వీర హనుమా! జయ దివ్యగుణధామా! జయ మారుతాత్మజా! జయ బ్రహ్మ తేజా! జయ జయ" అంటూ లేచారు. హనుమ శిరస్సుగా, కపివృద్ధులు పక్షాలుగా, కపులు పుచ్ఛంగా, గరుడ వ్యూహాకారంగా గగనానికి లంఘించారు. దేవతలు పుష్పవృష్టి కురిశారు. శిరోభాగంలో బాలసూర్య ప్రభాభాసమానంగా పోతున్న పావనిపైనే ప్లవగపుంగవుల చూపులన్నీ కేంద్రీకృతమైనై. మార్తాండుని తేజస్సు మరుగునపడుస్తూ అంబరాన్ని ఆక్రమించిపోతున్న కపులు హనుమను ప్రస్తుతిస్తూ, కార్య సాఫల్యం తనచే కల్గినందుకు సంతోషిస్తూ, యుద్ధానికి వేడుకవెల్లడిస్తూ, రామ రవిపుత్రుల గౌరవభాజన స్వరూపాన్ని చింతిస్తూ, పక్షిరాజ సహస్రం ఏకాకారంగా పోతున్నట్లు గోచరించారు. దారిలో, నందనవన సుందరమై, అనంత ముదావహమై, అనేక వృక్షవల్లరీ నికరశోభితమై, అప్రధృష్యమై, అర్కపుత్రమాతుల సంరక్షితమై, ఆనందకందమై, అందం చిందించుతున్న మధువనాన్ని మర్కటులు చూచారు. ఆ వనంలోని మధు పరిమళం అగచరులకు ఘ్రాణతర్పణం కలిగించింది. ముకుపుటాలకు ఆ గాలి సోకగానే వ్యూహభంగం చేస్తూ అంగదుని మధుపానానికి ఆ వనంలో దిగేందుకు అనుజ్ఞను వానరులంతా కోరారు.

# మర్కట నాయకులంతా మధువనంలో ప్రవేశించుట

వనచరులంతా వాయుపుత్రుణ్ణీ, వాలి పుత్రుణ్ణి మధువు సేవించాలని పట్టుబట్టి ప్రార్థించారు. హనుమ ఉదాసీనంగా ఊరుకున్నాడు. అంగదుడు వాళ్ళ అభ్యర్థన కాదనలేక పోయాడు. ప్రస్రవణ పర్వతం నుంచి బయలు దేరింది లగాయితు ఇప్పటివరకూ ఆహార పానీయాలు, విశ్రాంతి లేకుండా నలిగివున్న కపులకోరిక తీర్చటం తన కర్తవ్యంగా భావించాడు. కాని, ఆ వనం దధిముఖాదులు రక్షిస్తున్నారు. అది తండ్రి కాలం నుంచీ కిష్కింధానగరానికి అలంకార ప్రాయంగా వుండేదని, అందరి వస్తు జాతం అనుభవంలోకి రాలేదు. అమృతభాండాన్ని దేవతలు కాపాడు తున్నట్లు మధువనాన్ని ప్రభువులు కాపాడుతున్నారు. ఈ సమయంలో ఆజ్ఞ ఇస్తే ఏం ప్రమాదం వస్తుందో, వీళ్ళంతా ఏం ప్రమాదం తెస్తారో అని తికమకపడ్డాడు. అనంతర పరిణామం ఏమైనా అనుచరుల కోరిక తీర్చటమే తనకు ధర్మం అని భావించాడు. వెంటనే అందరికీ వన ప్రవేశానికి అనుమతి ఇచ్చాడు. అనుమతి లభించటంతోనే వానరులంతా సంపూర్ణంగా పండిన సస్యంపై పడిన మిడుతలదండులాగా మధువనాన్ని ఆక్రమించుకున్నారు. ఆడేవాళ్ళూ, పేదేవాళ్ళూ, పాడేవాళ్ళూ, గుమిగూడే వాళ్ళూ, మిత్రుల వీడేవాళ్ళూ, పిన్నలతో కలియబడి ఓడేవాళ్ళూ, దాచే వాళ్ళూ, మీసలు టీజేవాళ్ళూ, పిరుదులతో దేకేవాళ్ళూ, కారుతున్న తేనె నాకేవాళ్ళూ, అయి కపులంతా గగ్గోలుగా సంచరించారు. ఒక కోతి కొమ్మ మీదకు ఎక్కితే మరో కోతి ఆ కొమ్మను వూపి అందకుండా ఇంకో కొమ్మకు దాటుతూంది. శాఖాగ్రం నుంచి క్రిందికి దూకుతూ మధ్యలో కొమ్మను ఒక చేత్తో పట్టుకుని రెండో చేత తలగోకికొంటున్న కోతులు కొన్ని, దగ్గరకు వస్తున్న వాటిని నిష్కారణంగా కిచకిచలాడుతూ పైబడి తరిమే కోతులు కొన్ని, ఒకటి వెక్కిరిస్తే ఒకటి కొక్కిరిస్తూ, ఒకటి లాగితే ఒకటి పడుతూ, ఒకటి పాడుతుంటే ఒకటి నవ్వుతూ, ఒకటి ఏడుస్తుంటే ఒకటి చేతులు తాళంగా చరుస్తూ, జాతి లక్షణమంతా ఆ వనానికి చూర ఇచ్చినై. ఈ విధంగా స్వేచ్ఛా విహారం చేస్తున్న వానర

సైన్యంలో, మత్తెక్కని, తృప్తిపడని, తేనె త్రాగని వనచరం అంటూ మిగల్లేదు. తనివితీర తేనె త్రావి మైకం తలకెక్కి, నిర్హేతుకంగా పండ్లు రాల్చి, కొమ్మలు విరిచి, తీగలు పీకి, చెట్లు పెకలించి కపులంతా ఆ మధు వనాన్ని అల్లకల్లోలం చేశారు.

## దధిముఖుడు వనేచరుల వారించుట

అంతవరకు చూచీ చూడకుండా వున్న దధిముఖుడు వనాన్ని పాడు చేస్తున్న వానరుల చేష్టకు పట్టరాని ఆగ్రహం పొందాడు. కొందరిని కొట్టాడు. కొందరిని తిట్టాడు కొందరిని పట్టాడు. కొందరిని నెట్టాడు. కొందర ముష్టితో మొట్టాడు. తన స్వేచ్ఛకు ఆటంకం కలిగిస్తున్న వనరక్షణాధి కారిని వానరులు పండ్లతో కొరికారు. గోళ్ళతో శరీరం చరిచారు. కొందరు నేలపై పడనెట్టారు. కొందరు దురాగ్రహంతో ఇంకా వనం పాడు చేయసాగారు. వనపాలకుడు ఈ అకాల ప్రళయానికి ప్రభుపుత్రుడూ, మంత్రీ కారణం కావటం చూచి, కడుపు మండి వాళ్ళను తప్పించుకుని తన వారున్న చోటికి తరలిపోయాడు.

## హనుమ దంగదుల ప్రాపున కపులంతా వనంలో స్వేచ్ఛా సంచారం చేయుట

దధిముఖుడు తప్పుకునిపోగానే అంగద హనుమంతులు కపులను చూచి "మీరంతా నిర్భయంగా కడుపార తేనె త్రాగండి. తృప్తిగా పండ్లు తినండి. మీపైకి వనపాలకులు రాకుండా మేం చూస్తాం. అవశ్య కార్యం అకార్యమైనా మీ చిత్తం వచ్చినట్లు కొంత తడవు సంచరిం చండి" అని చెప్పారు. అందదొరకటంతో కొండలు పిండిచేసే ధైర్యం కూడి దూరంగా వున్న పాలకులపైబడి బాదారు. త్రోచారు. కుండలు కుండలు తేనె కొల్లగొట్టారు. కొన్ని కుండలు పగులకొట్టారు. సహజ బలం కొంతా, సీతావార్త తెలియటం కొంతా, అంగదుని అనుమతికొంతా చేరి కోతులు జాతిచేష్టలే చేయసాగినై. కొన్ని తేనె త్రాగితే, కొన్ని మైనం ముండలు చప్పరించినై. కొన్ని మైకంక్రమ్మి కొమ్మనపట్టుకుని ఆకులగుంపుమీద అరకన్నుతో కూర్కినై. కొన్ని కైపెక్కి ఒండొం

టితో త్రోపులాడినై. కొన్ని గర్జించినై. కొన్ని నిద్రించినై. కొన్ని కిచకిచమన్నై. కొన్ని ఏమేమో చేసి హిహీ అన్నై. కొన్ని ఏదో చేసి పైకి ఎగిరినై. కొన్ని ఏమో చేయాలని యత్నం చేస్తున్నై. ఇదంతా చూస్తున్న దధిముఖుడు తన పరివారాన్ని కపులమీదికి కయ్యానికి పంపాడు. వాళ్ళు చేరగానే వనచరులంతా మీదపడి, కాళ్ళతో తన్ని, తోకలతో బాది, పండ్లతో కొరికి, చేతులతో పిసికి, సంఘాన్ని విరుగ పొడిచారు. వచ్చిన వనపాలకులు భయపడి దధిముఖుని చేరి తమ పాట్లు విన్నవించుకున్నారు. "వాళ్ళకు రక్షగా వాయుపుత్రుడున్నాడు. మా మాటలు వినలేదు. పైబడి చిత్రహింస చేశా"రని చెప్పుకున్నారు. రక్షణాధిపతి వాళ్ళను ఓదార్చి "నేనూ వస్తాను. అంతాకలసి వాళ్ళకందరకాపరం అంతం చేద్దాం" అంటూ, వెంటగొని, పెద్ద వృక్షాన్ని పీకి చేతదల్చి ముందు నడుస్తుంటే, తక్కినవాళ్ళు, రాళ్ళు, గుండ్లు, చెట్లుగొని వానరులపైకి నడిచారు.

## తారాసుతుడు దధిముఖుని తన్నుట

తీవ్రయుద్ధానికి సంసిద్ధులైవచ్చిన వనపాలకులు వనంపాడుచేస్తున్న వనచరులపై ఢీకొన్నారు. వాళ్ళు పీకినచెట్లను ఆయుధాలుగా ధరించి తిరుగబడి దొమ్మిగా తలపడ్డారు ఆ పోరాటంచూచి అంగద హనుమదాదులు సంగ్రామ స్థలికి చేరుకున్నారు. తరుహస్తుడై తరుచరుల ప్రహరిస్తున్న దధిముఖుని తనకు పూజ్యుడని అయినా తలపోయకుండా మత్తుతో వాణ్ణి పైకెత్తి నేల రాచి ఒడలు నలియ తన్ని వదిలాడు. ఆ ప్రహరణాలకు అంగ సంధులు ప్రిదిలి, వెల వెలనై రోజకుంటూ, నెత్తురు క్రక్కుతూ, అరచావు చచ్చి, లేచి తక్కినవాళ్ళను ఆపాడు. అంగదులు వదలగా దూరంగాపోయి, పరివారాన్ని చేర్చి, "వీళ్ళక్కడ వుండగనే మనం పోయి ప్రభువుతోనూ, రామునితోనూ, అంగదు డొక్కడే మధువనం పాడు చేశాడని చెప్తాం. పైతామహం, దురాసదం, ఉదాత్తం, ఇష్టవనం కనుక తగిన దండనం విధించి వీళ్ళను దండిస్తాడు. రాజాజ్ఞాతిరస్కారులూ, రాజాజ్ఞాపరిపాలిత జన ధిక్కారులూ అయిన వీళ్ళను చంపించాలె. మనలను అవమానపరచిన వీళ్ళ దుస్థితి కని కసి తీర్చుకోవాలె.

రండి" అంటూ తోడ్కొని శర వేగంతో గగన మార్గాన పోయి, రామ లక్ష్మణ సుగ్రీవులున్న ప్రదేశంలో వ్రాలాడు. ఆర్తి కొన్న మొగంతో, స్వస్థత చెడిన కాయంతో సమీపించి పాదాలపై పడ్డాడు.

## దధిముఖుడు కపుల దుశ్చర్యలు కపిపతితో చెప్పుట

హఠాత్తుగా వచ్చి పాదాలపై బడిన దధిముఖునీ, వెంటవున్న వన పాలకులనూ చూచి భ్రాంతుడయ్యాడు "భయమెందుకు. లేచి విషయం వినిపించు" మంటూ ఆజ్ఞాపించాడు. వణుకుతూ లేచి దధిముఖుడు "ప్రభూ! నీ తండ్రి తరంలోనూ, నీ అన్న తరంలోనూ, నీ తరంలోనూ ప్రవేశ దుష్కరంగా, భద్రంగా కాపాడ బడుతున్న మధువనానికి నేటికి కాలం మూడింది. ఒక్క తేనె పట్టులేదు. ఒక్క తీగ లేదు. ఒక్క చెట్టు లేదు. అంతా సర్వనాశనం అయింది. యువరాజు వెంట నుండి కపులవే పాడు చేయించాడు. అడ్డంపోతే మా పెద్దరికం, నీ శాసనం కూడా చూడకుండా మమ్మల్ని బాదదన్ని దెబ్బలు కొట్టారు. మీరు స్వయంగా చిత్తగించండి. తేనె త్రాగారు. పళ్లు మెక్కారు. నేనేమీ అనలేను. నిష్కారణంగా మధుభాండాలను బ్రద్దలుకొట్టి, కాలువల్లో ఒలకబోసి, పళ్ళన్నీ దుర్వినియోగం చేశారు. ఏమంటే అందరినీ తన్నారు. ఇంకా అక్కడే ఉన్నారు. ఇక ఏలినవారి ఇష్టం" అని చెప్పి ప్రక్కకు తప్పుకున్నాడు. ఆ వన రక్షక ప్రముఖుడు ఏమిటో సుగ్రీవునితో ఏం చెపుతున్నాడో తెలియక సౌమిత్రి వచ్చి "మిత్రుడా! అతడేం అంటున్నాడు? ఎందుకు ఏడుస్తున్నాడు? ప్రమాద కార్యం ఏమిటి?" అని ప్రశ్నించాడు. రామానుజునకు కపిసూనుడు అతని రాక గూర్చి చెప్పసాగాడు. సౌమిత్రి శ్రద్ధగా వింటున్నాడు.

## కపిరాజు సౌమిత్రితో హనుమదాదులు మధువనంలో విహరించటం చెప్పుట

"మిత్రమా! వీరు మధువన రక్షణాధికారి. పేరు దధిముఖుడు. దక్షిణ దిశగా తరలిపోయిన అంగదాదులు తిరిగివచ్చి ఆనందంకొద్దీ మధువనంలో చొచ్చి, తేనెత్రావి, ఫలాలు భుజించి స్వేచ్ఛావిహారం చేస్తున్నారట. అడ్డ

గించిన వీళ్ళను తన్ని తగిలేశారట. ఆ వృత్తాంతం నాకు చెప్పవచ్చాడు. నేనిందుకు వాళ్ళను నిజంగా దండించవలసిందే. కాని, కొంత ఆలోచించ వలసిన అవసరం వచ్చింది. ఆ దిశ వెదకటానికి పోయినవారంతా వానర ప్రముఖులు. జానకిని హరించింది రావణుడు కదా? అతడుండేది లంక. అందుకని శక్తిమంతులందర్నీ ఏరి పంపించాను. ఇప్పుడు వారంతా తిరిగివస్తూ వనంలో ప్రవేశించారు. మధుపాన ఫలభక్షణంతో తృప్తిపడక వనాన్నే ధ్వంసం చేశారట. ఆ వనంలో రాజానుమతి లేకుండా మూడు తరాలుగా ప్రవేశం ఎవరికీ లేదు. అధికరించితే చావు తప్పదు. ఈ సంగతి వారికందరికీ తెలుసు. హనుమజ్జాంబవంతాదుల సమక్షంలో కాని కార్యం జరిగింది. వీరంతా నా ఆజ్ఞను పాలించేవారే కాని తిరస్కరించేవారు కారు. ఇది తెలియక చేసినదికాదు. బుద్ధిపూర్వకమే. దండనకు ముందు ఇక్కడే వున్న ధర్మ సూక్ష్మం పరిశీలించాలి. వచ్చేవాళ్ళు ఎకాఎకి ఇక్కడకు రాక వనప్రవేశం చేయకూడని రీతిగా చేశారు. ఇది అకృతకృత్యులవని అని తలచరాదు. ఆహారార్థం. అందులో మధుపానంకోసం మధువనంలో చొచ్చినారంటే, వారు కార్యం సాధించి వస్తున్నారన్నమాట. మీ వదిన కష్టలవే చూడబడింది. నామాట ముమ్మాటికి సత్యం. ప్రియవన విధ్వంసానికి, జానకీ దర్శనానికి సంబంధం వుంది. జలనిధి చెలియలికట్ట ఎప్పుడు దాటుతుంది? మహాపర్వదినాల్లోనే దాటుతుంది. అది గ్రహ సరి పక్తి వల్ల జరుగుతుంది. తీరం దాటరాదన్నదినిగ్రహం కాదు నిర్ణయం. అలాగా సమస్థాయిలో నా ఆజ్ఞ దాటరు. కార్యసాధకులు ఆహార నిద్రలు చూడరు. అందులో మధుపానం అసలే వాంఛించరు కదా? ఇది అసాధారణ ధర్మం. ఆమెను చూచామన్న ఆనందంతో అంతవరకు పడినశ్రమను అప నయించుకోటానికి అందుకు దిగారు. పరిమితి మీరి మధుపానంచేశారు. జాతిచేత కోతులు. గ్రోలింది మత్తుపదార్థం. తల తిరిగింది. ఆ కైపులో ఏంచేశారో వాళ్ళకే తెలియదు. పంపినపని ఫలసిద్ధి పొందింది. సాధించే ఈ విజయాన్ని సాధించాడు సృష్టిలో ఏ ప్రాణికీలేని శర్వశక్తులు పావ మానికేవున్నై. మంత్రి జాంబవంతుడు. హనుమంతుడు రక్షకుడు. అస మాన బలాఢ్యుడు అంగదుడు అధిపతి. మైందద్వివిదులు మానవాతీత మూర్తులు. ఇటువంటివారు పూనుకున్న కార్యం ఎందుకు ఫలించదు

అంగదాదులు వనం భంగించారు. వారించబోయినవాళ్ళ అంగాలను నరియ దంచారు. ఇది ఊహకందని విషయం. జానకీ క్షేమవార్తకొని రాకుండా వచ్చినవారైతే, బ్రహ్మదత్త మధువన ధ్వంసానికి దిగుతారా? రాదగిన గడువు మీరి ప్రాణాలు వదలవలసిన సమయంలో, నావనంలో, నాకు తెలిసేలాగా పెద్దకార్యం చేస్తారా? మిత్రమా! నాశ్రమ సిద్ధించింది. జానకీ వార్త తెలిసింది. నామాటదక్కింది. నాకు కృతఘ్నతాపాపం దూరమైంది. మలయమారుతం వీస్తోంది మనస్సు ఆనందంతో పులకితమవుతోంది" అని ముగించాడు.

## కపులను వెంటనే రమ్మని సుగ్రీవుడు దధిముఖునిచే కబు రంపుట

రవిపుత్రుడు చెప్పిన వృత్తాంతం రాఘవుడు విన్నాడు. పరమ ప్రహృష్టతతో సంతుష్టుడైనాడు. వానరేంద్రుడు వనపాలకుడైన దధిముఖుని చూచి. "నీవు చెప్పింది విన్నాం. వాళ్ళు చేసింది ప్రమాద కార్యం కాదు. ప్రమోద కార్యం అని గుర్తించాం. వాళ్ళు కార్యసాధకులై వచ్చారు. ప్రశంసాపాత్రులే కాని దండనార్హులు కారు. కనుక క్షమించటం జరిగింది. నీవు వెంటనే అంగదాదులతో నా పలుకులుగా ఇలా చెప్పు. "మీ రాకకు హర్షం పొందాం. మీ విజయానికి గర్వం చెందాం. మీ చేత క్షమించాం. కాలాతిక్రమణ దోషాన్ని గమించాం. వైదేహీ కుశల వార్త, వనచరుల కార్యకలాపం రఘునందనుతో మీరాజు రవిపుత్రుడు వినకోరుతున్నాడు. కాలహరణం కాకుండా కపులంతా వెంటనే రండి" అని. వనచరపతి ఆనతితో దధిముఖుడు కోపం, అవమాన ప్రతీకారానికి బదులు ఆనందంతో ఆహ్వానించటానికి తన్నే పంపుతున్నందుకు మురిపిస్తూ, వృత్తాంతం వినిపించటానికి వేగంగా ఎగిరిపోయాడు. తన సంకల్పం వికల్పం లేకుండా సిద్ధించినందుకు ఇనజుడు పులకితగాత్రుడై పొంగి పోయాడు.

# హనుమదాదులు సుగ్రీవుని చూడవచ్చుట

తరవాత పుత్రుల ఆజ్ఞగొని దధిముఖుడు మధువనంలో దిగాడు. అప్పటికి అంగదాదులంతా కైపు దిగి, మధువారి మూత్రించి, సేదదేరి, యథాస్థితికి వచ్చారు. దిగిన వన రక్షకుడు అంగదుని పాదాలకు నమస్కరించి "మా సేత రోషించి దోషంగా చూడవద్దు. అజ్ఞానంతో అడ్డుకున్నాం. యువరాజవు నీవు. ఉద్యానం నీది. నేరక చేసిన తప్పు క్షమించు. మీరు వనం చేరటం, మమ్మల్ని తరమటం అంతా పెద్ద ప్రభువుకు చెప్పాను. ఆయన సంతోషంతో మిమ్మల్ని త్వరగా రావలసిందని చెప్పమన్నారు" అని సుగ్రీవాజ్ఞ వినిపించాడు. అది విని అంగదుడు "ఇదంతా దాశరథులు వినే వుంటారు. మీరంతా తృప్తిగా తేనెలు త్రాగి బడలిక దీర్చుకున్నారు. ఇంకి ఇక్కడ చేయతగినదేముంది? ప్రభు దర్శనానికి పోదమా? మీ అభిమతానుసారం నడుస్తాను. నేను యువరాజునైనా, ప్రస్తుతానికి మీ కపిపతినైనా కార్య నిశ్చయంలో మీ మాటకే విలువిస్తాను. అధికారం వున్నంత మాత్రాన స్వార్థంగా శాసించి అధికార దుర్వినియోగం చేయటం నాకు చేతకాదు. ప్రజాభిమతం ప్రభువులకు శిరోధార్యం" అని చెప్పాడు. ప్లవగులు అంతా అంగదుని మాటలకు హర్షం చెందారు. "ప్రభువెవ్వడూ ఈవిధంగా పలుకడు. అధికార దర్పంతో పనివారికి ఆకులూ, కానివారికి కంచాలూ వేయించే వాళ్ళేకాని ప్రతిభను గుర్తించి గౌరవించేవారు అరుదు. యువరాజు భావి నృపరాష్ట్ర తిలకుడు" అని శ్లాఘించి, "మేం నీ యాజ్ఞా వర్తులమే కాని స్వతంత్ర మార్గానుయాయులం కా" మన్నారు. "అయితే అందరం కిష్కింధకు పోదాం. రమ్మని రాజు వార్త పెట్టారు. బయలుదేరండి" అంటూ ముందుగా మింటికి అంగదుడు లంఘించాడు. అతని వెంటనే యంత్ర క్షిప్త పర్వతాల వలె కపులంతా ఆకాశానికి ఎగిరి జలధర ఘోషంలాగా గర్జిస్తూ ప్రయాణం సాగించారు. దక్షిణ దిశ కేగిన కపులు వచ్చారనీ, సీత జాడ చెప్పారనీ మిత్రుని వల్ల విన్నా, తన ఊరటకై మిత్రుడు చెప్పిన మాటలుగా భావించి రాముడు మిక్కిలి బాధపడ్డాడు.

# రవిసుతుడు రామునకు ధైర్యం కలిగించుట

జానకి జాడ తెలిసిందని రాము చెప్పినా విశ్వసించక మిత్రుడు నిశ్వసిస్తూ ఉండటం చూచి సుగ్రీవుడు "మిత్రుడా! శుభవార్త విని కూడా ఎందుకు శోకిస్తావు? అందులో వున్న నీతో అసత్యం చెప్తారా? రామ కార్యం చేసిన కపులను ఊరకే నమ్మిస్తానా? నాకు వాళ్ళ సంగతులు తెలుసు. నీకింకా శంక ఎందుకు? నీ దగ్గరికి మా వారు కుశల వార్త కొనితెచ్చారు. అంగదుడు కార్య విఘ్నమే కలిగితే జీవించడు. బ్రతికినా ఆజ్ఞ లేకుండా నా మధువనంలో ప్రవేశించి నాశనం చేసేంత గుండె ఎక్కడిది? ముమ్మాటికీ ఆమె క్షేమ వార్తతో వస్తున్నారు. నీ తృప్తి కోసమే త్వరగా రమ్మని కబురుపెట్టాను. కొలది క్షణాల్లో వారు వస్తారు. నా మాటలెంత విలువున్నదో నీవే గ్రహిస్తావు. ఆ వార్త తెచ్చింది హనుమంతుడే. ఇంకొకరికి శక్తి లేదు. జాంబవంతుడు మంత్రిగా, హనుమ రక్షకుడిగా, అంగదుడు నేతగా వస్తున్న వ్యూహం వ్యర్థం కానే కాలేదు. నీవు సంతోష వార్త వినటానికి స్వస్థ చిత్తంతో వుండు" అంటూ ఓదార్చాడు. రాముడు కొంతలో కొంత కోలుకున్నాడు.

# హనుమంతుడు సీత క్షేమ వార్త చెప్పుట

ఇంతలో ఆకాశం దద్దరిల్లేట్టు జయధ్వానాలు చేస్తూ వస్తున్న కపుల కిం కిం కారం ఆకాశాన్ని ఆవృతం చేయటం అర్కసూనుడు గమనించి, ఆనందాంచితవదనుడై, రామ లక్ష్మణ సహితంగా పాదపచ్ఛాయలో ఆసీనుడైనాడు. అంగద హనుమాన పురస్కృతులై అంబర పథాన్నుంచి అవనిపుల అంతికంలో కపులు అవతరించారు. వెంటనే హనుమ ముందుకు వచ్చి రాముని పద పద్మాలపై శిరసుంచి నమస్కరించి, "శీలవతి, నియత, ప్రాణయుక్త, దేవి, సీతామాత క్షేమం" అని తెలిపాడు. రామ కార్యం ఫలించిందని రవి పుత్రుడు సంతసించాడు. ఆ పలుకులు కర్ణపేయం కాగా రామ లక్ష్మణులు ప్రియం తెలిపిన హనుమపై ప్రీతి పూర్వక దృక్కులు పరగించారు. తక్కిన కపులంతా తరణి కులోద్భవు

లకు, తరణి పుత్రునకు అభివాదంచేసి సీతా వార్త శ్రవణ పర్వం కావించి నారు. ఆ వాక్యాలు విన్న శ్రీరాముడు "సీత ఎలా వర్తిస్తున్నది? నా వియోగంలో ఆమె ఏ నియమం పాటిస్తోంది? విపరంగా వినిపించం"డని కోరాడు. చూచిన వాడు హనుమ కనుక ఆతనినే చెప్పుమని అగచరు లంతా వేడుకున్నారు. హనుమంతుడు లంకలో జానకి నివసించిన దిక్కుకు తిరిగి, శిరోఘటితాంజలిపుటుండై, ధ్యానించి, వినయంతో గత గాథ కర్ణ సుఖంగా, క్లుప్తంగా, గంభీరంగా, మహార్థవంతంగా చెప్ప మొదలిడినాడు

## శ్రీరామునకు హనుమ సీత లంకలో వున్నదని వివరించుట

"రామచంద్రా! అవధరింపు. సంపాతివల్ల జానకమ్మ లంకలో నున్న వార్త తెలిసి శతయోజనాయత సాగరాన్ని తరించి రావణ పాలిత లంకా ద్వీపం ప్రవేశించాను. అక్కడ శింశుపా వృక్షంక్రింద ప్రాణాలు నీ యధీనం చేసి శరీరమాత్ర విభవయై వున్న సీతామాతను దర్శించాను. రక్షస్త్రీల గర్జనలతో గుండె చెదరి మృతప్రాయగా "రామ, రామ" అంటూ శోక దేవతవలె చూడలేని విషాద రూపంతో క్రుసుక్కుతూంది. మాసిన ఒంటి చీరె. జడలు కట్టిన కేశాలు. కటిక నేల పడక. హేమంత నళినివలె నీ ధ్యానంతో నలసి వుంది. నేను చూచే సమయంలో రావణుని యత్నం వమ్ము చేయ ఆత్మహత్యకు ఉద్యుక్తురాలవుతూంది. సమయోచితంగా నే నామెను సమీపించి, మీ కులగౌరవం, మీ రూపురేఖలు తెలిపి నమ్మించి మరణింపకుండ చేశాను. నా మాటలకు ఆమె ప్రీతురాలైంది. నన్ను పుత్ర నిర్విశేషంగా చూచి, మనోభావాన్ని ఇలా చెప్పింది.

## హనుమ శ్రీరామునకు సీత వాక్యాలు చెప్పుట

"హనుమా! నీవు చూచిన దృశ్యం చూచినట్లు నా పతితో చెప్పు. అన్ని ఆభరణాలు వీడినా ఈ చూడామణి కష్టంతో కాపాడుకున్నాను.

ఇది నా పతికి మిక్కిలి ప్రీతి పాత్రం. దీన్ని నా మనోహరుని దర్శించినట్లు భావించి చూసుకుంటూ జీవిస్తున్నాను. ఇది నీకిస్తున్నాను. దీనితో నా ప్రాణం, నా సందేశం పంపుతున్నాను. దీన్ని గ్రహిస్తూ, తిలకం చెమ్మగిలి గండ భాగంపై జారితే తుడిచి మణిశిలతో తిలకం దిద్దినప్పటి మమకారం గురుతు చెయ్యమని చెప్పు. ఇక నెల మాత్రమే నీ రాకకోసం బ్రతుకుతాను. ఆపై రావణ యత్నం భంగంగా ప్రాణాలు వదలుతాను" అని చెప్పింది. ఆమెను అగ్ని స్పృశించి పవిత్రుడవుతాడు. నీ చరణ సాక్షిగా నేనామెను చూశాను. ఆమె శరీరం కృశించినా అఖండ పాతివ్రత్య తపశ్శక్తుల ప్రాతరుదయభాను కాంతులవలె ప్రకాశిస్తున్నై. ఇదిగో చూడామణి. నీ సతి ప్రతినిధిగా దీన్ని తెచ్చాను. గ్రహించు. నా ఏలిక నా తలపై ఉంచిన భారం, నన్ను దూతగా గ్రహించిన నీ ఋణం తీర్చుకున్నాను" అని చెప్పాడు.

## సీతాసతి పంపిన చూడామణి చూచి శ్రీరాముడు శోకించుట

రాముడు నష్ట ద్రవ్య లాభం కలిగినట్లు ప్రేమతో మణి గ్రహించాడు. తమ్ముని కౌగిలించుకుని ఘోరంగా విలపించాడు. రవిపుత్రుని చూచి "మిత్రుడా! దీన్ని చూస్తుంటే లేగదూడను నాకుతూ స్తన దూరంగా కరిగే ధేనువువలె అవుతున్నాను. అధ్వరంలో శక్రుడు నా మామకిచ్చాడు. ఇది జలోద్భవం. ఇది పెండ్లిలో నా మామ సీత తలపై అలంకరించాడు. ఆమె ఎంతో అందంగా ప్రకాశించి నా మనస్సు దోచికొన్నది. నా మామా, నా తండ్రీ, సీతా నా హృదయంలో మెదలుతున్నారు. హనుమా! ఎండిన పైరుకు నీరులాగా సీత గుణాలు చెప్పి నన్ను బ్రతికించు. ఆమె లేక మణి వచ్చింది. ఇంతకంటే దుఃఖం ఏముంది? నెలవరకు జీవిస్తే సీత చిరజీవి. మిత్రమా! నన్ను ప్రియా నికటానికి చేర్చు. వార్త తెలిసి క్షణం వ్యర్థం కానీయను. రోగికి మందు వలె మందు సీతా సందేశం మళ్ళీ చెప్పు. నన్ను బ్రతికించు" అని రాముడు వాపోయాడు. రవిపుత్ర లక్ష్మణులు హనుమతో జానకీ సందేశం చెప్పుమని కోరారు.

## హనుమ అభిజ్ఞానసంగా, కాకాసుర వృత్తాంతం రామునకు తెల్పుట

మారుతి వాళ్ళ కోరిక శిరసావహించి, తనకూ, మైథిలికీ జరిగిన సంభాషణ క్రమం సాకల్యంగా వినిపించి "రామచంద్రా! సీతమ్మ ఈ కథ ప్రత్యేకంగా గురుతుచేయుమన్నది. చిత్రకూటంలో నీతో కూడి నిద్రిస్తూ ముందుగా లేచిందట. కాకి తన నఖంతో ఆమె ఉరోజం చీరిందట. అనంతరం నీవామె తొడపై నిద్రించినావట. ఆ కాకి మళ్ళీ వచ్చి చంచువుతో పొడుస్తూ బాధిస్తుంటే రక్తం స్రవించిందట. ఆ వేడి రక్తం నీ మీద పడగా, ఓర్చుకోలేక ఆమె నిన్ను లేపిందట. నీవు కదలగానే కాకి దూరంగాపోక ఛాతిపై వ్రాలిందట. విషయం తెలిసిన నీవు దర్భను బ్రహ్మాస్త్రంగా మంత్రించి వదలితే అది లోకాలు తిరిగి నీ శరణుజొచ్చి, తన కన్నిచ్చి చావు తప్పించుకుందట. ఇంత ధనుర్విద్యావిదుడు, దయాపయోనిధి శత్రువుపై అస్త్రం ఎందుకు విడువలేదు? ఇకనైనా త్వరపడి తన సతిని కాపాడుకొమ్మని చెప్పింది. మరదిని మన్నించుమని కోరింది. నే నామెను నమ్మ పల్కి చూడామణి గ్రహించి మరలి వస్తుంటే, నిన్నూ, తన మరదినీ, నీ మిత్రుణ్ణి పేరు పేరున పేర్కొని కుశల ప్రశ్నలతో క్షేమం అడిగానని చెప్పుమన్నది. నాతో రానని, తన పతి దైత్యపతిని చంపి తన పాణి గ్రహించవలసిందని, నెల మాత్రమే బ్రదుకుతానని, ముందు జరిగే సమస్త కార్యం నీ మీద పెడుతున్నానని, దూతవైనా, బిడ్డవైనా నీవేయని నాకు చెప్పింది. "అమ్మా! ఆరాటపడకు. నెలలో పక్షం మాత్రం చాలు. నా ఏలికతో గూడి నీ పతీ, మరదీ, కపినాథులూ జలధి దాటి, లంక చొచ్చి, సబాంధవంగా రావణుని కూల్చి నీకు సంతోషం కలిగిస్తారు. నీవు కోరినట్లే రావణ విజేతయై నీ పతి నీ కరగ్రహణం చేస్తాడు" అని ప్రమాణంచేసి నా తల్లిని నమ్మించి నీ దర్శనార్థం వార్త గొని వచ్చాను. నా సందేశం సీతమ్మకు ధైర్యం కూర్చినట్లే, ఈ సందేశం నీకు ధృతి కల్గించి కర్తవ్యపాలకునిగా

చేస్తుందని నీ చరణదాసుడు వీరాంజనేయుడు వినయ వినమితోత్తమాంగుడై వేడుకుంటున్నాడు.

సుందరకాండ సమాప్తం

నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ, నమోఽస్తు దేవ్యై జనకాత్మజాయై
నమోఽస్తు వాతాత్మజ దేవరాయ, నమోఽస్తు సర్వేశ దయాయ తస్మై.

శ్రీరామచంద్రార్పణమస్తు

ఇది లోకోత్తరకాండ, మాదికవి యెంతో సర్వసుందరాకృతుల్
హృదయంబుల్ వెలిగింపనట్టులగ్ జూపించెన్ దపశ్శక్తితో,
హృదయసుందరము, తెల్గున పరివర్తింపంగ జేసెన్ సుధా
స్వాదమై, మానవలోకి సంతరణ ధామం బొప్పునా చేత శ్రీ
ప్రదమై పావని; దీనినిం జదివి సర్వశ్రేయముల్ గాంచుడీ.

# ఎమెస్కో వచన రామాయణం

శతావధాని కోట వీరాంజనేయ శర్మ



Volume Eight

Price Rs. 5/-

COVER PRINTED AT SUPREME ARTS HYDERABAD-500 020